# విషయానుక్రమణిక





# సర్వోదయం: కమ్యూనిజం

## ఆచార్య వినోబాభావే

(ఆచార్య వినోబా భావే 'కేరళ జనత' విలేఖరి అడిగిన ఒక ప్రశ్నకు సమాధానం యిచ్చేరు. దానినీ, కల్లడిలో జరిగిన సర్వోదయ సమ్మేళనంలో ఆయన యిచ్చిన ముగింపు ఉపన్యాసం లోని ఒక భాగాన్నీ దిగువ యిస్తున్నాం.)

ప్రశ్న: సర్వోదయానికీ మార్క్సిజానికీ మధ్య రాజీ సంభవమా?

వినోబాజీ: మార్క్సిజం అనేది మనచుట్టూ ఉన్న పరిస్థితుల్నీ పరిసరాల్నీ దృష్టిలో ఉంచుకోకుండా అమలు జరిపే సిద్ధాంతం కాదు. అది ఆచరణకు సంబంధించిన ఒక పద్ధతి. దేశకాల పరిస్థితుల్నిబట్టి అది మారవలసి యుంటుంది.

రష్యాలో విప్లవం సరిగ్గా మార్క్స్ చెప్పిన పద్ధతిలోనే జరగలేదు. రష్యా అనుసరించిన పద్ధతి చైనాలో అనుసరింపబడలేదు. మారుతూన్న దేశకాల పరిస్థితుల్నిబట్టి మార్క్సిజంకూడా తన పద్ధతులను మార్చుకోవలసి వుంటుంది. యూరపులో పెట్టుబడిదారీ విధానం అతిహీనతమైన దశలో

ఉన్నప్పుడు మార్క్సిజం ఆవిర్భవించింది. ఆ వ్యవస్థను ప్రతిఘటించడానికి మార్క్సిజం ఉపయోగింపబడింది. ఈ ఒక్క విషయాన్ని బట్టే, అది ఎల్లప్పుడూ సర్దుబాట్లకు మార్పులకు లోబడి యుంటుందని తెలుసుకోవచ్చు.

కాని సర్వోదయం ఒక జీవిత లక్ష్యం. ఇతర సిద్ధాంతాల్లోని, 'ఇజం'లలోని మంచిని యిముడ్చుకోడానికి కది ఎల్లప్పుడూ సిద్ధంగా, కుతూహలంగా ఉంటుంది. ఏ సిద్ధాంతాన్నీ ప్రతిఘటించడాని కది ఉద్భవించ లేదు; ఏ సిద్ధాంతంతోనూ పోటీచేయడం దాని ఉద్దేశంకాదు. రోజురోజుకు అది పురోగమిస్తూ ఉంటుంది. మంచి అంతటినీ తనలో లీనం చేసుకుంటూ ముందుకు సాగుతుంది. అందుచేత మార్క్సిజానికి కూడా అందులో స్థానం ఉంది. కాబట్టి సర్వోదయానికీ మార్క్సిజానికీ శాశ్వత సంఘర్షణ అంటూ లేదు.

మన దేశంలో మార్క్సిజం మరో వైఖరి నవలంబించి, భారత దేశ సంస్కృతికి, సంప్రదాయానికి తగిన కొత్తమార్గం చేబడుతుందని నేను ఆశిస్తున్నాను. నేనొకసారి ఒరిస్సాలో పర్యటిస్తున్నప్పుడు కొందరు కమ్యూనిస్టు మిత్రులు నావద్దకు వచ్చి, శాంతి విజ్ఞప్తిమీద సంతకంచేయమని కోరేరు. నేను వారితో ఒక్కొక్క భూదాన పత్రం ప్రపంచశాంతికి యిచ్చే ఒక్కొక్క ఓటు అనీ, శాంతి విజ్ఞప్తిమీద సంతకంచేసినంత మాత్రాన ప్రయోజనం ఉండదనీ చెప్పేను. ఒకటిన్నర సంవత్సరాల తర్వాత వారిలో ఒకాయన నామాటల ప్రాధాన్యతను గ్రహించికాబోలు, తమిళనాడ్ వచ్చి, భూదానోద్యమంలో నాతో కలిసి పాదయాత్ర చేసారు.

మార్క్సిజం మన దేశపరిస్థితుల కనుగుణ్యంగా ఉంటేనే ప్రయోజనకరం. ప్రజల శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని పనిచేస్తేనే అది వర్ధిల్లగల్గుతుంది. మార్క్సిజం తన సిద్ధాంతాన్ని మార్చుకోడానికి నిరాకరిస్తూ ఒక ఆదర్శంగానే ఉండిపోతే, మానవజాతికి దాని ప్రయోజనం ఉండదు. దేశకాల పరిస్థితుల్ని బట్టి ఎప్పటికప్పుడు చురుగ్గా మారడం బుద్ధిమంతుని లక్షణం.

గంగానది అంతకంతకు వెడల్పు అవుతూ చివరకు సముద్రంలో కలిసినట్లు మార్క్సిజంకూడా ఏదో ఒక రోజున సర్వోదయంలో కలుస్తుందని ఆశిస్తాను. బహుశా కమ్యూనిస్టు మిత్రులు నాతో భేదిస్తారు; దీనికి వ్యతిరేకమైన పరిణామం జరుగుతుందని వారనుకోవచ్చు. వారి అభిప్రాయాల్లో వారికెంతనమ్మకముందో, నా అభిప్రాయాల్లో నాకంత నమ్మకముందని వారికి చెప్పదలచుకున్నాను.

సర్వోదయం యొక్క తాత్విక పునాది భారత ప్రజల సాంస్కృతిక సంప్రదాయానికి, పరిస్థితికి అనుగుణ్యమైనది. చాల స్వల్పమైన సర్దుబాట్లు చేసుకుంటే సరిపోతుంది. కాని మార్క్సిజం పెద్దపెద్ద సర్దుబాట్లు చేసుకోవాలి. కనుకనే, మార్క్సిజం సర్వోదయంలో లీనమవుతుందని నా అభిప్రాయం. భవిష్యత్తు ఇదే నిజమని రుజువుచేస్తుంది. కమ్యూనిస్టు మిత్రులు నాకు స్వాగతమిస్తున్నారు. వారిని నేను ప్రేమిస్తాను. ఇక్కడ (కేరళ) కమ్యూనిస్టు మంత్రివర్గం రాజ్యాంగ చట్ట పరిధుల్లో పరిపాలన సాగిస్తామని ప్రకటించింది. మార్క్సిజంలో విశ్వాసముండేవారు కొత్తపరిస్థితులకు తగినట్లు తమ

వైఖరిని మార్చుకొంటున్నారనడానికి యింతకన్న నిదర్శన మేమి కావాలి?

♦ ♦ ♦ ♦

కమ్యూనిస్టులకు దౌర్జన్యంలోను, విధ్వంస కార్యక్రమంలోను విశ్వాసం ఉందని కొందరి అభిప్రాయం. నా దృక్పథానికీ వారి దృక్పథానికీ తేడా ఉన్నమాట నిజమే. వారి ఆలోచనా విధానం (Ideology) మంచిదని నేను వారితో చెప్పాను. కాని కమ్యూనిజం విధ్వంస కార్యక్రమానికి కట్టుబడి యుందని నేననుకోడం లేదు. కమ్యూనిస్టుల ఆలోచనా విధానం పరిశీలించదగ్గది. ఒక అద్భుతమైన భావం అందులో ఉంది. అంతకు పూర్వపు ఆలోచనా ధోరణుల్లో అది లేదు. నే నావిషయం యిక్కడ చర్చించదలచుకోలేదు. నే నిదివరకే కమ్యూనిజాన్ని గురించి చర్చిస్తూ ఒక వ్యాసం వ్రాశాను. అందులో మార్క్సుని ఒక మహర్షిగా పేర్కొన్నాను. మార్క్సు రచనలను చదవడంవల్ల అసంఖ్యాకమైన ప్రజల్లో అద్భుతమైన మార్పువచ్చింది. కాని కమ్యూనిస్టులు మానసిక పరివర్తనలో తమకు విశ్వాసం లేదంటారు. వారితో నేను భేదించే ముఖ్యమైన అంశాల్లో యిదొకటి. వారి జీవితాలే హృదయ పరివర్తనకు తార్కాణంగా ఉన్నప్పుడు తమ తాత్విక సిద్ధాంతంలో హృదయ పరివర్తనకు స్థానంలేదంటారెందుచేత – అని వారిని ప్రశ్నిస్తున్నాను. కాబట్టి కమ్యూనిజం స్వతస్సిద్ధంగా చాల మంచిదనీ, గొప్పదనీ నే నభిప్రాయ పడుతున్నాను. అయితే, దాన్ని సాధించడానికి మార్గ మేమిటి? అనేది ప్రశ్న.

మానవుని హృదయంలో దుష్టత్వం లేదని కమ్యూనిస్టులు నిస్సందేహంగా అంగీకరిస్తారు. ప్రేమద్వారానే గాని వాదనద్వారా ఎవ్వరూ దేన్నీ వ్యతిరేకించరు. ఎందుచేతంటే, ఒక గొప్పఘటన జరిగిన తర్వాత రాజ్యాంగ యంత్రం డుల్లిపోతుందని (withering away of the State) వారి విశ్వాసం. దీన్ని నమ్మేవారు, నిస్సందేహంగా హృదయ పరివర్తనను కూడ నమ్మవలసి యుంటుంది. అట్టి విశ్వాసమే లేకపోతే, ఏ దశలోనూ రాజ్యాంగయంత్రాన్ని రద్దుచేయడం సాధ్యంకాదు. కాని వారు ఒకానొకదశలో మాత్రమే రాజ్యాంగ యంత్రం రద్దుచేయబడుతుందని గట్టిగా నమ్ముతారు. ఇది తీవ్రంగా ఆలోచించవలసిన సమస్య.

కొందరు, రాజ్యాంగయంత్రం యొక్క అవసరంలేని సత్యయుగం ఒకానొకప్పుడు ఉండేదని నమ్ముతారు. మరికొందరు అసలు సత్యయుగమే లేదని, ముందుముందు అది రావలసి యుందనీ, వచ్చితీరుతుందనీ అంటారు. పూర్వమొకప్పుడు సత్యయుగం ఉండేదని చెప్పేవారు సాంప్రదాయకులు; ముందుముందు సత్యయుగం రావలసి యుందనేవారు కమ్యూనిస్టులు; సాంప్రదాయకులు, కమ్యూనిస్టులు కూడ సత్యయుగంలో విశ్వాసం గలవారే. గతించినదాన్ని సత్యయుగం అంటారు ఒక గ్రూపు, మరోగ్రూపు రానున్నదానిని సత్యయుగం అంటారు. కాని నేను చెప్పేదేమంటే: భూతకాలం, భవిష్యత్కాలం కూడ నా చేతుల్లో లేవు; వర్తమానకాలమే నా చేతిలో ఉంది. అందుచేత సత్యయుగం వర్తమానకాలంలోనే సాధ్యమయే టట్లు చేదాం. ఇదే మా మధ్యగల తేడా. సాంప్రదాయకులు

సత్యయుగ మిదివరకే గడచిపోయిందంటారు; కమ్యూనిస్టులు ముందుముందు ఏర్పడాలంటారు. సర్వోదయవాదులు దాన్ని తక్షణమే సాధించడానికి ప్రయత్నిస్తున్నారు. పై రెండు తరగతులవారు మనల్ని వ్యతిరేకించనూవచ్చు; మనతో సహకరించనూవచ్చు.

జనసంఘపార్టీకి చెందిన కొందరు నన్ను కలుసుకొంటూ ఉండేవారు. వారు నాతో యిలా చెప్పేవారు: "మీరు అహింసను గురించి చెబుతూ ఉంటారు; అది కలియుగంలో ఎన్నటికీ ఆచరణ యోగ్యం కాదు; గతించిన సత్యయుగంలోనే అది సాధ్యం." వీరు సాంప్రదాయకులు. వర్తమాన కాలంలో అహింస సాధ్యంకాదని వీరంటారు. మన మొక ఊహాజగత్తులో విహరిస్తున్నామని కమ్యూనిస్టు లంటారు వారిలా చెబుతారు: "ప్రస్తుతానికి మనం దౌర్జన్యాన్ని ఉపయోగించేందుకు సిద్ధంగా ఉండాలి. కాని ఉత్తరోత్తరా అహింస సిద్ధిస్తుంది. అంటే, ఉత్తరోత్తరా అహింసను సాధించేటందుకు యిప్పుడు కొద్దిగా హింసను ఉపయోగించాలి; అందుకు మనం సిద్ధంగా ఉండాలి. అందుచేత మీరు అహింసను కొద్దిగా ప్రక్కనపెట్టండి." అయితే ఒకటుంది. మనం యిప్పుడు కొంత దౌర్జన్యం చేయడానికి మానసికంగా తయారయితే, ముందు ముందు అహింస అసలే సాధ్యపడకపోవచ్చు. కాబట్టి యీ విషయంలో మనం వారితో భేదిస్తాం.

సత్యయుగ భావానికి సంబంధించినంతవరకు మన మధ్య అభిప్రాయభేదాలు లేవు. ఆదర్శసమాజం విషయంలోను, దాని స్వభావం విషయంలోను కూడా అభిప్రాయభేదాలు లేవు

ఈ సందర్భంలో స్వల్ప భేదాలను నేను పరిగణనలోకి తీసుకోను. సాంప్రదాయకులు సత్యయుగాన్నీ స్వర్గభూమినీ వర్ణించి నట్లుగా కమ్యూనిస్టులు కూడ ముందుముం దేర్పడనున్న సామాజిక వ్యవస్థను గురించి మాట్లాడుతారు సాంప్ర దాయకులను స్వర్గభూమికి మె ట్లెక్కడున్నాయో చూప వలసిందని అడిగితే, వారు చెప్పేసమాధానం యిది: "మేము తప్పకుండా మెట్లు చూపగలం; కాని మరణానంతర మే మీరు వాటిని చూడగలరు." కాబట్టి, మనం వారి స్వర్గభూమికి వెళ్లాలంటే మరణించాలి. వారు చెప్పే స్వర్గం నన్ను ఆకర్షి స్తూన్నప్పుడు దాన్ని నేను చేరుకోలేకపోతే ఉపయోగం ఏముంది?

కమ్యూనిస్టుల్ని కూడ, వారి స్వర్గానికి మార్గ మేమిటని అడిగితే, వా రిలా జవాబు చెబుతారు: "ప్రస్తుతం కొద్దిగా దౌర్జన్యం చేయడానికి సిద్ధంగా ఉండండి!"

ఈవిధంగా, ఒకరు మరణానంతరంగాని స్వర్గం లభించ దంటే, ఇంకొకరు మరోవ్యక్తిని చంపితేగాని స్వర్గం చేరుకో లేమంటారు. రెండు మార్గాలూ మనకు నిరుపయోగ మే

అంతేకాదు. మనల్ని అర్థం చేసుకోడానికూడా వారు చిక్కుపడుతున్నారు. వారు చెప్పేది ఏమంటే: "మీరు బోధించేది చాల మంచిది; కాని ప్రపంచంలో యిలా బోధించినది మీ రొక్క రే కాదు. మీకు ముందు వంద లాది ప్రవక్తలు, మహర్షులు పుట్టారు; చనిపోయారు. వారు బోధించిందే మీరూ బోధిస్తున్నారు. బుద్ధుడు, క్రీస్తు సాధించ లేని దానిని మీరు సాధించగలరా? బైబిల్‌లో అహింసను

గురించి ఉన్న ఉపదేశాలు మీ ఉపదేశాలకన్న తక్కువవా? బైబిల్ వేయిభాషల్లోకి అనువదింపబడింది. సైనికులు సహితం యుద్ధంలో పోరాడుతూ చనిపోయేటప్పుడు, బైబిల్ తమ జేబులో ఉంచుకుంటారు. వారెప్పుడూ భగవంతునిపేరు ఉచ్చరిస్తూ ఉంటారు; ఆదివారం నాడు బైబిల్ చదువుతారు. కాని మిగతా రోజుల్లో దానిని మరచిపోతారు. ప్రపంచం యీ విధంగా నడుస్తోంది. అందుచేత మీ ఉపదేశాల వల్ల కలిగే ప్రయోజనమేముంది? మీరు చెప్పేవన్నీ నిజంగా జరిగేటట్లయితే, ఆ సంగతి మా ముందు నిరూపించండి. మాకు మాత్రం అలాంటి విశ్వాసంలేదు." వీరి చిక్కు ఏమిటంటే, మన అభిప్రాయమెంతో పరిపూర్ణమైనదీ, ఒప్పించగలదీ అయినప్పటికీ, వారు దాన్ని అంగీకరించలేకపోతున్నారు. ఇక యీ అనంతమైన చర్చలవల్ల ప్రయోజనమేమిటి?

మన మనోభావంనుంచి ఒక నూతన శక్తిని ఆవిర్భవింప జేయగలమన్న విశ్వాసం మనలోఉంటే, వెంటనే మన మొక నిశ్చయానికి రావలసి యుంటుంది. పోచంపల్లి గ్రామంలో నాకు మొట్టమొదటి భూదానం లభిస్తుందని ఊహించి యుండలేదు. ఆ ఘటనను గురించి నేను ఆ రాత్రల్లా తీవ్రంగా ఆలోచించేను. భగవదేచ్ఛ అందుకు కారణమై యుండాలను కొన్నాను. భగవంతునిలో విశ్వాసం ఉన్నట్టే గణితంలోకూడ నాకు కొంత విశ్వాసం ఉంది. వెంటనే లెక్కలు వేయడం ప్రారంభించేను. భూదానంవల్ల 5 కోట్ల యకరాలు లభిస్తే భూ సమస్య పరిష్కారమైపోతుందని నేను నిర్ధారణ చేసుకున్నాను. అయితే, ఆ రోజున 100 యకరాలు

లభించినవిధంగా 5 కోట్ల యకరాలు లభించడ మెలాగు — అనే అనుమానం నన్ను పీడించింది. అలా జరగడం సాధ్యం కాదేమోనని భయపడేకొద్దీ నా మనోనేత్రంముందు కమ్యూనిస్టులు కనబడేవారు. ఆ ప్రాంతంలో వారు చేసిన దౌర్జన్య చర్యలను గురించి యిదివరకే నాకు తెలుసు. వాటిని యిక్కడ వర్ణించ దలచుకోలేదు. ఇతరుల్ని ఒప్పించటం ద్వారా, ప్రేమద్వారా నేను భూమిని సంపాదించలేకపోతే కమ్యూనిస్టులయెడ నేను విశ్వాసమేర్పరచుకోవలసి యుంటుం దనీ, వారిని అనుసరించవలసి యుంటుందనీ నేను గ్రహించేను. సర్వోదయ పద్ధతివల్ల యిది సాధ్యంకాకపోతే కమ్యూనిజం వల్ల తప్ప సాధ్యపడదని అంగీకరించ వలసియుంటుంది. ఈ విధంగా మేము ఉభయులం ఒకరి సమీపంలోకి ఒకరు వచ్చాం. ఒక వర్తులం (circle) చివరనున్న బిందువులు (points) రెండూ ఒకదాని కొకటి సమీపంగా ఉంటాయి. ఏ బిందువువద్ద వర్తులం సమాప్త మవుతుందో ఆ బిందువువద్ద అది ప్రారంభమవుతుంది. అన్నిటికన్న దూరంగా ఉండే వస్తువు అన్నిటికన్న దగ్గరగా ఉంటుంది.

కమ్యూనిజం దౌర్జన్యాన్ని ఆమోదిస్తున్నప్పటికీ, దానికి ప్రోద్బలమిచ్చే శక్తి కరుణ అని అంగీకరించాలి. ఇదొక వైచిత్రి. వారికి చోదకశక్తి కరుణ; కాని వారి విశ్వాసం దౌర్జన్యంలో. ఈవైచిత్రి యిప్పటిదికాదు; మొదటినుంచీ యిది ఉంది. ఒక గొప్ప అహింసా ప్రవక్త ఆయుధాలు చేబూని 21 సార్లు యుద్ధంచేయవలసి వచ్చిందని నేను నా "గీతాప్రవచనముల"లో పేర్కొన్నాను. కరుణకు ప్రత్యక్షమూర్తి పరశు

రాముడు. ఆతనిలో యీ వైరుధ్యం ఏర్పడింది. అతనిచేతిలో గండ్రగొడ్డలి ఉండేది. నాటినుంచి నేటి వరకు ప్రపంచంలో యీ వైరుధ్యం ఎల్లప్పుడూ ఉంది. దీన్ని మనం ఛేదించాలి. ప్రేమశక్తిని, శాంతిశక్తిని మనం నిరూపించాలి.

ఈ రోజున జరుగుతున్న దేమిటి ? రోజుకు మూడు సార్లు శాంతి మంత్రం వల్లించేవారు ప్రపంచం యథా ప్రకారంగా ఉండాలనీ, దేన్నీ మార్చరాదనీ కోరుతారు. మార్పు అంటే వారికి భయం. రెండో వేపున, విప్లవం తీసుకురావాలనేవారు అహింసాయుత శిక్షణను అంగీకరించరు. వారికి హింసలోనూ నమ్మకంలేదు; అహింసలోనూ నమ్మకంలేదు. కరుణ మాత్రమే వారికి ప్రోద్బలమిస్తుంది. ఐతే, కరుణా హృదయులు హింసా మార్గమవలంబించడం కొత్తగా ఉత్పన్నమైన వైరుధ్యంకాదు. దానికి మనం ఆశ్చర్యపడవలసిన అవసరమూ లేదు. వారిలా అంటారు : "అన్ని జీవితాలు వైరుధ్యాలతో నిండియుంటాయి. వైరుధ్యంలేని వ్యక్తి అంటూ ఉండడు. అందుచేత మీరు కాస్సేపు అహింసను విడిచిపెట్టండి; హింసను చేబట్టి మాతో కలిసి నడవండి; హింసఅనేది అత్యంత ప్రాచీనమైనది; మొదటినుంచీ అది ఉంది. మేము మాత్రం ఉత్తరోత్తరా అహింసను స్థాపిస్తాం". అహింస మొదటినుంచీ ఉందనీ, శాంతిని స్థాపించగలిగితే అది శాశ్వతంగా ఉంటుందనీ వారి విశ్వాసం. అయితే ప్రస్తుతం – అంటే పరివర్తన దశలో – కొంత హింసచేయడం ద్వారా శాశ్వత అహింసను నెలకొల్పుతామంటారు. వారిలా అంటారు : "మీరు అహింసలో విశ్వాసం ఉంచుకోవచ్చు; కాని ప్రస్తు

తానికి ఆయుధాలు ధరించండి. పేదలబాధలు మీకక్కర లేదా ? వారికోసం మీరు కొద్దిగా హింస చేయలేరా ? చేయలేకపోతే మీరు శాశ్వతంగా నిస్సహాయులుగా ఉండి పోతారు." ఈ ఆక్షేపణను మనం జాగ్రత్తగా పరిశీలించవలసి యుంది.

శాంతిని కోరేవారు ప్రపంచాన్ని యథాప్రకారంగా ఉంచాలంటారు; విప్లవ వాదులు హింసను చేబడతారు. కాని మనం అహింసద్వారా పనులు చేయగోరే విప్లవవాదులం. ప్రపంచంలోని సమస్యలన్నిటినీ అహింసద్వారా పరిష్కరించ వచ్చునని మనం నిరూపించగలగాలి. అట్టి బాధ్యత మనమీద ఉంది. ఈ విషయం నేను సర్వోదయ సేవకులందరినీ ఉద్దేశించి చెబుతున్నాను. మనం గత ఆరు సంవత్సరాలలో సాధించిన విజయాలనుబట్టి, అహింసద్వారా విప్లవం తీసుకు రావచ్చునన్న విశ్వాసం మీకు కలిగింది. శాంతియుత పద్ధతులద్వారా విప్లవం తీసుకురావడం సాధ్యంకాదనుకున్న వారు ఆలోచించనారంభించారు; శాంతియుతంగా విప్లవాన్ని సాధించడం సాధ్యమేమోననుకొంటున్నారు వారు. ఇది మన ఆరు సంవత్సరాల కృషియొక్క ఫలితం. మనం ఆశించిన దానికంటె గొప్ప ఫలితం యిది.

— 'న్యూ పీస్' అక్టోబరు 1957 సంచిక

# గొప్ప చర్చనీయాంశం

## స్థిరవ్రతదత్తు

ఈ చర్చలో పాల్గొనేవారంతా పూజ్యభావంతోను, అన్వేషణాదృష్టితోను పాల్గొంటారని ఆశిస్తాను. ఆచార్య భావే ప్రదర్శించిన నిష్పాక్షిక ఔదార్యాన్ని, 'న్యూ ఏజ్' సంపాదకవర్గం యొక్క మానసిక స్థైర్యాన్ని కొనియాడ్డం ఈసందర్భంలో నావిధి అని భావిస్తున్నాను.

దీని లక్ష్యం చర్చయేగాని, వివాదంకాదని నేనభిప్రాయ పడుతున్నాను. ఇందులో పాల్గొనేవారందరూ ఒకరి అభిప్రాయాల నొకరు అర్థంచేసుకోవలసియుంది. చర్చకు ఇదే ప్రాతిపదికగా ఉంటుందని ఆశిస్తున్నాను. ఇంత ప్రధానమైన సిద్ధాంత సమస్యపై ఒండొరులు తమ తమ దృక్పథాలను విశదీకరించుకొంటూ సత్యాన్వేణకు పూనుకొంటే, యీ కృషి ప్రపంచ ప్రాముఖ్యత కూడ వహించవచ్చు.

కమ్యూనిజాన్ని గురించి ఆచార్య భావే చేసిన వరామర్శకు ఆధారం మూడు సూత్రీకరణాలని చెప్పవచ్చు :

"1. మానవుని హృదయంలో దుష్టత్వం లేదని కమ్యూనిస్టులు నిస్సందేహంగా అంగీకరిస్తారు."

"2. కమ్యూనిజం దార్శన్యాన్ని అమోదిస్తున్నప్పటికీ, దానికి ప్రోద్బలమిచ్చేశక్తి కరుణ అని అంగీకరించాలి."

"3. మార్క్సిజం ఆచరణకు సంబంధించిన పద్ధతి; సర్వోదయం ఒక జీవితలక్ష్యం."

ఈ మూడు సూత్రీకరణలమీద నేను నా అభిప్రాయం తెలియజేస్తాను.

మనుష్య జన్మకు మూలం పాపం అనే సిద్ధాంతం సమస్త మత భావాలకు ప్రాతిపదిక. మోక్షసాధనకు భగవంతుని ప్రత్యక్షపాత్ర ఉండి తీరాలని అది చెబుతుంది. కొద్ది మంది అదృష్టవంతులు భగవంతుని కృప సంపాదించి, తద్వారా తమ పాపాన్ని కడిగివేసుకొని మోక్షం సంపాదించ గలరనేది దాని సారాంశం. మానవుడు మానవుడుగా జీవించేస్థితి అంతమైనప్పుడు - అంటే మరణానంతరం - మాత్రమే యిది సాధ్యమని పై సిద్ధాంతం చెబుతుంది.

మార్క్సిస్టు తత్వశాస్త్రం యీ దృక్పథాన్ని వ్యతిరేకిస్తుంది. మనుష్య జన్మకు మూలం పాపమనే పిడివాదాన్ని నిరాకరించడం ద్వారా అది ఒక గొప్ప మానవతా సంప్రదాయాన్ని నెలకొల్పింది. దీన్నే ఆచార్యభావే ఒక్క వాక్యంలో సంక్షిప్త పరిచేరు. అదే మొదటి సూత్రీకరణ.

ఐతే, ప్రపంచంలో దుష్టత్వానికి మూలమేమిటో ఆయన చర్చించ పూనుకోలేదు. దుష్టత్వం మానవ హృద

యంలో లేదన్నమాట స్పష్టమే. మానవులకు పరిసరాలకు మధ్య, మానవులకూ మానవులకూ మధ్యనున్న కొన్ని నిర్దిష్టమైన సంబంధాల్లో – అంటే సామాజిక వ్యవస్థలో – వ్యక్తుల లేదా సమూహాల వ్యాపారాన్ని (Behaviour) అది ప్రతి బింబిస్తుంది. ఈ సంబంధాలు శాశ్వతమైనవి కావు. కారణ మేమంటే, అవి మన చేతులతో సృష్టించుకున్నవే. అలాగే, మన ఇష్టాయిష్టాలను బట్టి అవి మారవు; కొన్ని నియమాలకవి కట్టుబడి యుంటాయి. అందుచేత, దుష్టత్వా న్నెదుర్కోడమనేది ఒక పోరాటం; దుష్టత్వం సాధ్యమయే టట్లు చేసే సామాజిక వ్యవస్థను మార్చేటందుకు జరిగే పోరాటం. ఆ వ్యవస్థ ఏ నియమాలకు కట్టుబడియుందో, సామాజిక పరిణామ సూత్రాలేవో తెలుసుకుని ఆ పోరాటం జరపాలి. తత్వవేత్తలంతా ప్రపంచాన్ని తెలుసుకోవలసిందే; కాని దాని పరమార్థం మాత్రం ప్రపంచాన్ని మార్చడం.

మానవుడు తనలో దుష్టత్వం ఉందనే విషయం తెలుసుకోనంతకాలం అతనిలో దుష్టత్వం ఉంటుందనేది సర్వోదయవాదుల అభిప్రాయంగా కనిపిస్తుంది. కనుకనే, దుష్టత్వాన్ని ప్రతిఘటించడం వ్యక్తిపరమైన నైతిక ధర్మమనీ, విజ్ఞానదాయకమైన విషయమనీ వారు విశ్వసిస్తారు. ఈ అభిప్రాయానికి మూలం మానవునిలో దుష్టత్వం స్వతస్సిద్ధంగా ఉండే లక్షణమనీ, సామాజిక వ్యవస్థకూ దీనికీ సంబంధం లేదనీ భావించడం. ఈ సమస్యపై సర్వోదయవాదులు అధికార యుతమైన వివరణ యిచ్చినట్లయితే చాల ఉపయోగం ఉంటుంది.

సర్వోదయం, కమ్యూనిజం కూడా దుష్టత్వాన్నెదుర్కొనే వైఖరి నవలంబిస్తున్నాయి. కాని దుష్టత్వానికి మూలం ఏమిటనే సమస్యపై వాటి అభిప్రాయాలు భిన్నంగా ఉండడంవల్ల హింస విషయంలో సర్వోదయ వాదులు, కమ్యూనిస్టులు వేర్వేరు దృక్పథాలను కలిగియున్నారు.

కమ్యూనిస్టులు హింసకు పూనుకోవలసి వచ్చినప్పుడు కరుణ వారిని ఉత్తేజపరుస్తుందని ఆచార్యభావే తెలియజేసేరు. ఇందుకు ఆయనను అభినందించవలసియుంది నేడు సజీవులైయున్న సత్యాగ్రహ ప్రచారకులందరిలోనూ గొప్పవాడైన ఒక వ్యక్తి పై విధంగా తన అభిప్రాయం చెప్పిన తర్వాత ఈ సమస్యపై తరచు కొందరు ఎంతో గట్టిగా ప్రకటించే అనుమానాలు పటాపంచలవుతాయని ఆశించవచ్చునను కుంటా.

దుష్టత్వంయొక్క మూలాన్ని గురించి మార్క్సిస్టులు చెప్పే సూత్రీకరణకు మరొకటికూడా చేరిస్తే సరిపోతుందనుకుంటాను. అది యేమంటే: ప్రతిఘటనకు లోనయ్యే దుష్టత్వం సామాజిక మార్పును ఎదుర్కొనే అవకాశం కూడా ఉంది; అప్పుడు మనముందు రెండే మార్గా లుంటాయి: ఒకటి సామాజిక మార్పును ఒదులుకోవడం (అంటే దుష్టత్వాన్ని ప్రతిఘటించడం మానుకోడం) లేదా దుష్టత్వాన్ని విజయవంతంగా ఎదుర్కొనేందుకై హింసకు దిగడం. అందుచేత హింసకు దిగడమూ దిగకపోవడమూ అనేది సిద్ధాంతానికి సంబంధించిన సమస్యకాదు; యుక్తాయుక్త విచక్షణకు సంబంధించిన సమస్య అది. ఒకవేళ కమ్యూనిస్టులు హింసకు దిగవలసివస్తే, అందుకు కారణం హింసను వారు

కోరడంకాదు; సామాజిక మార్పును వ్యతిరేకించేవారు హింసద్వారా దాన్ని నిరోధించ పూనుకోవడమే కారణం. కేరళ పరిణామాల తర్వాత నే నీ విషయాన్ని యింతకన్న వివరించి చెప్పనవసరం లేదనుకుంటాను.

సర్వోదయవాదులు, అసలు హింస అంటేనే దుష్టత్వ మని అభిప్రాయపడతారు. దాన్ని ఎన్నడూ దరికి చేరనీయ రాదంటారు. దానికి ప్రత్యామ్నాయంగా నైతిక ధర్మ మాచరించాలంటారు. దుష్టత్వాన్ని ప్రతిఘటించడం నైతిక ధర్మమైనప్పుడు హింస అనుసరణీయమా లేక ఒప్పించే పద్ధతి అనుసరణీయమా అనేది అప్రధానమైన సమస్య అవుతుంది. ఒకానొక పరిస్థితిలో హింసను ఉపయోగించడం అవసరమా కాదా అనేదే ప్రధాన సమస్య అవుతుంది.

ఇక చివరివిషయం లక్ష్యాల సమస్య. ఏ తత్వశాస్త్ర మైనా కొన్ని మానవ విలువలను లేదా నైతిక విలువలను తన లక్ష్యంగా పెట్టుకొంటుంది. ఆ దృష్టితో చూస్తే, ప్రతి తత్వశాస్త్రం కొన్ని లక్ష్యాల వివరణ అని చెప్పవచ్చు. ఐతే, ఏ తత్వశాస్త్రమైనా ఫలప్రదమువాలంటే దానికొక స్వరూపం ఉండాలి; కార్యక్రమం ఉండాలి. అట్టి తత్వశాస్త్రం కేవలం లక్ష్యాలనే లేదా కేవలం సాధనాలనే చర్చించదు. రెండిటినీ అది చర్చిస్తుంది. సర్వోదయం ఫలప్రద మవవలసిన సిద్ధాంతమని – లేదా ఫలప్రదమవడం దాని ఆశయమని మన మంగీకరిస్తే, ఆచార్యభావే చేసిన వర్గీకరణ వాస్తవవిషయం కాదనీ, పైకి కనిపించేది మాత్రమేననీ చెప్పవలసియుంటుంది.

ఇటీవలి అనుభవమే దీనికి తార్కాణం. సర్వోదయం సామాజిక పరిణామాన్ని సాధించడానికి తాను చేస్తున్న ప్రయోగాలను—భూదాన, గ్రామదానం—ఎంతో జాగ్రత్తగా బాహ్య దృష్టితో పరిశీలిస్తోంది; తన పరమార్థాన్ని సిద్ధింప జేసుకొనేందుకు తానుచేబట్టిన సాధనాల నది పరిశీలిస్తోంది. రెండో వేపున కమ్యూనిజం ఎంతో అద్భుతమైన విజయాలను సాధించి, ఆంతరికదృష్టితో ప్రజాస్వామ్య పద్ధతులకు సంబంధించిన సమస్యలను చర్చిస్తోంది; నూతన పరిసరాల్లో వ్యక్తి స్వాతంత్ర్యాన్ని గురించి అది అధ్యయనం చేస్తోంది. ప్రాథమిక దశలో కమ్యూనిజాన్ని ఉత్తేజపరచిన, ప్రస్తుత దశలో కమ్యూనిజం సాధించవలసియున్న లక్ష్యాలను అది పరిశీలిస్తోంది.

ఇవి ఒక కళాభిమాని అభిప్రాయాలు. సర్వోదయమూ, కమ్యూనిజమూ అనేది ఒక గొప్ప చర్చనీయాంశంగా యీనాడు పరిణతి చెందిందు. ఇట్టి పరిస్థితుల్లో సర్వోదయ కార్యకర్తలు, కమ్యూనిస్టు కార్యకర్తలు ముందుకు వచ్చి, యీ చర్చకు జీవితస్పర్శ యివ్వగలరన్న ఆశతో పై అభిప్రాయాలను వ్యక్తం చేసేను.

—'న్యూఏజ్' డిసెంబరు 1957 సంచిక

# ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో నూతన దశ

## బరేన్‌రే

ఆచార్య వినోబాభావే మన ముందుంచిన సమస్యలను పరిశీలనాదృష్టితో పరామర్శించాలంటే, యీనాడు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం ఏ దశలో ప్రవేశించిందో ఒక స్పష్టమైన అభిప్రాయం మన కుండాలి. ఇందుకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ చేసిన సూత్రీకరణలను లోతుగా పరిశీలించి అర్థం చేసుకోవాలి. వాటిని కేవలం సోవియట్ విధానంయొక్క వివరణగానే అర్థంచేసుకోకూడదు; ఈనాటి ప్రపంచపరిస్థితిని నూతన మార్క్సిస్టు దృష్టితో చేసిన పరిశీలనగా వాటిని పరిగణించాలి. ఇందుకు మనం నూతన వైఖరి నవలంబించాలి; నూతన అవగాహన ఏర్పరచుకోవాలి; నూతన పోరాటపద్ధతులను చేబట్టాలి.

20 వ మహాసభ చేసిన కొత్త సూత్రీకరణలు యివి :

1. ఏ యే దేశాల్లోబలమైన కార్మికోద్యమాలు, పార్లమెంటరీ సంప్రదాయాలు, ప్రజాతంత్రహక్కులు ఉన్నాయో

ఆ దేశాల్లో శాంతియుతంగా సోషలిజాన్ని సాధించగల అవ కాశం కార్యరూపం ధరించే పరిస్థితులు లీనా ఉన్నాయి; అట్టి పరివర్తన తీసుకురావడానికి బూర్జువా పార్లమెంట్లను అధికార సాధనాలుగా మనం ఉపయోగించుకోగలం

2. సోషలిస్టు న్యాయశాస్త్రం, ప్రజాతంత్రహక్కులు, సోషలిస్టు శిబిరంలోని దేశాల సర్వాంసహాధికారాన్నీ సమాన హోదానూ గుర్తించడం మొదలైన సమస్యలపై సోషలిజాన్ని అమలు జరిపే సందర్భంలో తీవ్రమైన అపసవ్య పద్ధతు లవలం బింపబడ్డాయి. ఆ న్యాయశాస్త్ర ఉల్లంఘనలు, నిరంకుశ చర్యలు సోషలిజంసాధనకు తప్పక చెల్లించవలసిన మూల్యాలు మాత్రం కావు; ప్రమాదకరమైన తప్పిదాలు అవి.

3. (ఎ) సోషలిస్టు శిబిరానికీ, పెట్టుబడిదారీ శిబిరానికీ మధ్య ప్రధాన వైరుధ్యమేర్పడిన నేటి పరిస్థితుల్లో-ముఖ్యంగా సామ్రాజ్యవాదులు తీవ్రమైన యుద్ధసన్నాహాలు చేస్తున్న పరిస్థితుల్లో - కొన్ని దేశాలు అవలంబిస్తున్న తాటస్థ్యం ప్రపంచ శాంతికి ప్రత్యక్షంగా సహాయం చేస్తూంది.

(బి) ప్రపంచంలో యీనాడు సామ్రాజ్య వ్యతిరేక శక్తులు అనేక రూపాల్లో విజృంభిస్తూండడంవల్ల, శ్రామిక వర్గం ముఖ్యపాత్ర వహిస్తూండడంవల్ల జాతీయ విముక్తి ఉద్య మాలు అత్యంత ప్రాధాన్యంగల విషయాలుగా, స్వతంత్ర పాత్ర వహించే విషయాలుగా పరిణతి చెందేయి.

4. ప్రస్తుత ప్రపంచంలో వివిధ శక్తుల బలాబలాలను, ప్రపంచ ప్రజల్లో ప్రబలంగావున్న శాంతికాంక్షను దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే,యుద్ధాలకు కారణభూతమైనసామ్రాజ్య

వాదం యింకా నిర్మూలింపబడకపోయినా, ప్రపంచయుద్ధాన్ని నివారించడం నిషేధించడం నేడు సాధ్యం.

మొదటి రెండు సూత్రీకరణలు ప్రస్తుత చర్చకు చాల ప్రధానమైనవి. మిగతా రెండిటిని గురించి తర్వాత చర్చించుకోవచ్చు.

శాంతియుతంగా సోషలిజానికి పరివర్తన సాధ్యం అనే సిద్ధాంతం మార్క్సిజానికి కొత్త యేమీకాదు. కొన్ని పరిస్థితుల్లో అది సాధ్యమేనని మార్క్స్, ఏంగెల్స్‌లు సూచించారు. లెనిన్ తన ఏప్రిల్ థీసిస్‌ను ప్రకటించేవరకు యీ సమస్యపై ఎట్టి నిర్ధారణ జరగలేదు. మితవాద సోషలిస్టులు ఆనాటి పరిస్థితుల్లో పార్లమెంట్ల ద్వారా సోషలిజాన్ని సాధించవచ్చునంటూ చేసిన వాదనలను ఆయన "శ్రామిక విప్లవం: ద్రోహి కాట్స్కీ" అను గ్రంథంలో ఖండించేరు. ఆనాడు పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క స్థితిగతులను లెనిన్ కూలంకషంగా పరిశోధించేరు; ప్రజాస్వామ్య సంస్థల బలహీనతలను, లోపాలను నిశితంగా చూపేరు; వాటి వర్గ పునాదిని ప్రతిభావంతంగా విశదీకరించేరు. ఆ రోజుల్లో అనేక పశ్చిమ యూరపియన్ దేశాల పార్లమెంట్లలో పెద్ద పెద్ద సోషల్ డెమాక్రటిక్ పార్టీలు పనిచేస్తూ వుండేవి. దీన్ని ఆధారం చేసుకొని మితవాద సోషలిస్టులు పార్లమెంట్లలోని ప్రాతినిధ్యం క్రమక్రమంగా పెరగడాని కవకాశంవుందనీ, యిందుకు ప్రజల్లో అధిక సంఖ్యాకుల్ని తమవైపు తిప్పుకో వలసి యుంటుందనీ వాదించేవారు. అలా మెజారిటీ సంపాదించిన తర్వాత, సమాజంలోని ఆస్తి సంబంధాలను సమూ

లంగా మార్చివేయవచ్చుననీ, ఆ విధంగా సోషలిజాన్ని నిర్మించగలమనీ వారు చెప్పేవారు.

లెనిన్ ఆనాటి పరిస్థితులను కూలంకషంగా పరిశీలించి, మితవాద సోషలిస్టుల ప్రతిపాదనలు ఎంత తప్పో నిరూపించేరు. బూర్జువా పార్లమెంటరీ విధానం అమలు జరుగుతున్న దేశాలన్నిటిలోనూ ప్రజాస్వామ్య వ్యవస్థయొక్క ఉపయోగాలు "ఒక క్లిష్టదశ" ఏర్పడేవరకు మాత్రమే కార్మికవర్గానికి ప్రయోజనకరంగా ఉంటాయనీ, ఆ దశ దాటిన తర్వాత బూర్జువా గుత్త పెట్టుబడిదారులు అభివృద్ధి చెందుతూన్న కార్మికవర్గంమీద ఎదురుదాడి చేస్తారనీ, ప్రజాస్వామ్య హక్కులనూ ప్రజాతంత్రవ్యవస్థనూ తిరిగి లాగివేసుకుంటారనీ ఆయన స్పష్టం చేసేరు. స్వేచ్ఛాయుత పెట్టుబడిదారీ వ్యవస్థ గుత్త పెట్టుబడిదారీ వ్యవస్థగా, సామ్రాజ్యవాద వ్యవస్థగా యిదివరకే పరివర్తన చెందడంవల్ల దాని కనుగుణ్యమైన రాజకీయ నియంతృత్వాన్నికూడ వారు నెలకొల్పుతారని వివరించేరు.

లెనిన్ సూత్రీకరణ సరియైనదని త్వరలోనే చరిత్ర రుజువు చేసింది. సోషలిస్టు ఉద్యమం మొదటి ప్రపంచ యుద్ధాన్ని నివారించలేకపోయింది; "రష్యాలో లెనినిస్టు సూత్రీకరణ" ఆధారంమీదనే విప్లవం జయప్రదంగా కొనసాగింది : హంగరీ, పోలెండ్, ఫిన్లండ్, జర్మనీ దేశాల్లో విప్లవాలు దారుణంగా అణచివేయబడ్డాయి; ఆ తర్వాత ఫాసిజం ఆవిర్భవించింది. స్పెయిన్‌లోను, తూర్పు - మధ్యయూరపు దేశాల్లోను కూడా ఫాసిస్టు నియంతృత్వ ప్రభుత్వాలు స్థాపించబడ్డం చూస్తే

లెనిన్ బూర్జువా ప్రజాస్వామ్యంయొక్క పరిమితులను, పరిపక్వతను గుత్త పెట్టుబడిదారుల ఎదురుదాడులనుంచి కాపాడుకోనే విషయంలో అది చూపే దౌర్బల్యాన్ని విమర్శించడం ఎంత సరియైనదో మనకు అర్థమవుతుంది.

అందుచేతనే లెనిన్ ఆనాటి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం యొక్క బలంమీాద ఆధారపడ్డంకంటె దాని బలహీనతలను బహిర్గతం చేయడమే కార్మికవర్గంయొక్క కర్తవ్యమని తెలియజేశారు. అంతవరకు కార్మికవర్గం సాధించుకొన్న ప్రజాస్వామ్య హక్కులను అపహరించేందుకు గుత్త పెట్టుబడిదారీ వర్గాలు ఎక్షణాన్నైనా దాడిచేయవచ్చుననీ అందుకు కార్మికవర్గం తయారుగా ఉండాలనీ ఆయన హెచ్చరించారు. ఇందుకు ఒక సరికొత్తపార్టీ – కార్మికవర్గ విప్లవపార్టీ – అవసరమన్నారు.

ఇప్పుడు మనం మరికొంత వివరంగా బూర్జువా ప్రజాస్వామ్యంయొక్క బలహీనతలేమిటో, పరిమితు లేమిటో తెలుసుకుందాం. పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం ఎల్లప్పుడూ రెండు వ్యతిరేకశక్తుల కలయికగానే ఉంటూ వచ్చింది. మొదటిది 'ప్రజాస్వామ్య లక్షణం'. ఇది ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో పరిణతి చెందింది. పెట్టుబడిదారీ వర్గం నూతన ఉత్పత్తిశక్తులకు ప్రోత్సాహమిచ్చేటందుకు విప్లవ ప్రజాసామాన్యంయొక్క ప్రత్యక్ష సహకారాన్ని అది పొందవలసి వచ్చింది. పాతకాలపు ఫ్యూడల్ నిరంకుశత్వానికిబదులు వ్యక్తి స్వాతంత్ర్య నినాదాన్ని, రాజకీయ ప్రజాస్వామ్య నినాదాన్ని చేబట్టవలసి వచ్చింది. రెండవది 'పెట్టుబడిదారీ'

లక్షణం. ఇది రాజకీయ స్వాతంత్ర్యానికి పూర్తిగా వ్యతిరేక మైనది. దీనికి ప్రాతిపదిక ఉత్పత్తి సాధనాలపై వ్యక్తిగత యాజమాన్యం. ఆర్థికంగాచూస్తే, పెట్టుబడియొక్క కేంద్రీకరణ నిరంతరం గుత్త పెట్టుబడుల ప్రాబల్యానికి దారితీస్తూ ఉంటుంది. మరో విధంగా చెప్పాలంటే, అది పాతకాలపు సాంఘిక రాజకీయ గుత్తాధికారాన్ని ప్రతిఘటించింది; కాని కొత్త ఆర్థిక గుత్తాధికారాన్ని స్థాపించింది. పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యంయొక్క యీ ద్వంద్వస్వభావం పెట్టుబడిదారీ సమాజంలోని ప్రధాన వైరుధ్యాన్ని – అంటే కార్మికవర్గానికీ, పెట్టుబడిదారీ వర్గానికీ మధ్యగల వైరుధ్యాన్ని–వ్యక్తంచేస్తోంది. ఏ దేశంలోనైనా ఏ సమయంలోనైనా ప్రజాస్వామ్య వ్యవస్థ యొక్క బలం లేదా బలహీనత యీ రెండు ప్రధాన వర్గాల బలాబలాలనుబట్టే ఉంటుంది.

బూర్జువా సమాజంలో సిద్ధించిన ప్రజాస్వామ్య హక్కు లన్నిటినీ పెట్టుబడిదారీ వర్గంయొక్క విజయాలుగా, ఆ వర్గం ప్రవేశపెట్టిన సంస్కరణలుగా పరిగణిస్తే చాల పొరబాటు చేసినవార మవుతాం. పెట్టుబడిదారీవర్గం కొన్ని పరిమితమైన సంస్కరణలను ప్రవేశపెట్టినమాట నిజమే. కాని వాటిని అమలుజరిపేటందుకు ప్రజాసామాన్యాన్ని ఉత్సాహ పరచవలసి వచ్చింది; ఉత్తేజపరచవలసి వచ్చింది. వయోజన ఓటింగు, రాజ్యాంగ నిర్మాణసభ మొదలైనవన్నీ పెట్టుబడిదారీ వర్గంయొక్క అభీష్టానికి వ్యతిరేకంగా స్వతంత్ర కార్యాచరణ ద్వారా ప్రజలు సాధించుకున్న విజయాలు.

20 వ శతాబ్దపు ప్రారంభదినాలవరకు పెట్టుబడిదారీ వ్యవస్థ సాంకేతికాభివృద్ధి ద్వారాను, వలస దేశాలను సంఘటిత పరచడం ద్వారాను అద్భుతంగా పురోగమించింది; తన ఆంతరిక బలాన్ని ప్రదర్శించుకోగలిగింది. కార్మికవర్గం, సోషలిస్టు శక్తులు తప్ప మిగతా వారందరూ పెట్టుబడిదారీ వ్యవస్థలో, నూతన పారిశ్రామిక నాగరికతలో అపారమైన విశ్వాసాన్ని కలిగియుండేవారు. ఆ వ్యవస్థను మధ్యవర్గాలన్నీ, మేధావివర్గమంతా, మధ్యతరగతి అంతా బలపరిచారు. అలాంటి పరిస్థితుల్లో లెనిన్ పై సూత్రీకరణ చేసేరు. పెట్టుబడిదారీ వర్గానికీ, కార్మిక వర్గానికీ మధ్యనున్న బలాబలాలను దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే, పెట్టుబడిదారీవర్గం సామ్రాజ్యవాద శక్తిగా పరిణతిచెందడం తప్పదనీ, తాను విధించిన పరిమితులనుదాటి కార్మికవర్గం ముందుకు వెళ్తూంటే అది చూస్తూ పూరుకోదనీ, అలా దాటివెళ్ళినప్పుడల్లా ఎదురుదాడి చేస్తుందనీ లెనిన్ స్పష్టంచేసేరు.

కాని 20 వ పార్టీ మహాసభ శాంతియుతంగా సోషలిజాన్ని సాధించగల అవకాశం చాల దేశాల్లో ఏర్పడిందని ప్రకటించింది. దీని అర్థం ఏమిటి ? పెట్టుబడిదారీవర్గం ప్రజాస్వామ్య విధానాన్ని భగ్నంచేసే ప్రయత్నాలను, కార్మిక ప్రతినిధులెంతో బలంగా ఉన్నప్పటికీ హింసాకాండను అమలు జరిపే ప్రయత్నాలను జయప్రదంగా నిరోధించగల ఒక నూతనశక్తి ఆవిర్భవించిందన్నమాట. ఈ నూతనశక్తి కేవలం కార్మికుల శక్తేననడానికి వీల్లేదు. ఎందుచేతంటే, కార్మికులట్టిశక్తిని సంపాదించుకోకముందే పెట్టుబడిదారీవర్గం

ఎదురుదాడిచేసి, శాంతియుతంగా కార్మికవర్గం సోషలిజాన్ని సాధించగల అవకాశం లేకుండా చేస్తుంది. అందుచేత యిది ఉభయవర్గాల (పెట్టుబడిదారులు, కార్మికులు) బలాబలాల్లో వచ్చిన మార్పువల్లనే సంభవంకా లేదు. గత కొద్దిశతాబ్దాలలో జరిగిన అంతర్జాతీయ పరిణామాల తీరును పరిశీలిస్తే యీ నూతనశక్తి ఏమిటో మన కర్థమవుతుంది.

ప్రపంచంలో ఈ నూతన పరిస్థితి ఏర్పడ్డానికి అనేక కారణాలున్నాయి: ఏకైక ప్రపంచ వ్యవస్థగా వ్యాప్తిచెందిన పెట్టుబడిదారీ విధానం నేడు విచ్ఛిన్నమైంది; సోషలిస్టు శిబిరం శక్తివంతంగా రూపొందింది; సైనిక దురాక్రమణద్వారా ఇతర దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకొనే విధానాన్ని అన్ని దేశాల ప్రజలు వ్యతిరేకిస్తున్నారు; ఫాసిజం అంటే ఏమిటో స్వానుభవంద్వారా పలుదేశాల ప్రజలు తెలుసుకున్నారు. సైనిక, ఆర్థిక రంగాల్లో సోషలిస్టు శిబిరం సంపాదించినశక్తివల్ల అది సామ్రాజ్యవాదుల దురాక్రమణను ప్రతిఘటించగలశక్తి, నిజమైన ఆర్థిక సహాయం చేయగల స్తోమతు ఏర్పడింది. అక్టోబరు విప్లవం తర్వాత పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క సాధారణ సంక్షోభం అంతకంతకు తీవ్రమవుతూండడంవల్ల, పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యంయొక్క పైరెండు స్వభావాలమధ్య వైరుధ్యాలు తీవ్రమయాయి; ఏదో ఒక దాన్ని అది స్వీకరించవలసివచ్చింది. దానిముందు రెండు పరస్పర విరుద్ధమైన మార్గాలు కనిపించాయి. ప్రజల అభీష్టాలకు, అవసరాలకు ప్రాధాన్యమీయడంద్వారానే అది ప్రజాస్వామ్యయుతంగా ఉండగలదు; ఆర్థిక సంక్షోభదశలో గుత్త

పెట్టుబడిదారీ సంస్థలను అదుపులో ఉంచేటందుకు తీవ్రమైన చర్యలకు పూనుకోవాలి. లేదా ప్రజాస్వామ్యానికి తిలోదకా లిచ్చి, పెట్టుబడిదారీవర్గం యొక్క ప్రయోజనాలను కాపాడుతూ, సంక్షోభంయొక్క భారాన్ని కార్మికవర్గం మీదికి నెట్టవలసియుంటుంది; గుత్త పెట్టుబడుల, బ్యాంకింగ్ పెట్టుబడుల అభివృద్ధి కనుగుణ్యంగా సైనిక నియంతృత్వాన్ని నెల కొల్పవలసి యుంటుంది.

అక్టోబరు విప్లవం లగాయతు స్పెయిన్‌లో రిపబ్లికన్ ప్రభుత్వం పతనమయ్యేవరకు గడచిన చరిత్ర యీ పోరాటం యొక్క చరిత్రే. ఈ దశ అంతటికీ లెనిన్ సూత్రీకరణ వర్తిస్తుందనడంలో సందేహం లేదు. కాని ఫాసిజంయొక్క పెరుగుదల ప్రపంచ పరిస్థితిలో ఒక గొప్ప మార్పును తీసుకొచ్చింది చైతన్యయుతమైన కార్మికవర్గానికీ, పెట్టుబడిదారీవర్గానికీ మధ్యనున్న సెక్షన్లు ఫాసిజానికీ, గుత్త పెట్టుబడిదార్ల నియంతృత్వానికీ వ్యతిరేకంగా నిలబడి రాటుదేరాయి. తత్ఫలితంగా నూతన ఐక్యతకు అవకాశమేర్పడింది; కార్మికవర్గం రాజకీయంగా యీ వర్గాలను తన వైపు తెచ్చుకొనేందుకు వీలు కలిగింది. ఫాసిస్టు నియంతృత్వానికి లోనైన దేశాల్లో అతివాదశక్తులు మరింతగా బలపడ్డాయి. ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో కార్మికవర్గం అత్యద్భుతమైన పాత్ర వహించడంవల్ల దాని శక్తి అపారంగా అభివృద్ధి చెందింది.

ఫాసిజానికి లోనుగాని దేశాల్లో అధికారం చెలాయించే పెట్టుబడిదారీవర్గం చాలకాలం ఫాసిజంతో సహకరించే విధానం, ఫాసిజాన్ని బలపరిచే విధానం అవలంబించింది.

కాని ప్రజల్లో అతివాద భావాలు ప్రబలమవుతూండడంవల్ల, మేధావివర్గంలోను మధ్యతరగతి ప్రజల్లోనుకూడా దీని ప్రభావం కనిపిస్తూండడంవల్ల, జాతీయప్రాముఖ్యంగల మరికొన్ని పరిణామాలవల్ల ఆ దేశాల్లో పెట్టుబడిదారీ పాలక వర్గాలు ఫాసిస్టు నియంతృత్వానికి వ్యతిరేకంగా మొత్తం సమాజాన్నే సమీకరించవలసి వచ్చింది; చివరకు వారు ఏ బ్రహ్మరాక్షసికైతే పాలుపోసి పెంచారో ఆ బ్రహ్మరాక్షసినే నిర్మూలించేందుకు పోరాడవలసి వచ్చింది.

ఈ పరిణామక్రమ మంతటి పర్యవసాన మేమంటే, మొత్తం సమాజం కొన్ని ప్రజాతంత్ర సూత్రాలకు కట్టుబడి యుండవలసిన అవసర మేర్పడింది. ఈవిధంగా యావన్మంది ప్రజలు ప్రజాతంత్ర సూత్రాలకు బద్ధులైయుండడంవల్ల, ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగిన ఉమ్మడి పోరాటంలో కార్మిక వర్గం, కార్మికవర్గపార్టీలు తమ బలాన్ని అపారంగా అభివృద్ధి చేసుకోడంవల్ల – ప్రపంచశక్తుల బలాబలాలు పూర్తిగా మారిపోయేయి.

అంతేకాదు. 1929–'33 మధ్య ప్రపంచ ఆర్థికసంక్షోభం పెట్టుబడిదారీ దేశాలను ముంచెత్తింది. 'న్యూడీల్' వంటి ప్రయోగాలద్వారా (అమెరికా ప్రభుత్వం విధించినకంట్రోళ్లు) పెట్టుబడిదారీవర్గాన్ని కొంతవరకు అదుపులో పెట్టవలసి వచ్చింది; అనేక పెట్టుబడిదారీదేశాల్లో యుద్ధావసరాలకై పెద్దయెత్తున ప్లానింగ్ పద్ధతి అవలంబింపబడింది; యుద్ధంవల్ల అనేక దేశాలు తీవ్రమైన బాధలకు లోనయ్యాయి; రెండో వేపున సోషలిస్టు వ్యవస్థ అనేక విజయాలు సాధించింది;

అన్నిటికంటె ఉత్తమమైన వ్యవస్థ అదేనని నిరూపింపబడింది. ఈ కారణా లన్నిటివల్ల ప్రజాసామాన్యంలో మధ్యతరగతి ప్రజల్లో మేధావివర్గంలో అతివాద భావాలు వ్యాప్తిచెందేయి. రాజ్యాంగయంత్రం కొన్ని ముఖ్యమైన ఆర్థిక విధులను నిర్వర్తించాలని, అది శ్రేయోరాజ్యంగా పనిచేయాలని వారు డిమాండు చేయడం ప్రారంభించారు.

ఇదొక గుణాత్మకమైన మార్పు. "మానవుడు ఆర్థికోపజీవి" అనే సిద్ధాంతం 19 వ శతాబ్దంలో వ్యాప్తిలో ఉండేది; సొంత ఆస్తి పవిత్రంగా ఎంచబడేది; ధనార్జన మానవ ధర్మంగా పరిగణింపబడేది. పారిశ్రామిక నిపుణు లందరూ వ్యక్తిగతంగా ఎవరికి తోచిన మార్గంలో వారు ధనార్జన చేసినట్లయితే మొత్తం మానవజాతి సౌఖ్య మనుభవిస్తుందని విశ్వసింపబడేది. ధన సంపాదనకై జరిగే యిట్టి ప్రయత్నాలకు రాజ్యాంగ యంత్రం అడ్డురాకూడదనీ, తటస్థంగా ఉండాలనీ, సొంత ఆస్తికి మాత్రం ఎట్టి ప్రమాదం వాటిల్లకుండా చూడాలనీ చెప్పబడేది. ఇట్టి అభిప్రాయాలు పై కారణాలవల్ల నిరాకరింపబడ్డాయి.

20 వ మహాసభయొక్క నివేదికలో, సోషలిస్టు వ్యవస్థ నైతిక విజయం సాధించిందనీ, అదే అన్నిటికన్న ఉత్తమమైన వ్యవస్థగా మానవ హృదయాల్లో స్థానం సంపాదించుకొందనీ చెప్పబడిన మాటకు అర్థం యిదేనని నా అభిప్రాయం.

ప్రపంచశక్తుల బలాబలాల్లో వచ్చిన యీ మార్పు యొక్క ప్రధాన లక్షణ మేమిటో చూదాం. కార్మిక వర్గం గుత్తపెట్టుబడిదారీ సంస్థల నెదుర్కోడంలో ఏకాకిగా లేదు;

ఇతరశక్తులుకూడా దానితో కలిసేయి. పెట్టుబడిదారీవర్గం ప్రజా తంత్ర రాజ్యాంగాన్ని, ఉల్లంఘించేందుకు కార్మికవర్గం మీాద చేసే ఎదురు దాడులను యీా నూతన శక్తులు ప్రతిఘటించ గలవు.

ఈ పంథాలోనే యింకొంచెం దూరం ఆలోచిస్తే ఒక విషయం స్పష్టమవుతుంది. ఈ నూతనశక్తులతో చేతులు కల పడం ద్వారా, ప్రజాస్వామ్యంమీాద గుత్తపెట్టుబడిదారీవర్గం చేసే దాడిని స్తంభింపజేసేందుకై ఈ శక్తుల సహకారం సంపా దించడం ద్వారా, సోషలిజాన్ని సాధించేందుకవసరమైన కార్యక్రమంమీాద ప్రజాసామాన్యాన్ని అంతకంతకు అధికంగా సమీాకరించడం ద్వారా – కార్మికవర్గం ఎట్టకేలకు పార్ల మెంట్లలో మెజారిటీ సంపాదించి, సోషలిజాన్ని సాధించేందు కవసరమైన కార్యక్రమాన్ని అమలు జరపగల్గుతుంది. ఈ పరిణామక్రమ మంతటిలోను యీా సెక్షన్ల సహకారం ఎంతో అవసరం. అయితే యిక్కడొక ప్రశ్న ఉత్పన్నం కావచ్చు. ఈనాడు రాజ్యాంగ యంత్రాన్నీ ఉత్పత్తి సాధనా లనూ చేజిక్కించుకుని అధికారం చెలాయిస్తున్న గుత్త పెట్టు బడిదార్ల దాడిని తిప్పికొట్టగల శక్తి యీా సెక్షన్లకున్నప్పుడు కార్మికవర్గపార్టీ పార్లమెంటులో మెజారిటీ సంపాదించి సోష లిజాన్ని ప్రవేశపెట్టడానికి పూనుకొంటూంటే తానే రాజ కీయాధికారమంతా చేజిక్కించుకోగల శక్తి మాత్రం వాటి కెందుకుండదు ? దీని అర్థం, పెట్టుబడిదారీవర్గం పదచ్యుతి పొందే ఆఖరుక్షణాల్లో ఆ వర్గం యొక్క ఎదురుదాడిని ఎవరు స్తంభింపచేయగల్గుతారు – అనేది ప్రధాన సమస్య.

రాజ్యాంగాధికారం బదిలీకావడానికి ముందు ప్రజా స్వామ్యవ్యవస్థ ప్రజల వాంఛలను యీడేర్చ లేక తన్ను తాను విచ్ఛిన్న మొనర్చుకొనేవిధంగా వ్యవహరి స్తేనూ, పెట్టుబడిదారీ వర్గం ప్రజలపై ఎదురుదాడి చేసేందుకు అవకాశమి స్తేనూ, సాయుధ కార్మికులే స్వయంగా తిరుగబడి పెట్టుబడి దారుల ఎదురుదాడిని స్తంభింప జేసి వారి అధికారాన్ని కూల ద్రోయవలసివ స్తేనూ - మాత్రమే శ్రామిక నియంతృత్వాన్ని నెలకొల్పడం సాధ్యం; అవసరం. అలా కాకుండా, కార్మిక వర్గంయొక్క, అభ్యుదయ కాముకులైన మధ్య సెక్షన్లయొక్క బలాన్ని వ్యక్తంచేసే ప్రజాస్వామ్య సంస్థలే యీ కర్తవ్యాన్ని నిర్వహించిననాడు ప్రతిపక్షపార్టీలు, పత్రికా స్వాతంత్ర్యం వంటి బూర్జువా ప్రజాస్వామ్య హక్కులను రక్షించగలశక్తీ, వాటిని సుస్థిరంగా నిలబెట్టగలశక్తీ యీ ప్రజాస్వామ్యసంస్థల కుంటుంది.

దీని అర్థమేమంటే, నూతన సోషలిస్టు పరిణామక్రమం సరికొత్త పంథాలో పురోగమించడమేకాక, కొన్ని విలక్షణ మైన వ్యవస్థలను కూడా రూపొందించుకొని, బూర్జువా ప్రజా స్వామ్యంయొక్క విజయాలను కూడా కాపాడుతుంది. ప్రజా స్వామ్య వ్యవస్థను వికృతమొనర్చేందుకు జరిగే ప్రయత్నా లను యీ మధ్య సెక్షన్లు నిరోధించడమేకాక, దాన్ని మరింత పటిష్ఠమొనర్చుతాయి.

ఈ సందర్భంలో మన మొక విషయం జ్ఞాపకముంచు కోవాలి. మధ్య సెక్షన్లు కార్మికవర్గానికి మిత్రకోటిగా ఉండ గలవన్నమాట నిజమే. కాని, వాటిని కమ్యూనిస్టుపార్టీల

సహచర బృందంగా మాత్రం పరిగణించకూడదు; కమ్యూనిస్టేతర శక్తిగా వాటిని పరిగణించాలి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నివేదిక ఒక విషయాన్ని ప్రముఖంగా ఎత్తిచూపింది. శాంతియుతంగా సోషలిజాన్ని సాధించేటందుకు కొత్త అవకాశాలీనాడు అనేక యూరపియన్ దేశాల్లో ఏర్పడ్డాయని చెప్పడంతో బాటు, ప్రస్తుతం కార్మికవర్గం చీలిపోయి ఉందనీ, కమ్యూనిస్టుపార్టీని అనుగమించే కష్టజీవులకూ సోషలిస్టుపార్టీలను అనుగమించే కష్టజీవులకూ మధ్య ఐక్యత లేదనీ, సోషలిజాన్ని శాంతియుతంగా సాధించే కృషికి యిది ఆటంకంగా ఉందనీ స్పష్టంచేసింది. యూరపియన్ దేశాల్లో కమ్యూనిస్టు పార్టీల ప్రప్రథమ కర్తవ్యం ఇట్టి ఐక్యతను నిర్మించడం అని తెలియజేసింది. ఇలాగే యితర అభ్యుదయకర ప్రజాస్వామ్య శక్తులతో కూడ ఐక్యతను సాధించవలసి యుంటుందని చెప్పింది. అందుచేత యిది ఇతర శక్తులతో ఐక్యతను సాధించవలసిన కర్తవ్యం; కమ్యూనిస్టుపార్టీ ప్రజాసామాన్యంలో తన పలుకుబడిని విస్తరింపజేసే సమస్యకూ దీనికీ తేడా ఉంది.

ఉదాహరణకు, పశ్చిమ యూరపులో నేడున్న పరిస్థితిని పరిశీలిద్దాం. చాల పశ్చిమ యూరపియన్ దేశాల్లో బలీయమైన కమ్యూనిస్టుపార్టీ లున్నాయి; పార్లమెంట్లలో వాటి ప్రతినిధులు చాలమంది ఉన్నారు; బహిరంగంగా అది పనిచేయవచ్చు; ప్రజాస్వామ్య వ్యవస్థయొక్క ఉపయోగాలను అవి అనుభవిస్తున్నాయి. ఈ బలం లెనిన్ చెప్పిన 'క్లిష్ట పరిస్థితి'కి సమీపంలో ఉందనీ, కొన్ని సందర్భాలలో అతిక్రమించిందనీకూడ చెప్పవచ్చు. ఈ దేశాల్లో పార్టీని అణచియుంచ

డానికి పెద్ద యెత్తున ప్రయత్నాలు జరగడంలేదంటే, ప్రజా స్వామ్య నిర్మాణం యొక్క శక్తి, దాని పరిపక్వత, మధ్య సెక్షన్లు పెట్టుబడిదారీ నియంతృత్వాన్ని వ్యతిరేకిస్తూండడం-కారణమని చెప్పాలి. అయితే ఒక విషయం గమనించాలి. ఈ కూటమి యొక్క బలంవల్ల పెట్టుబడిదారీ నియంతృత్వమేర్పడకుండా చేసేశక్తులు ఉత్పన్నమవడంతోపాటు, కమ్యూనిస్టుపార్టీల అభివృద్ధి స్తంభించడానికూడా అది కారణమవుతుంది. ఉదాహరణకు ఫ్రాన్స్, ఇటలీదేశాల్లో మితవాదులు, మధ్య సెక్షన్లు, కమ్యూనిస్టులు దాదాపు సరిసమానంగా ఉన్నాయి; కమ్యూనిస్టుపార్టీబలం యథాస్థితిలో ఉంది.

ఈ మధ్య సెక్షన్ల సహకారం సంపాదించడమెలాగు - అనేదే ప్రస్తుత సమస్య. ప్రస్తుత ప్రజాస్వామ్యవ్యవస్థ ఫాసిజంలోకి దిగజారకుండా చూడాలంటే, మధ్య సెక్షన్ల సహకారం తప్పనిసరి అవుతోంది. అదేవిధంగా, సోషలిజంవైపు పురోగమించడానికవసరమైన ఏ కార్యక్రమాన్నైనా అమలు జరపాలంటే, కమ్యూనిస్టులు మధ్య సెక్షన్లలో శక్తినంతులందరి సహకారం పొందాలి. ప్రజాస్వామ్యంలో యీ సెక్షన్లకున్నవిశ్వాసం ప్రపంచ చరిత్రలో యీనాటికీ ఒక విశిష్టపాత్ర వహిస్తోంది. ఆ విశ్వాసాన్ని, వారి ప్రజాస్వామ్యవాంఛలను ఎంతగా గౌరవిస్తే అంతగా వారి సహకారం పొందగలం. అంటే, పెట్టుబడిదారీ నియంతృత్వాన్ని వ్యతిరేకించే విషయంలోను, సోషలిజాన్ని బలపరిచే విషయంలోను వారి నిజాయితీని కమ్యూనిస్టులు గుర్తించాలన్నమాట. అలాగే, ప్రజా స్వామ్య వ్యవస్థను గౌరవించే విషయంలో కమ్యూనిస్టులు

నిజాయితీపరులనే విషయాన్ని యీ సెక్షన్లు గుర్తించునట్లు చూడాలి. ఈ సెక్షన్లు ప్రస్తుతం అభ్యుదయకరపాత్ర వహిస్తున్నారనీ, యికముందుకూడా అభ్యుదయ కాముకులుగానే వా రుండగలరనీ స్పష్టంగా గుర్తించాలి.

ఇది చాల కష్టమైనపని. ఇందుకు యూరపియన్ కమ్యూనిస్టుపార్టీలు సోషల్ డెమాక్రట్లను సంబోధిస్తూ, వారి సహకారం కోరుతూ, ధైర్యంగా ప్రకటనలు చేయడం, నిర్దిష్టమైన ప్రతిపాదనలు చేయడం ఎంతో అవసరం. అంతే కాదు. పశ్చిమ యూరపియన్ దేశాల్లో అమలు జరిగేలాంటి ప్రజాస్వామ్య హక్కులను కమ్యూనిస్టులు తూర్పు యూరపియన్ దేశాల్లో పునరుద్ధరించడానికి పూనుకోవాలి. ప్రచ్ఛన్న యుద్ధంవల్ల కొన్ని నిర్బంధాలు విధించడం అవసరమూ అనివార్యమూ అయినప్పటికీ, యిలాంటి విధాన మవలంబించడ మెంతవరకు సాధ్యమో అంత త్వరితంగా సోషలిజం యీ దేశాల్లో పురోగమిస్తుంది. నిజం చెప్పవలసివస్తే, ప్రచ్ఛన్న యుద్ధాన్నెదుర్కొని ఓడించడానికూడా యిట్టి మార్గం తప్పనిసరి అవుతుంది.

ఇక్కడొకవిషయం పేర్కొనడం అవసరం. బాహ్యపరిస్థితుల్లో వచ్చిన మార్పులవల్ల కొత్త అవకాశా లేర్పడ్డాయనీ అందుచేత కమ్యూనిస్టుపార్టీలు కొత్త వ్యూహం చేబట్టవలసి యుందనీ మార్క్సిస్టులు చెబుతున్నారంటే, ఆ అవకాశాలను వినియోగించుకోవడమూ లేక వినియోగించుకోకపోవడమూ అనేది మన యిష్టాయిష్టాలనుబట్టి ఉంటుందని అర్థంకాదు. ఒక కొత్తపరిస్థితి కొత్త అవకాశాన్ని కలిగించినప్పుడు పాత

అవకాశాలు రద్దయిపోయాయన్నమాట. అందుచేత, శాంతియుతంగా సోషలిజాన్ని సాధించగల అవకాశాలు ఏ దేశాల్లో ఏర్పడ్డాయో ఆ దేశాల్లో పాతపద్ధతుల్నే అవలంబిస్తే కమ్యూనిస్టుపార్టీల కార్యకలాపాలను ప్రజాస్వామ్యవాదులు వ్యతిరేకిస్తారన్నమాట.

ప్రజాస్వామ్యంపై ఆధారపడే సామాజిక వ్యవస్థలో వీరి కెంత విశ్వాసమంటే, దాన్ని కూలద్రోసేటందుకు ఏ సెక్షన్ ప్రయత్నించినాసరే ఆ సెక్షన్‌ని వారు వ్యతిరేకిస్తారు. ముందు ముందు కమ్యూనిస్టు నియంతృత్వ మేర్పడుతుందేమోనని వారు భయపడవచ్చు; విప్లవం తీసుకురావడానికి ప్రయత్నిస్తే అపారమైన రక్తపాతం జరుగుతుందని ఆందోళన చెందనూ వచ్చు. కారణ మేది అయినా, యీ సెక్షన్లు అలాంటి విప్లవాన్ని వ్యతిరేకిస్తారు. అంతే కాదు. అందుకోసం సన్నాహాలు జరుగుతూన్నట్లు అనుమానం కలిగితే, ఆ సన్నాహాలను వ్యతిరేకిస్తారు. ప్రస్తుతం రాజ్యాంగ యంత్రాలు బలంగా ఉండడం వల్ల, సైన్యాలెల్లప్పుడూ సిద్ధంగా ఉండడంవల్ల, ప్రజల్లో అత్యధిక సంఖ్యాకుల సపోర్టు ఉంటేతప్ప సాయుధ విప్లవాలేవీ జయించవు. అలాంటి సపోర్టు ఉన్ననాడు శాంతియుతంగా కూడ పరివర్తన తీసుకురావచ్చునని పైన విశదీకరించేను. అందుచేత, కొత్త వ్యూహాన్ని నిరాకరించడంవల్ల ప్రస్తుత ప్రతిష్టంభన మరికొంతకాలం కొనసాగవచ్చునేమోగాని, ఉత్తరోత్తరా కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి తగ్గిపోవడాని కది దారితీయకమానదు.

రెండవ విషయం: సోషలిస్టు ప్రజాస్వామ్యం ఆచరణలో ఏవిధంగా వికృత మొనర్చబడిందో తెలియజేసే ఒప్పుకోలులు, విమర్శనలు 20 వ మహాసభలో వ్యక్తం చేయబడ్డాయి. అవి ప్రపంచ కమ్యూనిస్టులలో బ్రహ్మాండమైన ఉత్సాహాన్ని రేకెత్తించాయి. కమ్యూనిస్టు లెల్లప్పుడు స్వాతంత్ర్యానికే కట్టుబడి ఉంటారు. స్వాతంత్ర్యంలో వారికి అద్భుతమైన విశ్వాసం ఉండడంవల్లనే లక్షలాదికమ్యూనిస్టులు సంతోషంగా చెప్పనలవిగాని బాధలు అనుభవించేరు; కాన్సెంట్రేషన్ క్యాంపులలో జీవించేరు. చిత్రహింసలకు హత్యలకు లోనయ్యేరు. సంపూర్ణ మానవ స్వేచ్ఛకై అందరికంటె ముందుండి పోరాడేది కమ్యూనిస్టులేనని రుజువయింది. కొన్ని నిర్దిష్టమైన చారిత్రక పరిస్థితుల్లో కొన్ని నిర్దిష్టమైన శ్రామిక నియంతృత్వ రూపాలు పరిణతిచెందేయి.

అంతేకాదు. కమ్యూనిస్టులు స్టాలిన్ యుగంనాటి కొన్ని పొరబాటు సూత్రీకరణలను గుడ్డిగా స్వీకరించడంవల్ల సోవియట్ యూనియన్‌లోను తూర్పుయూరపు దేశాల్లోను అమలు జరిగిన కొన్ని పొరబాటు చర్యలను సపోర్టుచేశారు. ఈ విషయాన్ని కమ్యూనిస్టులు సిద్ధాంతరీత్యా పూర్తిగా అంగీకరించేరు. అంతేకాక, సోషలిస్టు వ్యవస్థలో సంపూర్ణమైన ప్రజాస్వామ్యహక్కులు, న్యాయశాస్త్రంలో ఉన్నహక్కులు సోషలిజాన్ని వ్యతిరేకించే వర్గాలకు దయాధర్మంగా యివ్వాలని కాకుండా, కమ్యూనిస్టుల రక్షణకు క్షేమానికి కూడ అవి ఎంతో అవసరమని 20 వ మహాసభలో గుర్తింపబడింది. ఇంచుమించు అన్ని దేశాల్లోని కమ్యూనిస్టుపార్టీల నాయకులు,

మేధావివర్గంనుంచి వచ్చిన కమ్యూనిస్టులు యిట్టి అభిప్రాయాల్నే వ్యక్తంచేసేరు. కామ్రేడ్ టోగ్లియాటీ ప్రకటన, అమెరికన్ కమ్యూనిస్టుపార్టీ ప్రకటన, పోలిష్ వర్కర్స్ పార్టీ తీర్మానం (పోలిష్ రోడ్ టు సోషలిజం) యీ నూతన ఉత్సాహానికి చిహ్నాలని చెప్పవచ్చు. పోలెండ్‌లో సోషలిజం యింకా పురోగమించేకొద్దీ, సోషలిజం సాధనకు యీ నూతన ప్రజాస్వామ్య పంథా ఎంత ఆచరణయోగ్యమైనదో మరింత చక్కగా రుజువవుతుంది.

ఇదివరకే నేను పేర్కొన్న సామాజిక పరిణామాల విషయంతోబాటు యిదొక బలీయమైన ఆంతరంగిక శక్తి అని తెలుసుకోవలసియుంది. కమ్యూనిస్టు వ్యూహంలోను, ఆచరణలోను మార్పు తీసుకువచ్చేటందుకిది ఎంతైనా తోడ్పడుతుంది; అట్టి ఉద్యమాన్ని త్వరిత మొనర్చుతుంది; ఆధునిక సమాజంలోని మార్పులను గురించి, పరిపక్వస్థితిని గురించి అవగాహన చేసుకొని, శాంతియుతంగా సోషలిజాన్ని సాధించేందుకు నేడు అవకాశాలున్నాయని ప్రకటించడం శాస్త్రీయ మార్క్సిస్టు అంచనా. నూతన పరిస్థితుల కనుగుణ్యంగా కమ్యూనిస్టు వ్యూహంలోను, వైఖరిలోను మార్పురావలసియుంది; సోషలిస్టు వ్యవస్థలోను, అంగ నిర్మాణంలోను మార్పు రావలసియుంది; సోషలిస్టు ప్రజాస్వామ్యంలో మార్పు రావలసియుంది.

— 'న్యూఏజ్' డిసెంబరు 1957

# ఉభయ ఆలోచనాధోరణుల మధ్య సామ్యం : వ్యత్యాసం

## క్రాంతి

భారత కమ్యూనిస్టుపార్టీ ప్రజల అభిరుచులను, దేశ సంప్రదాయాలను పూర్తిగావిస్మరిస్తుందనీ, విదేశాలనుంచి తన భావాలను ఎరువు తెచ్చుకొంటుందనీ ఆరోపణలు చేయడం పరిపాటయింది. ఇతరరాష్ట్రాల విషయం నేను రూఢిగా చెప్పలేను గాని, ఆంధ్రరాష్ట్రంలో మాత్రం కమ్యూనిస్టులు తెలుగు సాహిత్యంమీద అనేక గ్రంథాలను ప్రచురించడంద్వారాను, ఆంధ్రదేశ చరిత్రపై పరిశోధనలు జరిపించడం ద్వారాను, సాహిత్యరంగలో మహాపురుషుల అముద్రిత రచనలను వెలుగులోకి తీసుకురావడంద్వారాను – మన జాతీయ సంప్రదాయాలను వ్యాప్తిలోకితెచ్చి ఎంతో సేవచేస్తున్నారు. ఈ విషయంలో ఎవరికీ సందేహం లేదు "విదేశాలనుంచి తన భావాలను ఎరువుతెచ్చుకొనే" పార్టీ ఏదీ యిలా చేయజాలదు.

ఆచార్యభావేనంటి పెద్దలు కమ్యూనిస్టుపార్టీని నిర్మాణాత్మక పద్ధతిలో విమర్శించ పూనుకోవడం హర్షించదగ్గ

విషయం. అంతేకాదు. కమ్యూనిస్టులు "అల్లరిచేయడమే పనిగా పెట్టుకున్న ముఠా" కాదనీ, తగినంతబలం వారికున్న దనీ, ప్రజల్లో వారు బాగా వేళ్లూనేరనీ స్పష్టమవుతుంది.

మార్క్సిజం ఎప్పటికైనా సర్వోదయంలో కలిసి పోవడం తప్పదని ఆచార్యభావే ఆశించడంలో విడ్డూరమేమీ లేదని నా అభిప్రాయం. మార్క్సిజం పిడివాదంకాదని మనం పదేపదే చెప్పుకుంటాం. జాతీయ సంప్రదాయాలనుదృష్టిలో ఉంచుకొంటూ, దేశావసరాల కనుగుణ్యంగా మార్క్సిజాన్ని వర్తింపజేయగల్గితేనే మనం వృద్ధిలోకివస్తాం. జయప్రదంగా తమ లక్ష్యాలను సాధించిన మార్క్సిస్టులంతా అన్ని దేశా ల్లోను యిలాగే చేశారు. ఉదాహరణకు చైనాకూ మనదేశా నికీ చాల పోలికలున్నాయి. కన్‌ఫ్యూషియస్, బుద్ధుడు చైనా జాతిమీద కలిగించిన ప్రభావాన్ని అక్కడి కమ్యూనిస్టులు దృష్టిలో ఉంచుకొన్నారు. మార్క్సిజాన్ని చైనా దేశ పరిస్థితు లకు వర్తింపజేయడం ద్వారా దాన్ని పటిష్ఠ మొనర్చారు. అలాగే భారతదేశంలో కూడ మార్క్సిస్టులు మన ప్రజల మీద ఎక్కువ ప్రభావం కలిగించిన, ఒకేజాతిగా మనదేశం పరిణతి చెందడానికి ప్రోద్బలమిచ్చిన తాత్వికాలోచనలను అధ్యయనం చేస్తూ మార్క్సిజాన్ని మన దేశపరిస్థితులకు అన్వయించడం నేర్చుకోవాలి. బౌద్ధంలోను, జైనమతంలోను ఉన్న మంచిని స్వీకరించడంద్వారా, చారిత్రక పరిస్థితుల్ని బట్టి కొన్ని మార్పులు చేసుకోడం ద్వారా హిందూమతం మనదేశంలో అభివృద్ధిచెందింది. అలాగే మార్క్సిజం కూడా (ఇదొక మతం కాకపోయినప్పటికీ, శాస్త్రీయ సిద్ధాంతమే

అయినప్పటికీ) సర్వోదయంవంటి ఆలోచనా ధోరణులను తనలో లీనంచేసుకొంటుంది. అలాకాకుండా, సర్వోదయమే భారత దేశ పరిస్థితులకు అనుగుణ్యంగా ఉండి, అదే మంచి ఫలితాలను యివ్వగలిగితే, అది భారతదేశానికి వర్తించే మార్క్సిజం అవుతుంది.

కమ్యూనిస్టు లీరోజున రాజ్యాంగచట్టానికి లోబడి పని చేస్తామంటున్నారు. దీన్నిబట్టి, మార్క్సిజంలో విశ్వాసమున్న వారు తమ విశ్వాసాన్ని కొత్తపరిస్థితులకు తగినట్లు మార్చు కున్నారనడంకంటె మార్క్సిజాన్నే క్రొత్తపరిస్థితులకు అన్వ యిస్తున్నారనడం సరియైనది. అంతేకాదు. పైవాక్యంలో కమ్యూనిస్టులకు పార్లమెంటరీ పద్ధతుల్లో విశ్వాసంలేదనే అర్థం యిమిడి ఉంది. ఇది సరికాదు. కమ్యూనిస్టులు స్వేచ్ఛగా పనిచేయడానికి అవకాశాలుంటే వారు చాల సంతోషిస్తారు. పార్లమెంటరీ పద్ధతులద్వారా వారు తమ లక్ష్యాన్ని సాధించ గల అవకాశాలుంటే, కమ్యూనిస్టుల కన్న సంతోషించేవారు మరొకరుండరు. కాని వారి అనుభం ఒకటి చెబుతోంది. కమ్యూనిస్టులు నిర్ధాక్షిణ్యంగా హింసింపబడ్డారు; వారికి వాక్స్వాతంత్ర్యం లేకుండా చేయబడింది. గూఢచారులు వారిని వెన్నంటుతూ వచ్చారు; ఉద్యోగాలనుంచి వారు బర్తరఫు చేయబడ్డారు; దీర్ఘకాల శిక్షలకు గురిచేయబడ్డారు. 1952 ఎన్నికల్లో అనేకమంది కమ్యూనిస్టులు జైళ్లల్లో ఉండగానో రహస్య జీవితం గడుపుతూండగానో పోటీచేసి గెలిచిన విషయం మనందరికీ తెలుసు. పార్లమెంటరీ పద్ధతుల్లో కమ్యూ

నిస్టులకు విశ్వాసం ఉందనడానికి ఇంతకన్న తార్కాణ మక్కర్లేదు. భారత దేశంలో కమ్యూనిస్టుల కిది క్రొత్తకూడా కాదు.

మానసిక పరివర్తన అంటే కమ్యూనిస్టులకు విశ్వాసం లేదని ఆచార్యభావే అంటున్నారు. ఇది చాల ఆశ్చర్యకరమైన విషయం. అలాగే, కమ్యూనిస్టుల తాత్వికాలోచనల్లో హృదయ పరివర్తనకు స్థానంలేదనడంకూడా సరికాదు.

హృదయ పరివర్తనకు సంబంధించినంతవరకు ప్రపంచంలో యించుమించు ప్రతి తత్వశాస్త్రం దాన్ని బోధించింది; కాని ఆచరణలో ఎక్కడా అది ఫలించలేదు. గాంధీ మహాత్ముని "శిష్యుల" విషయమే చూదాం ఒత్తిడిద్వారా కాక యితర పద్ధతులద్వారా వారు ప్రజల్లో ఎన్నడైనా మానసిక పరివర్తన తీసుకువచ్చారా? ఒక పెట్టుబడిదారు ఆదాయపు పన్నును ఎగవేస్తాడు. ఎవరైనా అతని చర్యను ఖండిస్తే కఠినమైన శిక్ష విధించాలని డిమాండుచేస్తే – పెద్దమనుష్యులంతా అతనిలో హృదయ పరివర్తన తీసుకురావాలంటారు. కాని కార్మికులు కాస్త ఎక్కువ కూలి కోసం శాంతియుతంగా సమ్మెచేస్తే వారిని అరెస్టు చేస్తారు; కొట్టి హింసిస్తారు; తుపాకులతో కాలుస్తారు. ఈ "అహింసా ప్రవక్తలు" బలప్రయోగంతో తమ నిర్ణయాలను అమలు జరపడానికి ప్రయత్నిస్తారెందుకో! కార్మికుల్లో, సామాన్య ప్రజల్లో మానసిక పరివర్తన తీసుకురావడానికెందుకు ప్రయత్నించరో!

కాబట్టి అసలు విషయం ఏమంటే, పెట్టుబడిదార్లు నేరంచేసినప్పుడీ ప్రబుద్ధులు "హృదయ పరివర్తన" తీసుకురావడానికి ప్రయత్నిస్తారు; కార్మికులు ఏదైనా కావాలని అడిగితే

మాత్రం బలప్రయోగం ద్వారా వారిని అణచివేస్తారు; తమ నిర్ణయాలను వారిమీద రుద్దుతారు. నేను ఆచార్యభావేను నిందించడంలేదు. "అహింసా ప్రవక్తలు" దేశపాలకులుగా అధికారంలోకి వచ్చినప్పటినుంచీ జరిగిన వందలాది తుపాకి కాల్పులకు, లాఠీఛార్జీలకు బాధ్యుడు ఆచార్యభావే కాదు. నేను చెప్పదలచుకున్నదల్లా ఒక్కటే: స్వార్థపరుల ప్రయోజనాలను కాపాడవలసివచ్చేసరికి యీ అహింసా ప్రవక్తలు జనాన్ని హత్యచేయడానికూడ వెనుదీయలేదు. కాని మానసిక పరివర్తనలో నమ్మకంలేదని చెప్పబడే కమ్యూనిస్టులు పెట్టుబడిదారుల చేతకూడా దేశశ్రేయస్సుకై పనిచేయిస్తున్నారు; దేశాభిమానంతో వారు పనిచేసేటట్లు చేస్తున్నారు (చైనాలో మాదిరిగా).

"మానసిక పరివర్తన" సిద్ధాంతాన్నే ఖచ్చితంగా అమలుజరపదలచుకుంటే, ప్రభుత్వం పోలీసుల్నీ సైనికుల్నీ బర్తరఫు చేయవలసి యుంటుంది. ఎందుచేతంటే శాంతి భద్రతలకు భంగం కలిగించే రౌడీలలో "మానసిక పరివర్తన" తీసుకురావచ్చుగా! మన దేశంమీద దురాక్రమణ చేయడానికి వచ్చే విదేశీయుల హృదయాలను కూడ మార్చవచ్చుగా! కాని యిలాచేస్తే దేశంలో అరాజకం ప్రబలుతుందని అందరికీ తెలుసు. ఈ విషయంలో నాందీప్రస్తావన చేసింది కేరళ కమ్యూనిస్టులు; కేంద్రంలోనూ యితర రాష్ట్రాల్లోను అధికారంలో ఉన్న "అహింసా ప్రవక్తలు" కాదు. కేరళలో పోలీసుబలగాన్ని ప్రజలమధ్య తగాదాలను పరిష్కరించడానికికాక, ఒక పక్షంయొక్క నిర్ణయాలను

యింకొక పక్షంమీద బలవంతంగా రుద్దడానికి కాక, నిజంగా శాంతి భద్రతలను కాపాడ్డానికి ఉపయోగింపబడుతోంది; ప్రజాతంత్ర పద్ధతుల్లో దాన్ని సంస్కరించడానికి ప్రయత్నం జరుగుతోంది. కమ్యూనిస్టులకు హృదయ పరివర్తనలో నమ్మకం ఉందనడానికి యింతకన్న చక్కని ఉదహారణ ఏమి కావాలి ?

కమ్యూనిస్టులకు యికముందు రాబోయే సత్యయుగం లోనే కాక, యిదివరకు గడచిన సత్యయుగంలో కూడ విశ్వాసం ఉంది. అయితే, సాంప్రదాయికుల అభిప్రాయానికీ వారి అభిప్రాయానికీ తేడా ఉంది. వారు, గతించిన సత్య యుగంకంటె రానున్న సత్యయుగం ఉన్నతమైనదని భావిస్తారు. మొదటికారణమేమంటే నేడుశాస్త్రవిజ్ఞానం, సాంకేతికాభివృద్ధి మానవునికి సహాయకారులుగా ఉన్నాయి. రెండవ కారణం మానవుని చైతన్యం కూడా ఉన్నత స్థాయినందుకుంటుంది గనుక మొత్తం సమాజమే అత్యున్నతమైన నిర్మాణరూపం ధరిస్తుంది.

సర్వోదయవాదులు యిప్పుడే తాము సత్యయుగాన్ని సాధించ ప్రయత్నిస్తున్నామని చెబుతున్నారు. "కమ్యూనిజం ఎలాగూ వచ్చేదే గనుక యిప్పుడు మనమేమీ చేయనక్కర లేదు" అని కమ్యూనిస్టు లెన్నడూ అనరు. అలావారు చెప్పి యుంటే. స్వప్నప్రపంచంలో విహరించేవారుగా వారుండిపోయే వారు. ప్రజలు వారిని ఏనాడో మరచిపోయి యుండేవారు. అట్టి వైఖరి కార్యశూన్యతకు దారితీస్తుందనీ, తమ లక్ష్య మెన్నటికీ యీడేరదనీ వారెరుగుదురు. కేరళలో వారు

చేస్తున్న ప్రయోగం సత్యయుగాన్ని సాధించే కృషిలో ఒక ముందడుగు అని చెప్పవచ్చు. వారు అంతకంతకు అధికంగా, నిర్విరామంగా సత్యయుగాన్ని సాధించేందుకు కృషిసల్పు తారు. అందుచేత సర్వోదయవాదులు, కమ్యూనిస్టులు యీ విషయంలోకూడ ఏకీభవిస్తారు; ఆచార్యభావే చెబు తున్నట్లు వారిమధ్య భేదాభిప్రాయం లేదు.

కమ్యూనిస్టులకు హింసలో నమ్మకముందనే అపవాదు తరచు వినబడుతూంది. ఆచార్యజీ మాత్రం అట్టి ఆరోపణ చేయడం లేదు. ఈ సమస్యను పరిస్థితులతో సంబంధంలేకుండా చర్చించడంవల్ల ఉపయోగంలేదు. లక్ష్యాలు, సాధనాల విషయంకూడా యింతే. ఒకటిమాత్రం స్పష్టంగా చెప్పవచ్చు. హింస కమ్యూనిస్టుల మత విశ్వాసంకాదు. హింసద్వారానే తమ లక్ష్యం సిద్ధిస్తుందని కూడా వారు అనుకోరు. తమ యిష్టంవచ్చిన పోరాటరూపాలను వారు ప్రజలమీద రుద్దరు; చారిత్రక అవసరాల్నిబట్టే వివిధ పోరాట రూపాలు ఉత్పన్న మవుతాయని వారి నమ్మకం. ఒకానొక దశలో ఒక పోరాట రూపం అవసరమని చరిత్ర నిరూపిస్తూన్నప్పుడు కమ్యూ నిస్టులు ఆ పోరాటాన్ని నడపకపోతే, లేదా తమ సొంత పోరాటరూపాలను రుద్దితే, అది ప్రజలకు ద్రోహంచేయ డంతో సమానం. కమ్యూనిస్టులకు ప్రధానంగా కావలసింది ప్రజలు పోరాటంలో పాల్గొనడం; అంతేగాని పోరాట రూపాలు కాదు. పోరాటరూపాలకే ప్రాధాన్యమిస్తే, ప్రజలు ప్రేక్షకులపాత్ర వహిస్తారు; కొంతమంది సాహసవంతులు,

అమరవీరులు తప్పక ఉంటారు; మొత్తం జాతి మాత్రం విగ్రహారాధకుల జాతిగా తయారవుతుంది.

కమ్యూనిస్టులు ముందెప్పుడో హింసారహిత సమాజాన్ని స్థాపించేందుకు ప్రస్తుతం హింసను ఉపయోగిస్తారనుకోవడం పొరబాటు. అదే సమయంలో, తమ కిష్టమనితోచిన పోరాటరూపాలకై ప్రజల ప్రయోజనాలను వారు ఆహుతి చేయరు. మొట్టమొదట హింసను ఉపయోగించేది కార్మికుల శత్రువులు, రైతుల శత్రువులూను. ఆ హింసాకాండనుంచి ప్రజలు రక్షించుకొంటూన్నప్పుడు, కమ్యూనిస్టులు వారికి నాయకత్వం వహిస్తూన్నప్పుడు కపటదేశభక్తులు "అదుగో చూడండి! మీరు హింసకు దిగుతున్నారు!" అంటూ కేకలేస్తారు.

—'న్యూ ఏజ్' డిసెంబరు 1957

# గాంధీజీ తర్వాత గాంధీవాదం

## ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్

(గాంధీ మహాత్ముడు : ఆయన ఉపదేశాలు అను గ్రంథంలో చివరి ప్రకరణం.)

మోహన్‌దాస్ కరంచంద్ గాంధీజీ జీవితగాథ ముగింపుకు వచ్చేం. కనుక సహజంగానే ఒక ప్రశ్న వస్తుంది: ఒక హంతకునిచేతిలో ఆయన దుర్మరణం పొందిన పదేళ్ళ తర్వాత ఈనాడు దేశంలో గాంధేయ ఆలోచనాధోరణి ఎటువంటి స్థితిలో వుంది ?

ఇక్కడొక చిత్రమైన విషయం వుంది. గాంధీజీ ప్రియశిష్యు లనదగినవారీనాడు చాలమంది సజీవులయి వున్నారు వీరంతా ఒకనాడు గాంధేయ సిద్ధాంతాలకు ప్రధాన వ్యాఖ్యాతలుగా ప్రసిద్ధిపొందినవారే. కాని, వారీనాడు గాంధీసిద్ధాంతాల సారం ఏమిటనేదానిమీద ఏకాభిప్రాయం తెలపడంలేదు. నిత్యజీవితంలో వచ్చే చిక్కు సమస్యలకు ఆ సిద్ధాంతాలను సమన్వయించడంలో కూడ వారికి ఏకాభిప్రాయం లేదు. ఎవరికి వారే తాము గాంధీజీ సిద్ధాంతాలను

తు. చ. తప్పకుండా అనుసరిస్తున్నామని చెప్పుకుంటూ, మిగతావారంతా గాంధీజీ ఆదర్శాలను నీటగలుపుతున్నారని నిందిస్తున్నారు.

గాంధీజీ సిద్ధాంతాల సారం ఏమిటనే విషయంలోనూ, నిత్యజీవితంలో ఎదురయ్యే చిక్కు సమస్యలకు వానిని సమన్వయించడంలోనూ గాంధీజీ శిష్యులమనుకొనేవారిలో ఏకాభిప్రాయం లేకపోయినా, వారిలో ఒకరు - వినోబాభావే - గాంధీజీకి నిజమైన అనుచరుణ్ణనీ, ఆయన వారసుణ్ణనీ చెప్తున్నారు. గాంధీజీ జీవితకాలంలో ఆయనను గురించి ప్రజలు అంతగా ఎరుగరు. బ్రిటిషు ప్రభుత్వం భారతదేశాన్ని యుద్ధంలోకి ఈడ్చినందుకు అసమ్మతిగా శాసన ధిక్కారం చేయడానికి గాంధీజీ 1940 లో మొట్టమొదటి సత్యాగ్రహిగా ఆయనను తీసుకున్నారు. గాంధీజీ ప్రియశిష్యుడుగా ఆయన పేరు దేశం అంతటా ప్రచారం అయింది. ఆయన గాంధీజీ ప్రియ శిష్యుడనీ, గాంధీజీ బోధిస్తూన్న ఆదర్శాలను, సిద్ధాంతాలను నిశ్శబ్దంగా, నిస్స్వార్థంగా ప్రచారం చేస్తూ ఆచరణలో పెడుతున్న ఉత్తముడనీ ప్రజలు ఆయనను అప్పుడు గుర్తించారు.

ఇది జరిగిన మరో పదేళ్ళకు ఆయన పేరు బాగా వెల్లడి అయింది. 1951 లో ఆయన భూదానోద్యమాన్ని ప్రారంభించేరు. స్వతంత్ర భారతదేశం ప్రధానంగా పరిష్కరించవలసిన భూసమస్యకు గాంధీ సిద్ధాంతాలను భూదానోద్యమం సమన్వయం పరుస్తుందని ఆయనను అభినందిస్తున్నారు. భూస్వాముల భూములను లాగుకొని, రైతులకు పంచడం అనేది చాలా బాధకరమైన పద్ధతియనీ, భూదాన విధానం ఆ పద్ధతికి

ప్రత్యామ్నాయమనీ వినోబాజీ చెప్తున్నారు. కాంగ్రెసు ప్రభుత్వాలు తలపెట్టినట్లు చట్టాలుచేసి భూస్వాముల్ని భూములనుంచి తోలేసి వాటిని రైతులకు పంచిపెట్టినా, తెలంగాణాలో కమ్యూనిస్టులు చేయతలపెట్టినట్లు ప్రజా పోరాటాలద్వారా ఆ పని చేసినా బాధే కలుగుతుందంటారు వినోబాజీ. గాంధీజీ విషయంలో జరిగినట్లే ఆయన విషయంలో కూడ జరుగుతూంది. ఆయనకన్న మేధావంతులు, ప్రత్యేక వ్యక్తిత్వంగలవారూ డజన్లకొద్దీ రోజూ ఆయనవద్ద చేరి, భూ సమస్య మొదలయిన ప్రజాసమస్యలను పరిష్కరించగల సామర్థ్యం జనశక్తికే వున్నదని ఆయన వివరిస్తూంటే శ్రద్ధగా వింటున్నారు. మంత్రులు ఆచార్యులు, ఇతర సమర్థులు ఆయన వుద్యమాన్ని అభినందిస్తున్నారు ఆయన వుద్యమం విజయం పొందితే దౌర్జన్యరహిత విధానంలో వర్గరహిత, వర్ణరహిత సమాజస్థాపనకు తామందరూ చేస్తున్న కృషి కూడా సఫలం అవుతుందని చెప్తున్నారు.

వినోబాను గాంధీగారి నిజమైన శిష్యుడుగా ఒప్పుకోవడం మినహా మిగతా ఏ విషయంలోనూ ఈనాటి గాంధీ వాదులు ఏకాభిప్రాయం తెలుపలేకున్నారు. ఉదాహరణకు ఈనాటి ప్రపంచ సమస్యలయెడ వారి దృక్పథాన్ని చూడ వచ్చును. గాంధీవాదులలో విభిన్న అభిప్రాయాలు గలవారున్నారు. 'కమ్యూనిస్టు హంగుదారులు', రహస్య కమ్యూనిస్టులు అనబడే వారినుంచి ప్రపంచ ప్రసిద్ధులైన కమ్యూనిస్టు వ్యతిరేకులు, 'కమ్యూనిస్టుప్రమాదం గురించి' చెప్పే వాదనలన్నింటినీ చాటుగానైనా వల్లించేవారి వరకూ

మనకు కనబడతారు. దేశీయ రాజకీయాలూ ఆర్థిక విషయా లలో కూడ విభిన్న రాజకీయపార్టీల సభ్యులూ, నాయకులూ అయిన గాంధీవాదులు విభిన్న ఆలోచనాధోరణులను కనబరుస్తున్నారు. గాంధీజీ బ్రతికివున్నప్పుడు ఆయన నడిపిన సామ్రాజ్య వ్యతిరేకోద్యమాన్ని ప్రతిఘటించినవారే కొందరు నేడు గాంధీజీ శిష్యులమని చెప్పుకొంటున్నారు. గాంధీజీ పూర్వశిష్యుల్ని వారు "గాంధీ సిద్ధాంతాలను పాటిం చడం లేదని" నిందిస్తున్నారు కూడా.

ఇక్కడొక ప్రశ్న వస్తుంది. గాంధీ సిద్ధాంతాల్లో యీ తికమక అంతా ఎందుకొచ్చింది ? గాంధీజీ అనుచరులు తమలో తాము ఎందుకు దెబ్బలాడుకుంటున్నారు ? చరిత్ర పునరావృత్తమవుతూందా ? ప్రవక్తల జీవితకాలంలో వారి శిష్యులంతా ఐక్యంగానే ఉంటారు; కాని ఆయన మరణానం తరం దెబ్బలాడుకుంటారు. ఇదీ అంతేనా ? అయితే వినోబా భావేను మహాత్ముని వారసుడనీ నిజమైన అనుచరుడనీ ఏక గ్రీవంగా ఎందుకు చెప్పగల్గుతున్నారు ? ఈనాటి సమస్యలతో మహాత్ముని ఉపదేశాలను సరి అయిన విధంగా సమన్వయిం చడం ఎల్లాగనే విషయంమీద ఆయన శిష్యులంతా దెబ్బ లాడుకుంటూంటే సామ్రాజ్య వ్యతిరేక పోరాటకాలంలో ఆయనను వ్యతిరేకించినవారంతా ఈవేళ తామాయన అను చరులమని చెప్పుకుంటున్నారేమిటి ?

ఈ ప్రశ్నలకు సమాధానం రావాలంటే, గాంధీవాదం లోని ప్రధాన విషయాన్ని అర్థం చేసుకోవాలి. నైతిక సూత్రాలైన సత్యాన్ని, అహింసను సమకాలీన సమాజ

సమస్యలకు వర్తింపచేయడమే గాంధీవాదంలోని ప్రధాన సూత్రమని అంతా చెప్తూంటారు. ఇది సరి అయిన సమాధానమే కావచ్చు. అయితే వెంటనే మరో ప్రశ్న వస్తుంది. పరిశుద్ధ సత్యము, పరిశుద్ధనీతి అంటూ ఏమయినా ఉన్నాయా? వీనిని ప్రస్తుత జీవిత సమస్యలకు వర్తింపచేయడంలో ఏకైక మార్గం అంటూ ఉన్నదా? ఉదాహరణకు మొట్టమొదటి ప్రపంచయుద్ధంలో తాను పాల్గొనడం మహాపాపమని గాంధీజీ ఎందుకు భావించలేదు? పైగా బ్రిటిష్‌వాళ్ళకోసం సైనికులను సమకూర్చేటందుకై గుజరాతు రాష్ట్రంలో పర్యటించి వాళ్ల తరఫున పనిచేసేడు. కాని, రెండో ప్రపంచ యుద్ధకాలంలో యుద్ధానికి సన్నిహితంగా ఉండడం మహాపాపమని ఆయన భావించేరు. మొదటి ప్రపంచయుద్ధంలో నీతివంతమయినపని రెండో ప్రపంచ యుద్ధంలో అవినీతి ఎందుకయింది? 1921 లో ప్రభుత్వాన్ని "సైతాన్ ప్రభుత్వం" అని నిందించి, శాసన సభలను బహిష్కరించాలన్న గాంధీజీయే, తర్వాత శాసన సభలలో స్వరాజ్యవాదులు పనిచెయ్యడానికి అనుమతించవలసిందని నోఛేంజర్లకు తానే నచ్చచెప్పడం ఎందుకు జరిగింది? చౌరీచౌరాలో ప్రజలు దౌర్జన్యం చేసేరని శాసన ధిక్కారాన్నీ యితర ప్రజాపోరాట రూపాలనూ ఉపసంహరించుకున్న గాంధీజీ, ప్రజలను కాల్చిచంపబూనుకున్న రాష్ట్రి కాంగ్రెస్ ప్రభుత్వాలను బలపరచడానికి ఏ మాత్రం వెనుదీయలేదెందుచేత? ఈ పరస్పర విరుద్ధ విధానాలలో పరిశుద్ధములైన నీతి, సత్యం అహింస అనేవి ఏవైనా ఉన్నాయా?

ఈ పుస్తకం వెనుకటి పుటలలో అనేక సందర్భాలలో ఈ ప్రశ్నలే కనిపిస్తాయి. కథ ముగింపుకొచ్చేం కనుక చర్చను ముగించడం అవసరమౌతుంది. ప్రపంచంలో అందరిలాగే గాంధీజీకి కూడా సత్యం, అహింస, నీతి అనేవి సాపేక్షకాలే కాని సంపూర్ణశుద్ధాలు కావు. బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని శాంతియుతమైన అహింసా పద్ధతులతో అంతరింపచెయ్యటం నీతి, సత్యము అని ఆయన అభిప్రాయం. ప్రత్యేకమైన ఒక విధానం ఆ పనిలో తోడ్పడుతుందా తోడ్పడదా అనేదే ఆయన గీటురాయిగా భావించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి భారతీయ సైనికులను సమకూర్చటం మొదటి ప్రపంచ యుద్ధంలో "నీతి." భారతీయ సైనికులు బ్రిటిష్ సామ్రాజ్య రక్షణలో ఆత్మత్యాగం చెయ్యటంవలన ఆ సామ్రాజ్యంలో స్వపరిపాలనకోసం పోరాడుతూన్న తనబోటిగాళ్ళకు బలం కలుగుతుంది. కాని, యుద్ధప్రయత్నాలను వ్యతిరేకిస్తామనే బెదరింపు స్వాతంత్ర్య పోరాటాన్ని బలపరుచగలుగుతుంది. కనుక నూతన పరిస్థితులలో రెండవ ప్రపంచ యుద్ధానికి తోడ్పడటం "అవినీతి." తాను దూరంగా ఉంటూనే ఉద్యమం యొక్క కొన్ని దశలలో బ్రిటిష్‌వారితో రాయబారాలు నడవడానికి కాంగ్రెస్‌కు అనుమతి యిచ్చారు. యుద్ధంలో పాల్గొనడం అనేది ఆ రాయబారాలకు ప్రధాన విషయం. తాను దూరంగా ఉండటం అనేది కూడ ఒక ఎత్తుగడే. అవసరమయితే, పరిస్థితులు తప్పివస్తే బ్రిటిష్‌వాళ్ళమీద పోరాటం నడిపించడానికి వీలుగానే ఆయన దూరంగా ఉండి పోయేరు. "సైతాన్ ప్రభుత్వం" దానికి సంబంధించిన శాసన

సభలు మొదలైనవానిపై ఆయన చూపిన దృక్పథం కూడ యిటువంటిదే. 1921 లో ప్రభుత్వ శాఖలన్నింటినీ ప్రజలు బహిష్కరించాలని గాంధీజీ చెప్పారు. తరువాత వైస్రాయి తోనూ, యితర ఉన్నతోద్యోగులతోనూ రాయబారాలు నడపడంలో తాను అసమర్థుణ్ణి కానని నిరూపించుకున్నారు.

అందుచేత పరిశుద్ధ సత్యానికి, పరిశుద్ధ నీతికి గాంధీజీ కట్టుబడియున్నారని చెప్పటంలో అర్థంలేదు. అల్లాగే గాంధీజీ అనుచరులూ, సహచరులూ ఆయన చెప్పినదానికీ చేసినదానికీ ఖచ్చితంగా కట్టుబడియున్నారనడం కూడ అర్థంలేనిదే. ఆయన అనుచరులలోను సహచరులలోను చాలమంది చాటున "గాంధీగారి పిచ్చి"ని గురించి వేళాకోళం చెయ్యడం జరుగు తూంబుంది. అహింస అనేది మత సిద్ధాంతమా రాజకీయ విధానమా అనే చర్చ అందరికీ తెలుసును. గాంధీజీ తన కది మత సిద్ధాంతమన్నారు. ఆయన శిష్యులు చాలమంది తమ కది రాజకీయ విధానమన్నారు. గాంధీవాదంయొక్క ప్రధాన సూత్రాలమీద ఆయనకూ ఆయన శిష్యులకూగల విశ్వాసంలో ఎంత వ్యత్యాసం ఉందో మనకిక్కడ కనిపి స్తుంది. ఆయన జీవిత కాలంలో సామ్రాజ్య వ్యతిరేక పోరాటాన్ని నడిపిస్తూన్న బూర్జువావర్గంయొక్క పోరాటావస రాలకు అనుగుణంగా సత్యం, అహింస, నీతి మొదలైనవాటిని వర్తింప చెయ్యగలగడం చేతనే గాంధీజీ వారందర్నీ ఐక్యపరచ గలిగేరు. కష్టజీవులైన ప్రజానీకాన్ని ఉత్సాహపరచడంలోను, వారిని బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా ఐక్యపరచడంలోనూ, ఆ ప్రజల పోరాటాలను బూర్జువా వర్గానికి క్షేమకరమైన

పరిధుల్లో పట్టియుంచటంలోనూ ఆయనకున్న నేర్పును బూర్జువావర్గం గుర్తించింది. సామ్రాజ్య వ్యతిరేక పోరాటం పోటుపాటులలో గాంధీజీ ప్రజల ఉత్సాహాన్ని కనిపెట్టి చూస్తూండేవారు. మరోమూల బ్రిటిష్‌వాళ్ళతో సంబంధం పెట్టుకుని యుండేవారు. ఈ యిద్దరితోగల సంబంధాన్ని ఉపయోగించుకుని ప్రజలలో సామ్రాజ్య వ్యతిరేకాభిప్రాయాలను సజీవంగా ఉంచేవారు. రెండో వేపున ప్రజానీకం తన సత్తాను గుర్తించినట్లయితే పెట్టుబడిదారీవర్గ ప్రయోజనాలు ఎక్కడ పోతాయోనని భయపడేవారు; అవి అంతరించిపోకుండా చాల జాగ్రత్తపడేవారు. సత్యం, అహింస, నీతి అనే సూత్రాలను వర్తింపచెయ్యడంలో గాంధీజీ యీ విధమైన ఒక ప్రత్యేకపద్ధతిని అనుసరించడంవల్లనే బూర్జువావర్గ ప్రతినిధులు ఆయనను తమ నాయకునిగా గుర్తించారు. ఆయన సిద్ధాంతాల విషయమై వారికి భేదాభిప్రాయం ఉంటే అది వేరుమాట.

1947 ఆగస్టులో పరిస్థితులు మూలమట్టంగా మారినాయి. అందుచేత దేశ సమస్యలకు ఆయన సిద్ధాంతాలను వర్తింపచెయ్యడం ఇక అనవసరమైంది. అందుచేతనే ఆయనకూ ఆయన శిష్యులకూ మధ్య పెద్ద అగాధం ఏర్పడింది. రాజ్యాధికారం తమచేతిలోకివచ్చింది కనుక ప్రజాఉద్యమాల అవసరం యికలేదని ఆయన శిష్యుల అభిప్రాయం. పైగా అవి తమ పనులకు అడ్డం వస్తాయనికూడా అభిప్రాయపడ్డారు. సాంఘిక ఆర్థిక వ్యవస్థలలో కావలసిన సంస్కరణలను రాజ్యాధికారం ద్వారానే తీసుకురావచ్చునని వారి అభిప్రాయం. కాని గాంధీజీకి ఆ ఆశ లేదు. అధికారం స్వాధీనం చెయ్య

డానికి ముందూ తరువాత వచ్చిన నూతన పరిణామాలు ఆయన కెంతో దుఃఖం, బాధ కలిగించేయని వెనుకటి ప్రకరణంలో వివరించేను. నూతన పరిస్థితులకు సరిపడేటట్లు తన సిద్ధాంతాలను పునరుద్బోధించాలని ఆయనఅనుకున్నారు. ఆ ఆలోచనతోనే స్వతంత్ర భారతదేశంలో ఏమేమి జరగాలో సూచిస్తూ ఆయన కొన్ని విషయాలను ప్రతిపాదించేరు. కాంగ్రెసు రాజకీయాలతో సంబంధంలేని సంస్థగా - లోక్ సహాయక సంఘంగా - కేవలం ప్రజాసేవకోసమే పనిచేస్తూ ఉండాలన్నారు. కాని కాంగ్రెస్ నాయకులు యీ అభిప్రాయాన్ని నిరాకరించేరు. కొన్ని దశాబ్దాలపాటు రాజకీయాధికారం సంపాదించడంకోసం పోరాడిన కాంగ్రెస్ దేశక్షేమం కోసం కొత్తగా సంపాదించిన ఆ రాజ్యాధికారాన్ని ఉపయోగించుకోకుండా వదలుకోవాలనడం అపహాస్యంగా కనిపించింది. అందుచేత 1947 ఆగస్టు 15న తమ చేతుల్లోకి వచ్చిన రాజ్యాంగయంత్రాన్ని ఉపయోగించుకొని తమకు నచ్చిన విధంగా భారతదేశాన్ని పునర్నిర్మించేటందుకై వారు పూనుకున్నారు.

అయితే ఆయన సన్నిహిత శిష్యులు, అనుచరులు కొద్దిమంది గాంధీజీ అభిప్రాయాన్ని తీసుకుని సర్వసేవాసంఘం పేరుతో పనిచెయ్య పూనుకున్నారు. నూతన రాజకీయ వ్యవస్థలో ఏ విధమైన అధికారపదవికీ ఆశించబోమని వారు ప్రతిజ్ఞచేసేరు. మంత్రిపదవులు, పార్లమెంటు సభ్యత్వాలు శాసనసభా సభ్యత్వాలు వారి కొప్పవు. గాంధీజీ తన జీవిత కాలంలో సూత్రీకరించిన నిర్మాణ కార్యక్రమంద్వారా

ప్రజాసేవకే వారు తమ కాలం వినియోగిస్తారు. అయితే నూతన పరిస్థితులలో ఆ నిర్మాణ కార్యక్రమాలకు కూడ కొద్దిమార్పులు వచ్చేయి: ఖద్దరు ప్రచారం, గ్రామ పరిశ్రమలు, బేసిక్ విద్యావిధానం మొదలైనవి. మరొకలా చెప్పాలంటే, స్వాతంత్ర్య సాధనానంతరం కాంగ్రెస్ ఏ విధంగా పనిచెయ్యాలని గాంధీజీ చెప్పారో ఆ విధంగావారు సర్వసేవా సంఘాన్ని నడుపుతున్నారు.

ఆచార్య వినోబాభావే నాయకత్వాన సర్వోదయ కార్యకర్తలు సాగిస్తున్న ఈ కార్యక్రమం నుంచి ఒక కొత్త ఉద్యమం-భూదానోద్యమం- జన్మించింది. ఏ పరిస్థితులలో ఈ వుద్యమం పుట్టిందో అందరికీ తెలుసు; తెలంగాణా రైతాంగం మొదట నిజాం ప్రభుత్వం మీద తిరుగబడింది. నిజాం వ్యతిరేక పోరాటంలో వారు భూస్వాముల పెత్తనాన్ని అంతమొందించి భూమిని పంచుకున్నారు. నిజాం అనంతరం గద్దెకు వచ్చిన కాంగ్రెసుతో కూడ వారు తలపడవలసి వచ్చింది. భూస్వాముల నుంచి తీసుకున్న భూమిని రక్షించుకుంటూన్న రైతులకూ, రైతు విప్లవాన్ని అణచేందుకై పంపబడిన పోలీసులకూ మధ్య తీవ్రమైన ఘర్షణలు జరిగేయి అనేకమందిని తుపాకులతో కాల్చివేశారు. వందలసంఖ్యలో అరెస్టుచేసి జైలులో పెట్టేరు. ఇంకా ఎన్నో విధాల భయోత్పాతం కలిగించేరు.

ఈ పరిణామాలను చూసేక వినోబాభావే ప్రజల బాధలను తొలగించడం ఎలాగాయని ఆలోచించసాగేరు. సరిగ్గా గాంధీ విధానానికి అనుకూలమైన పరిష్కార మార్గమే

ఆయనకు దొరికింది. కమ్యూనిస్టుల నాయకత్వాన రైతులు విప్లవకరమైన పద్ధతిలో భూములను స్వాధీనం చేసుకోవడాన్ని ఆయన నిరాకరించేరు. కాంగ్రెసు ప్రభుత్వాలు తలపెట్టినట్లు చట్టాలద్వారా వ్యవసాయ సంస్కరణలు తీసుకురావడాన్ని కూడా ఆయన నిరాకరించేరు. (ఈ రెండింటిలోనూ ఏదో ఒక రూపమైన దౌర్జన్యంద్వారా సమాజంలోని సమస్యలను పరిష్కరించే స్వభావం కనబడుతుంది. మొదటిదానిలో ప్రజలే కార్యరంగంలోకి వస్తారు. ఆ విధంగా దౌర్జన్య విధానం అందులో ప్రత్యక్షంగా వుంటుంది. రెండోదాంట్లో రాజ్యాంగ యంత్రాన్ని వుపయోగించడం జరుగుతుంది. రాజ్యాంగ యంత్రం అంటే అల్పసంఖ్యాకులమీద అధికసంఖ్యాకులు ఒక క్రమపద్ధతిలో దౌర్జన్యం సాగించడమేనాయె). ఈ రెండింటికి బదులు భూమిగలవారు ఐచ్ఛికంగా భూమిని ఇచ్చివేసే పద్ధతిని ఆయన ప్రతిపాదించేరు. "భూమిగల స్త్రీ పురుషులు ప్రతి ఒక్కరూ తమకున్నదాంట్లో ఆరోవంతు భూమిలేనివారికివ్వాలి" – అనేది ఆయన నినాదం. విప్లవందార్వా రైతులు భూమిని స్వాధీనం చేసుకొనేపద్ధతికీ, అధిక సంఖ్యాకుల ఇష్టానుసారం అల్పసంఖ్యాకులు ప్రవర్తించేటట్లు చేసే రాజ్యాంగ చట్టపద్ధతికీ ఇది ప్రత్యామ్నాయమైన పద్ధతి. భూసమస్యా పరిష్కారానికై 'రాజశక్తి' స్థానే 'జనశక్తి' నుపయోగించాలనేది భూదానోద్యమానికి కీలకం.

ఈ భూదానోద్యమం అనేక దశలు గడచి గ్రామదానోద్యమంగా పరిణతి చెందింది. భూదానదశలో చెప్పినట్లు ఆరోవంతు భూమి నివ్వడంతోనే వినోబాజీకి తృప్తికలగలేదు. ప్రతి

ఒక్కరూ తమ ఆస్తినంతనూ ఇచ్చెయ్యాలన్నారు. వ్యక్తిగత ఆస్తిని రద్దుపరచాలి (భూమిమీద ఆస్తి హక్కును రద్దుపరచడంతో ఇది ప్రారంభమవుతుంది). గ్రామంలోని యావత్తు భూమినీ గ్రామం యొక్క ఉమ్మడి ఆస్తిగా సమీకరించాలి. గ్రామ భూములను ఉమ్మడిగా చేసుకోవాలి. పంటనంతా సమానంగా పంచుకోవాలి. గ్రామ ప్రజల ఉమ్మడి ప్రయోజనాల కోసం గ్రామ పరిశ్రమలను, ఇతర జీవనోపాధులను ఏర్పాటు చేయాలి - గ్రామదానం గురించి మాట్లాడే టప్పుడు వినోబాజీ మనోనేత్రం ముందు మెదలే చిత్రం యిది.

సామ్రాజ్య వ్యతిరేక పోరాటకాలపు పరిస్థితులకు గాంధీజీ వర్తింపజేసిన సూత్రాలనే స్వాతంత్ర్య సంపాదనానంతర పరిస్థితులకు వినోబాజీ వర్తింపజేసేరు. సోషలిస్టులూ, కమ్యూనిస్టులూ ప్రతిపాదించేటంత విప్లవకరమైన ఆదర్శాన్నే వినోబాజీ కూడ ప్రతిపాదించేరు. సోషలిజం యొక్క ఉన్నతదశ అయిన కమ్యూనిజానికి మార్క్సిస్టులు చెప్పే "శక్తికొలదీ పని, అవసరంకొద్దీ అనుభవం" అనే ఆశయాన్ని వినోబాజీ కూడ ప్రధానంగా చెప్పేరు. అయితే ఈ అశయం కార్మిక వర్గంయొక్క నాయకత్వాన శ్రమజీవులంతా చిరకాల రాజకీయ పోరాటం ద్వారా సాధించేదికాదు. అత్యధిక సంఖ్యాకులైన పీడిత తాడిత ప్రజాకోటిని పాలకవర్గంగా మార్చడం ద్వారా కూడ సాధించేదికాదు. కష్టజీవులయిన ప్రజాకోటి చేతులలో ప్రభుత్వాధికారం వుండి, దాని ద్వారా విభేదాలను నిర్మూలించడంవలన అది సాధించబడదు. సమాజంలోని ఉత్పాదకశక్తులు విపరీతంగా వృద్ధిపొందడంవలన, సమా

జంలో "శక్తికొద్దీపని, అవసరంకొద్దీ అనుభవం" వుండేదశ కార్యరూపంలో అమలుజరగడంవలన ఆ ఆశయం సాధించ బడదు. ప్రబోధం, హృదయపరివర్తనద్వారా అది సాధించ బడుతుంది. గాంధీవాదం యొక్క ఆధునికదశ అయిన గ్రామ దానోద్యమం సారమిది. మార్క్సిజానికీ దీనికీ తేడా ఇక్కడే వుంది.

మన దేశాన్ని ఎదుర్కొంటున్న సామాజిక సమస్య లకు సరియైన పరిష్కార మార్గాన్ని ఈ గ్రామదానోద్యమం ద్వారా కనుగొన్నామని భావేగారు, ఆయన అనుచరులు చెప్తున్నారు. అయితే కాంగ్రెసు నాయకులుగాని, కమ్యూ నిస్టుపార్టీ, ప్రజాసోషలిస్టుపార్టీ వంటి అతివాదపార్టీలుగాని ఆ మాటను అంగీకరించడంలేదు. భూమిమీద వ్యక్తి అధి కారం వుండడాన్ని వ్యతిరేకిస్తూనూ, గ్రామీణ జీవితాన్ని పునర్నిర్మించవలసివుందని చెప్తూనూ భావే చేసే ప్రచారం సాంఘిక ఆర్థిక సమస్యలలో వచ్చే మార్పులకు తోడ్పడు తుందేగాని, నిజంగా మార్పులు జరగాలంటే ప్రభుత్వ యంత్రాంగం ద్వారాగాని సాధ్యంకాదని వారు చెప్తున్నారు. భావేగారు, ఆయన గ్రామదానోద్యమం కొన్ని విజయా లను పొందినప్పటికీ భూమిమీద వ్యక్తిహక్కు వొదులు కొనేందుకు పెద్దభూస్వాము లెవ్వరూ ముందుకు రాలేదు. అందుచేతనే గ్రామదానోద్యమం గురించి చర్చించేటందుకు భావేగారు రాజకీయ పక్షాలవారందరినీ మైసూరులో సమా వేశపరచినప్పుడు వారు తమ కా వుద్యమంయెడల పూర్తి సాను భూతి వున్నదనీ, కాని భూసంస్కరణలు సహకారోద్యమం

మొదలగువాని ద్వారా ప్రభుత్వం పూనుకొంటేతప్ప కేవలం ఈ వుద్యమం ద్వారా పనిజరగదనీ స్పష్టంగా చెప్పేరు. సాంఘిక ఆర్థిక సమస్యల పరిష్కారానికై భావే ప్రారంభించిన ఐచ్ఛికోద్యమమూ ప్రభుత్వ కార్యక్రమమూ ఒకదాని కొకటి తోడ్పడగలవని అందరూ అంగీకరించేరు.

గాంధీజీ బ్రతికివున్న రోజులలో ఆయన ప్రియశిష్యులుగా వున్నవారిలో హెచ్చుమందికి దేశంలోవున్న సాంఘిక ఆర్థిక సమస్యలన్నింటినీ గ్రామదానోద్యమం పరిష్కరించగలదనే నమ్మకంలేదు. భావేకూ, ఆయన అనుచరులకూ దాని మీాద ఎంతో నమ్మకం వుంది. ఈనాడు జనశక్తిమీాదగాక రాజశక్తిమీాద విశ్వాసం ప్రకటిస్తున్నవారూ, గాంధీజీ జీవిత కాలంలో అనేక సందర్భాలలో అనేక సమస్యలమీాద భేదించిన వారూ ఒకటేనన్నది గమనించదగివుంది. శాసనసభలు, ఎన్నికలు, యుద్ధంలో పాల్గొనే విషయం, కాంగ్రెసును లోకసేవక సంస్థగా మార్చే విషయం మొదలయినవి ఎన్నయినా ఇక్కడ పేర్కొనవచ్చును. సత్యం, అహింస, నీతి మొదలయినవి రాజకీయాధికారాన్ని చేబట్టేటందుకు తోడ్పడ్డాయి. కనుకనే వానిని గురించి గాంధీజీ చెప్పిన మాటలకు వారు తలవూపేరు. ఈవేళ వారు అధికారాన్నీ, దానిని వుపయోగించే హక్కునూ వొదులుకొనేటందుకు సిద్ధంగాలేరు. రాజ్యాధికారం ఎవరిచేతిలోవుంది? దానినేవిధంగా వుపయోగిస్తారు? — అనేదానిమీాదనే సాంఘిక ఆర్థిక మార్పులకై జరిగే వుద్యమాల జయాపజయాలు ఆధారపడి వుంటాయని వారెరుగుదురు.

సాంఘిక ఆర్థిక పరిస్థితులను మార్చాలంటే, రాజకీయాధికారం చేతిలో వుండాలని కమ్యూనిస్టులు, సోషలిస్టులు, ఇతర అతివాదులు బాగా ఎరుగుదురు. ఏ వర్గమూ తన అధికారాన్ని ఐచ్ఛికంగా వదులుకోదని నూరేళ్ళ క్రితమే మార్క్సిజాన్ని ప్రవచించినవారు చెప్పేరు. ఆస్తినీ, అధికారాన్ని వదులుకోమని భావేగారో, మరొకరో బోధించినప్పుడు ఒకరూ అరా ఆ ఉదాత్త ప్రబోధాలను అందుకోవచ్చు. భూస్వాములు, పెట్టుబడిదారులు, ఇతర పీడకులు మాత్రం ఒక వర్గంగా ఐచ్ఛికంగా సాంఘిక మార్పులకు తల వొగ్గరు. అలా జరుగుతుందని కొందరు కలలుకన్నా, కార్యవాదులైన విప్లవకారులు మాత్రం కలలుమాని పోరాటాలనే నడుపుతారు. అల్లాంటివారు భావేగారినీ, ఆయన సహచరుల్నీ అభినందిస్తారు. గ్రామదానోద్యమపు ఆశయాల ప్రచారంలో యథాశక్తి తోడ్పడతారు. అంతేగాని రాజకీయాధికారం కోసం సాగించే పోరాటాన్ని మాత్రం నిలపరు.

— 'న్యూ ఏజ్' జనవరి 1958

# గాంధీవాదం: కమ్యూనిజం

## సుభాషచంద్ర సర్కార్

సర్వోదయం, కమ్యూనిజం గురించి 'న్యూఏజ్' పత్రికలో జరుగుతున్న చర్చలను జాగ్రత్తగా చదువుతున్నాను. రాజకీయాలను గురించీ, సిద్ధాంత విషయాలను గురించీ ఎవరి అభిప్రాయాలెలావున్నాసరే - నిష్పక్షపాతంగా, తెలుసుకుందామనే అభిప్రాయంతో ఇటువంటి చర్చలు సాగించడం అందరికీ వుపయోగకరం. ఏది ఏమయినా, విజ్ఞానం ఐక్యతను తీసుకొస్తుంది. ఒకరి నొకరు బాగా అర్థం చేసుకొనే కొలదీ ప్రత్యర్థులుకూడా పరస్పరం గౌరవించుకొంటారు. మనం మార్క్సుఉపదేశాలను అమలుజరపదలచుకొన్నప్పుడు ఆయన పద్ధతుల్ని అనుసరించాలి. మార్క్సు తనకు ముందున్న అర్థశాస్త్ర వేత్తల రచనల్నీ, భావాల్నీ బాగా అధ్యయనంచేసి అవగతం చేసుకొన్నాకనే ఆయన అర్థశాస్త్ర విమర్శ (Critique of Political Economy) వ్రాసేను. అలా చేయడం చేత ఆయన తన ముందు తరాలవారిలో వున్న మంచి విషయాలన్నింటినీ ఆకళింపుచేసుకోగలిగేరు; సర్ జేమ్సు స్టూవర్టు రచనలనుంచి చెప్పకుండా ఆడమ్ స్మిత్ అందలి విషయాన్ని

దొంగిలించేడు. ఆయనకు బూర్జువా అర్థశాస్త్ర చరిత్రకారులు అర్థశాస్త్ర చరిత్రలో సముచితస్థానాన్ని యివ్వలేదు. కాని, మార్క్సు ఆయననుంచి కూడా మంచి విషయాలను నేర్చుకొన్నారు.

డిసెంబరు సంచికలో వచ్చిన చర్చ పాక్షికంగా వుందని చెప్తున్నందుకు క్షమించండి. అందుచేతనే వానినుంచి నేర్చుకోగలది విశేషంగా లేకపోయింది; 'క్రాంతి' గారు చాల ఆవేశపరులు. స్థిరవ్రతదత్తుగారి వ్రాత అస్పష్టంగా వుంది. ఈ చర్చవిషయాలలో ఒక్క దానినైనా బరెన్ రే గారు చాల స్పష్టంగా వివరించేరు.

గాంధీజీ పేరు విడిచిపెట్టి సర్వోదయం గురించి చర్చించడంలో పెద్ద ప్రయోజనం వుండదు. ఆయనే మొదట ఈ మాటను ప్రచారంలోకి తెచ్చేరు. దానికొక సిద్ధాంతాన్ని సమకూర్చేరు. ఆయన రచనలు తిరగవేస్తే, ప్రస్తుతం వస్తున్న అనేక అనుమానాలు తొలగుతాయని నా అభిప్రాయం.

సర్వోదయం అంటే ఏమిటి? ఆమాటకి అర్థం సర్వజన సంక్షేమ సమాజం. ఆ సమాజంలో రాజ్యాంగయంత్రం వుండదు. వర్గాలుండవు. హింస వుండదు. సర్వుల సహకారంతో అది పనిచేస్తుంది. నే నెరిగినంతవరకు మార్క్సిస్టులకు ఈ ఆదర్శం విషయమై పేచీ వుంటుందనుకోను. అహింసాయుత మార్గాన్నే అనుసరించాలని గాంధీజీ పట్టుపట్టినా, కేవలం ఆ మార్గాన్నే అనుసరించడంలో వున్న సామాజిక పరిమితులను ఆయన ఎరగకపోలేదు. ఆకారణంచేతనే ప్రస్తుతం

వున్న దౌర్జన్యపర సమాజానికీ (ఈ సమాజంలో పెట్టుబడి దారులూ భూస్వాములూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో నిత్యమూ దౌర్జన్యం చేస్తున్నారని గాంధీజీ అభిప్రాయం), ఆదర్శంగా పెట్టుకున్న సర్వోదయ సమాజానికీ మధ్యకాలంలో ప్రధానంగా (పరిపూర్తిగా కాదు) అహింసా పద్ధతులలో నడిచే రాజ్యాంగయంత్రం కావాలన్నారు (మార్క్సు యొక్క శ్రామికవర్గ నియంతృత్వంతో పోల్చిచూడండి).

అలాగని గాంధీవాదమూ, కమ్యూనిజమూ ఒకటేనని కాదు. వాని మధ్య భేదాలున్నాయి. అవికూడా ముఖ్యమైన భేదాలే. కాని, వివరాలలో ఉన్న భేదాలను చూసి దృక్పథాల లోనూ, ఆదర్శంలోనూ వున్న ఏకత్వాన్ని విస్మరించకూడదు గాంధీవాదానికీ, కమ్యూనిజానికీ కూడ స్వత్వం అనేది లేక పోవడం, దోపిడీపద్ధతి లేకపోవడం, ప్రజలమధ్య ఐచ్ఛిక సహకారం వుండడం అనేవి ప్రధానం. కమ్యూనిస్టు సమాజంలో వ్యక్తుల పరిపాలనపోయి వ్యవహారాల సర్దుబాటు ఏర్పడుతుందని ఏంగిల్సు చేసిన ప్రకటనను ఈ సందర్భంలో జ్ఞాపకం చేసుకోవాలి. ప్రతిమనిషికి సమాజంలో తన స్థానం ఏమిటనే పరిజ్ఞానం చాల హెచ్చుగా వుంటేతప్ప ఈ ఉత్తమాదర్శాన్ని అందుకోడం సాధ్యంకాదు. మానవునిలో ఈ పరిజ్ఞానాన్ని కలిగించడమే మార్క్సిజమ్, గాంధీవాదం తలపెట్టినపని. ఆస్తులు పోగుచేసుకొనే స్వభావంగల కొద్దిమంది దౌర్జన్యాలకు అధికసంఖ్యాకులు గురిఅవుతున్న ఈ నాటి అసమాన సమాజంలో యీ పని సాధ్యంకాదు.

పెట్టుబడిదారులూ, భూస్వాములూ సమాజంలో తమ స్థానం ఏమిటో అర్థం చేసుకొని ప్రజల ఆస్తులకు ధర్మకర్తలుగా వ్యవహరించాలనీ, ఆ పనిని దౌర్జన్య రహితంగా చేయకపోతే దౌర్జన్యసహితంగా జరిగితీరుతుందనీ గాంధీజీ వారిని హెచ్చరించేరు (ఆస్తిని రద్దుపరచడం ప్రధానమైనదిగా గాంధీజీ భావిస్తారు). ఆయన అహింసా పరిధులలోనే వుండబోరు. గాంధీ వాదమూ, మార్క్సు వాదమూ కూడ తప్పనిసరి అయితేతప్ప దౌర్జన్యం కూడదంటాయి.

కొన్ని సుస్థిర భావాలతో ఉపదేశాలు చేయడంకన్న గాంధీవాదాన్ని, మార్క్సిజాన్నిగురించి ఇంకా బాగా అధ్యయనం చేయడం మంచిది; అవసరం.

— 'న్యూఏజ్' ఫిబ్రవరి 1958

# మార్క్సిజ మొక అనుశీలన విధానం

పి. టి. రావు

మానవ సమస్యలను ఎలా పరిష్కరించాలి? వాని ఆశయాలను ఎలా చేరుకోవాలి? అనే విషయంలో మహాపురుషుల అభిప్రాయాలు ఏ కాలంలోనూ భిన్నంగానే వుంటూ వచ్చేయి. అయినా మానవజాతియొక్క క్షేమాన్నిమాత్రం వారందరూ గాఢంగా కోరేరు. పరిశ్రమల నిర్మాణం విషయంలో, రాజ్యాంగ యంత్రంయొక్క పాత్రనుగురించి, రాజకీయ పార్టీల, కార్యక్రమాల ఉపయోగం గురించి, ఇతర ప్రధాన సమస్యలమీదా సర్వోదయానికీ, కమ్యూనిజానికీ చాల భేదంవుంది. అయినా మన దేశంలోని ప్రజలూ, సంస్థలూ ఆస్తిపరులయిన ఏ కొద్దిమంది క్షేమాన్ని కోరేగాక భారత ప్రజా సామాన్యంయొక్క క్షేమంకోరి పనిచెయ్యాలనే విషయంలో ఆ రెండూ ఏకాభిప్రాయాన్నే కలిగివున్నాయి. ఆచార్య వినోబాయే ఈ విషయం ఇలా చెప్పేరు :

"ఆదర్శ సమాజ వ్యవస్థయొక్క స్వరూప స్వభావాల విషయంలో మనకు భేదాభిప్రాయం లేదు."

[న్యూఏజ్, అక్టోబరు 1957]

ఈ ప్రధాన విషయాన్ని మన దేశీయులు అంతకంత కెక్కువగా గుర్తిస్తున్నారు. మన దేశంలో గాంధీజీ అనుయాయులకూ, మార్క్సు అనుయాయులకూ మధ్య చర్చలు సాగడానికి యిది అవసరము, ఫలప్రదమూ కూడ.

సిద్ధాంత విషయాలమీద ఉన్నతస్థాయిలో చర్చలు సాగించడానికి ముందు రెండు దృక్పథాలకూ చెందిన కొన్ని ప్రధానవిషయాలను స్పష్టంగా, సరిగ్గా అర్థంచేసుకోవడం అవసరం. మార్క్సిజం గురించి ఆచార్య వినోబాకు సానుభూతి గాఢమైన పరిజ్ఞానమూ వున్నా, ఆయన చేస్తున్న కొన్ని వ్యాఖ్యలు చూస్తే మార్క్సిజంలోని ప్రధానవిషయం ఆయనకు స్పష్టంకాలేదేమో ననిపిస్తుంది. అయితే మన దేశంలో మార్క్సిజాన్ని అనుసరిస్తున్న, అభిమానిస్తున్న వారిలో చాలమందికికూడ దానినిగురించి స్పష్టమైన పరిజ్ఞానం లేదు. అందుచేత మార్క్సిజం గురించి ప్రచలితమైవున్న కొన్ని దురభిప్రాయాలను ముందుగా తొలగించుకోడం అవసరం.

అన్నిటికన్నా ఎక్కువ ప్రచలితంగావున్న దురభిప్రాయం – మార్క్సిజమూ, దాని తాత్వికాభిప్రాయాల ననుసరించే రాజకీయపార్టీ (ఉదా : కమ్యూనిస్టుపార్టీ) ఒకటే ననుకోవడం. ఆచార్య వినోబాయే ఇల్లా అన్నారు :

"మారుతూవున్న దేశకాలపరిస్థితులనుబట్టి మార్క్సిజం కూడ తన పద్ధతులను మార్చుకోవలసి యుంటుంది..."

"మన దేశంలో మార్క్సిజం మరో వైఖరి నవలంబించి భారతదేశ సంస్కృతికి, సంప్రదాయానికి తగిన కొత్తమార్గం చేబడుతుందని నేను ఆశిస్తున్నాను..."

"మార్క్సిజం మన దేశ పరిస్థితుల కనుగుణంగా ఉంటేనే ప్రయోజనకరం. ప్రజల శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని పనిచేస్తేనే అది వర్ధిల్లుతుంది."

('న్యూఏజ్' అక్టోబరు 1957)

ఇక్కడ మార్క్సిజం అంటే భారత కమ్యూనిస్టుపార్టీ యేననేది వినోబాభావే అభిప్రాయంగా కనబడుతూంది. ఈ ఏకత్వభావన కమ్యూనిస్టుపార్టీకి గర్వకారణం అయితే కావచ్చు. కాని ఆ రెండూ ఒకటి కావనేది స్పష్టం.

మార్క్సిజంలోని మూల సత్యాన్ని మనం అర్థంచేసుకోవాలి. అది పట్టి ఎత్తుగడ కాదు; అదొక కార్యక్రమం కాదు; పార్టీ అంతకన్న కాదు. అదొక ప్రపంచ దృక్పథం; ప్రధానమైన సిద్ధాంత పర్యాలోచనం; మానవుణ్ణీ, ప్రకృతినీ పరిశీలించేటందు కొక విధానం. సంగ్రహంగా నిర్వచించాలంటే ప్రకృతిశాస్త్రాలనూ, సామాజిక విజ్ఞానాన్ని పరిశీలించేటందుకుపయోగించే శాస్త్రీయ అనుశీలన విధానమని దానిని పేర్కొవచ్చును. మార్క్సుగాని, ఏంగిల్సుగాని, మరొకరు గాని దానిని కనిపెట్టలేదు. పైకిమాత్రం తెచ్చేరు. సమాజాన్నీ, ప్రకృతినీ జాగ్రత్తగా పరిశీలించి అవి నడుస్తున్నక్రమాన్ని తేల్చేరు. ముఖ్యంగా మానవ సమాజాన్ని అర్థంచేసుకొనేటందుకూ, అదెల్లా పనిచేస్తూందో తెలుసుకొనేటందుకూ మార్క్సిస్టు అనుశీలన విధానం వుపయోగిస్తుంది. అందుచేతనే ఇతర 'వాదాల' (isms)కూ దీనికి పోలికలేదు. గాంధీ వాదం, పెట్టుబడిదారీ సిద్ధాంతం, ఫాసిజమ్ మొదలయిన

వానికీ దీనికీ తేడా అదే. సోషలిజం, కమ్యూనిజం, మార్క్సిజమ్ అనేవి కూడా ఒకటి కావు. ప్రపంచ పరిశీలనలో దానిని భావవాద తాత్విక విధానానికి ప్రతిస్పర్ధినిగా పోల్చిచూడవచ్చు.

ఈవిధంగా అర్థంచేసుకొన్నప్పుడు మార్క్సిజం అంటే విజ్ఞానార్జనకూ, సత్యాన్వేషణకూ, కార్యవిధానానికీ తోడ్పడే ఒక అనుశీలన విధానం అని తెలుస్తుంది. ఈ విధంగా దానిని నైతిక సమస్యలకు అనువర్తింపచేసి చూస్తే విజ్ఞానము, విశ్వాసము అనేవేమిటి, అవి ఎందుకు వచ్చేయనే పర్యాలోచన కలుగుతుంది. మార్క్సువాద దృక్పథంతో సర్వోదయమును పరిశీలిస్తే దాని మూలం ఏమిటో, స్వభావం ఏమిటో, దానిలో మంచి చెడు లక్షణాలు ఏమున్నాయో తెలుస్తుంది. భారత కమ్యూనిస్టుపార్టీకి గల మూలాన్ని, స్వభావాన్ని, దాని మంచిచెడ్డల్ని పరిశీలించే టందుకూ-డా మార్క్సిస్టు పద్ధతిని వుపయోగించవచ్చు.

"మార్క్సిజం అనేది ఆచరణకు సంబంధించిన పద్ధతి" అనేభావం పైన చెప్పిన పొరపాటు దృక్పథంలోనుంచి వచ్చినదే. భారతదేశాని కుపయోగించే విధంగా దాన్ని మార్చాలనీ, అది పాతబడిపోయిందనీ, పాతకాలపు దయిపోయిందనీ చెప్పేమాటలకు కూడా మూలం అదే. కాని నేను మొదట చెప్పినట్లు మార్క్సిజం అనేది ఒక సంపుటి (Formula) కాదు. అదొక అనుశీలన విధానం మాత్రమే. ఈ సంపుటి ఏ దేశానికైనాసరే పనికివస్తుందనో దేశాన్ని ప్రదేశాన్నిపట్టి ఈ సంపుటిని మార్చుకోవలసి వస్తుందనో

చెప్పడం కుదరదు. మార్క్సిజాన్ని విశ్వోపయోగకరమైన అనుశీలన విధానంగా, దృక్పథంగా మనం అర్థంచేసుకోవాలి. అయితే దానిని వర్తింపజేసి, వివేచన చేసినప్పుడు వచ్చే ఫలితాలు వివేచింపబడిన పదార్థాలెన్ని రకాలుగావున్నాయో అన్నివిధాలుగానూ వుంటాయి. విభిన్న పరిస్థితుల పరిశీలన ఫలితాలు విభిన్నంగా వుంటాయి.

భారతీయ, చైనీయ జాతీయోద్యమాలను మార్క్సిస్టు అనుశీలన విధానంతో పరిశీలించినప్పుడు రెండు దేశాలకూ రెండు భిన్నమైన కార్యక్రమాలు ఏర్పడ్డాయి. రష్యాలో సోషలిజం స్థాపనకై అనుసరింపబడిన మార్గమూ, భారత దేశంలో అనుసరించే మార్గమూ తప్పకుండా భిన్నంగా వుంటాయి. రష్యాలో మట్టుకు రష్యాలో ఎత్తుగడలూ, కార్యక్రమాలూ ప్రతి పదేళ్ళకూ మారుతూనే వున్నాయి. దీని అర్థం దేశానికీ దేశానికీ, ఏడాదికీ ఏడాదికీ మార్క్సిజం మారుతుందనికాదు. "ఒక్కొక్కచోట వున్న విభిన్న పరిస్థితులకు" దానిని వర్తింపచేయడంలో విభిన్న కార్యకారణ సంబంధాలు బయటపడతాయి. తత్ఫలితంగా ఎత్తుగడలూ, కార్యక్రమాలు మారుతాయి.

దీని అర్థం మళ్ళీ మార్క్సిజం 'శాశ్వతం' అనీ కాదు; మార్పు లేనిదనీ కాదు. పార్టీలు, వుద్యమాలు, కార్యక్రమాలు మొదలయినవి మారడంవలన గాక విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి పొంది మార్పుచెందేకొద్దీ అదీ అభివృద్ధి చెందుతుంది; మారుతుంది. ఉదాహరణకు గతకొద్దిశతాబ్దాలలో శాస్త్రీయ పద్ధతులు చాల మారేయి. ఆ మార్పు నూతన సమస్యల

వల్ల నూతన విజ్ఞానంవల్ల వచ్చిందేకాని, దానికి దేశ కాల పరిస్థితుల మార్పుతో సంబంధం లేదు. మార్క్సు రాజ్యాంగ యంత్రాన్ని (state) గురించి వ్రాసిన అంశాల్ని లెనిన్ పరిపుష్టంచేసేడు. రాజ్యాంగ యంత్రాన్నిగురించి మొదట వ్రాసినప్పుడు మార్క్సుకు తెలిసినదానికన్న అదనపు సమాచారం లెనిన్‌కి లభించింది కనుక ఆయన రాజ్యాంగయంత్రాన్ని గురించిన సిద్ధాంతాన్ని అభివృద్ధిచేసేడేగాని, రష్యాలోని పరిస్థితులకు సరిపడేలాగు మార్క్సిజాన్ని మార్చివుండ లేదు.

మనుష్యుడు తన సాంఘిక, ప్రాకృతిక పరిసరాలను అదుపులోకి తెచ్చుకోగలిగినకొద్దీ మార్క్సిజంకూడా వృద్ధి పొందుతుంది; మారుతుంది. దానిలో వచ్చే మార్పులన్నీ విశ్వజనీనాలుగానే వుంటాయి. ఆమార్పులు ఇండియాలో, రష్యాలో, చైనాలో, అమెరికాలో అన్నిచోట్లా ఒకేవిధంగా వర్తిస్తాయి. అందుచేతనే భారతకమ్యూనిస్టుపార్టీ, సోవియట్ అమెరికా ఈజిప్టు మొదలయిన దేశాల కమ్యూనిస్టు పార్టీలు అవలంబించే ఎత్తుగడలూ, కార్యక్రమాలు భిన్నంగా వున్నప్పటికీ ప్రపంచమంతటా మార్క్సిస్టులు తీసుకొనే తాత్త్విక దృక్పథమూ, సాంఘిక విధానక్రమమూ తప్పకుండా ఒక్కటే. ఇండియా, జపాన్, ఆఫ్రికా, అమెరికా మొదలయిన దేశాలలో భావవాదులు ఎక్కడున్నా వారి ఆలోచనలు ఒకే ధోరణిలో నడుస్తాయి. ఫలితాలు వేరుకావచ్చు. అల్లాగే ఇదీను.

మార్క్సిజం విశ్వజనీనం అన్నాం గనక అది ఇండియాకు సరిపడదనుకోకూడదు. అనేక శాస్త్రీయమైన అను శీలన విధానం గనక జాతీయ పరిధులకూ, ఆనువాయితీలకూ అది అతీతం. దానిద్వారా మనం సమాజ వ్యవస్థల, ఆచారాల, సాంస్కృతిక ధోరణుల ప్రజల పరిస్థితుల యొక్క స్వరూప స్వభావాలను బాగా అర్థంచేసుకో గలుగుతాం. అందుచేతనే దానిని వర్తింపచేసినప్పుడు ఏదేశ ప్రజల సాంస్కృతిక మహాత్వాన్ని అయినా బాగా, సరిగ్గా ఉపయోగించగలుగుతాం. దీనిని ప్రత్యక్షంగానే మనం చూస్తున్నాం. ఏదేశంలో వున్నాసరే మార్క్సిస్టులు ఆ దేశపు గత మహాత్వాన్ని కనుక్కోడానికీ, అర్థం చేసుకోడానికీ, కాపాడడానికీ ప్రయత్నించే వారిలో అగ్రగాములుగా వున్నారు. భారత దేశంలో ఇదివరకు కమ్యూనిస్టులు చాల కొద్దిమంది వుండేవారు. అయినా మన పూర్వసంస్కృతిలో మహత్తరమైన వానిని ముందుకు తెచ్చి రక్షించడంలోనూ, మానవతకు వ్యతిరేకమైన దుష్టభాగాలను నిరాకరించడంలోనూ వారు చూపినంత శ్రద్ధ మన దేశంలో మరెవ్వరూ చూపలేదు.

భారత కమ్యూనిస్టులు భాషారాష్ట్రాలకోసం, కాలేజీలలోనూ స్కూళ్ళలోనూ బోధనాభాషలుగా భారతీయ భాషల నుపయోగించడం కోసం గట్టిప్రచారం చేసేరు. ఇది అందరకూ తెలుసు. మన సంస్కృతిని కాపాడాలన్నా, విస్తరింపజేయాలన్నా ఇది అవశ్యాచరణీయం. ప్రపంచమంతటా మార్క్సిస్టులిదే చేసేరు. అమెరికాలో కమ్యూనిస్టులు జానపద సంగీత మహాత్వాన్ని కాపాడేటందుకై ఇతరులెవ్వరూ

చెయ్యనంత కృషిచేసేరు. అది ఏస్థితికి దారితీసిందం టే, జాన పద సంగీతంయెడల అభిమానం చూపడం కమ్యూనిస్టు విధా నాలయెడ విశ్వాసం చూపడంగా మెకార్థీ అనుచరులు భావించేరు. ఇంక చైనా, రష్యాలలో ప్రాచీన సాహిత్యాన్నీ, నాటకాలనూ ప్రజానీకంలో ప్రచారానికి తెచ్చేటందుకై ఆ ప్రభుత్వాలు అన్ని చర్యలూ తీసుకొన్నాయి. అటువంటి పని ఆదేశాల చరిత్రలోనే ప్రథమం.

అందుచేత మనం నిస్సందేహంగా ఒకటి చెప్పవచ్చు. మార్క్సిజం అనేది ఒక సంపుటీకరణంకాదు. ఒక పిడివాద సిద్ధాంతంకాదు. కార్యవిధానం అంతకన్నా కాదు. మార్క్సిస్టు సమాలోచనా విధానాన్ని నిర్దిష్టసమస్యలకు వర్తింపజేసి పరిశీలిస్తే సమాధానాలు దొరుకుతాయి. ఒక విషయం ఇక్కడ పరిశీలనకు తీసుకుందాం. దోపిడీ చేసేవాని హృదయ పరివర్తన వలన సామాజికమైన మార్పు తీసుకువచ్చేటందుకు అవకాశం వుంటుందా అనేది తీసుకొందాం. కమ్యూనిస్టులలో చాల మంది దోపిడీవర్గాలలోంచీ, గ్రూపులనుంచీ వచ్చినవారే. వారి హృదయాలు పూర్తిగా పరివర్తనం పొందేయి. కాని, వారే విప్లవకరమైన మార్పులను కలిగించడంలో హృదయ పరివర్తన ప్రయోజనకారి కాదని గట్టిగా చెప్తున్నారు.

జీవితం వేపుచూస్తే దోపిడీవర్గాలకు చెందినవారిలో చాలాకొద్దిమంది హృదయాలు మాత్రమే దోపిడీయొక్క మూలం విషయమై పరివర్తన పొందుతున్నాయి. ఇంతవరకు కమ్యూనిస్టులు, గాంధీవాదులు, మతబోధకులు మొదలయిన వారు వేదికలమీదినుంచి ఎంతో తీవ్రంగా ప్రబోధం జరిపేరు.

నైతిక ఉద్యమాలు నడిపేరు. కొద్ది హృదయాలేమన్నా మారేయేమో కాని, మారకుండావున్నవాళ్ళూ, వ్యతిరేక క్రమంలో మారినవాళ్ళూ వందలు, వేలసంఖ్యల్లో అలాగే వుండిపోయేరు. మనుష్యుడు సహజంగానే దుర్మార్గుడనాలా? మార్క్సిస్టులూ, సర్వోదయవాదులూ కూడ మనుష్యునిలో వుండే సహజమైన మంచితనాన్ని మెచ్చుకుంటారు. అయితే మరి చెయ్యవలసిందేమిటి? ఎప్పటికేనా మంచిఫలితాలురాక పోతాయా అని ప్రబోధం చేసుకుంటూ పోదామా? మనకు ముందు మహాత్ములెందరో శతాబ్దాల తరబడి ఆ పనేచేసేరు. అలాగాక మనుష్యుని హృదయాలలో చేరిన దుర్మార్గానికి మూలకారణాలను వెతుకుదామా?

ఈసమస్యకు మార్క్సిస్టులు తమ అనుశీలన విధానాన్ని చక్కగావర్తింపచేసేరు. సామాజిక దుష్టవ్యవస్థలకు మూలం మనుష్యుల హృదయాలలోవున్న దుర్మార్గంకాదనీ. సామాజిక దుష్టవ్యవస్థలే మనుష్యులను దుర్మార్గులను చేస్తాయనీ గ్రహించేరు. ఇతరులను దోచుకొనే దుష్టప్రవృత్తి మనుష్యుడిలో ఏర్పడిందంటే సమాజ వ్యవస్థ దానికి అవకాశం కలిగిస్తోందని అర్థం. ఆ అవకాశం వున్నంతవరకు వారు దానిని మానమన్నా మానరు. బానిస సమాజంలో ప్రాభవమంతా బానిస యజమానులది. వారిలో ఒకడు చచ్చిపోయినా, ఒకని హృదయం మారినా, వానిస్థానంలో పదిమంది పుడతారు. బానిస యజమానులందరి హృదయాలనూ మార్చగలమా? అందుచేతనే దోపిడీవలన లాభం పొందని వారి హృదయాలను మార్చగలుగుతున్నాం. వారికి బోధించవచ్చును. వారి

జీతాలను పెంచడానికి గాంధీజీకూడ చేయించలేకపోయేరు. తగుమాత్రపు లాభం వుండాలనేది ప్రతి ఒప్పందంలోనూ ప్రధానంగావుంది. "మహాత్ముని నీడలో జీవించే"నని చెప్పుకొనే వ్యక్తి ఈనాడు భారతదేశంలోకల్లా పెద్ద పెట్టుబడిదారు. ఇల్లా అన్నానని గాంధీజీని విమర్శిస్తున్నా ననుకోవద్దు. ఈ కాలంలో ఎవ్వరికీ లేనంత నైతికబలుకుబడి ఆయనకుంది. కుబేరోపాసకులముందు అదేం పనిచేయలేదు. అసలు విషయం ఏమంటే, అటువంటివారి హృదయాలు మారవు. ఏమంటే వారి ప్రయోజనాలు వారిని సరిగ్గా చూడనివ్వవు.

ఒక మంచి వుదాహరణ నిక్కడ ఇవ్వవచ్చు. 1900 సంవత్సరాలకు పూర్వం క్రీస్తు ఈభూమి బీదలదనీ, ఒక ధనికుడు స్వర్గద్వారంలో ప్రవేశించడంకన్న సూదిబెజ్జంలో ఒంటె దూరడం సులభమనీ అన్నాడు. యూరపు, అమెరికాలలోని పెట్టుబడిదారు లించుమించు అందరూ క్రైస్తవులే. బాగా ధనం ఆర్జిస్తే స్వర్గానికి వెళ్ళలేమేమోనన్న భయం వారిలో ఒక్కరికేనా లేదు. ఈ భూమి తనదనిపించుకొనేటందు కొక్కరయినా సర్వపరిత్యాగం చేయలేదు. ప్రజలు వారి సంపదలన్నీ స్వాధీనంచేసుకుని తద్వారా సాయంచేస్తే తప్ప వారికి స్వర్గద్వారకవాటాలు తెరుచుకోవు. అందుచేత అసంఖ్యాకంగావున్న ప్రజానీకం పెట్టుబడిదారులనుంచి, భూస్వాములనుంచి వారి ఫ్యాక్టరీలూ మిల్లులూ తీసేసుకొని, అందరిలాగే పనిచేసుకు బ్రతికేటట్లు చేయడం ఒక్కటే వారి హృదయాలలో పరివర్తన కలిగించే మార్గం. అలా జరిగినప్పుడే వారు సుఖజీవితం గడుపుకోగలరు. దోపిడి లేని నీతి

మయ జీవితం గడపగలరు. కాని, ఆ జ్యోతిని వారు చూడ గలగాలంటే వాళ్ళ కళ్ళమీదవున్న ఆ స్త్రిపొరను తొలగించు కోవాలి. లేదా తొలగించేటందుకు ప్రజలు తోడ్పడాలి.

—'న్యూఏజ్' ఫిబ్రవరి 1958.

# గాంధేయ భారతదేశం

## అమృత దేశాయి

కమ్యూనిజం గురించీ, సర్వోదయం గురించీ వినోబాజీ దృక్పథాన్ని ప్రచురించడం ద్వారా 'న్యూఏజ్' సంపాదకులు మంచిపనిచేసేరు. ఆయన చెప్పిన చాలవానితో మనం భేదించలేము. వినోబాభావే అభిప్రాయాల మంచిచెడ్డలపై నే నిప్పుడు చర్చకు దిగదలచుకోలేదు. కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తల దృష్టికి కొన్ని ముఖ్యమైన అంశాలను తేనడంకోసమే ఇది వ్రాస్తున్నా.

ఈనాడు మన దేశంలో కమ్యూనిస్టుపార్టీ మంచి శక్తివంతంగా వుంది. దాని పలుకుబడీ, ప్రతిష్ఠా దినదినం వర్ధమానమవుతున్నాయి. దానికి అనేక కారణాలు. అసంత త్యాగాలు చేస్తూ స్వార్థరహితంగా ప్రజాసేవ చేస్తూండడం వానిలో ముఖ్యంమైనది.

ఈ లక్షణాలు నిజంగా దాని కొక పెద్ద అండ. కాని ఇవి ఎంత మంచి లక్షణాలయినా అంతమాత్రంతో నే చాలదనీ, రాజకీయ నిర్మాణ రంగాలు మొదలయిన అన్నింటిలోను సరియైన పద్ధతులను కూడా అనుసరించడం అవసరమనీ మన కున్న అనుభవం తెలుపుతూంది.

కమ్యూనిస్టుపార్టీ అగ్రనాయకులు చాలమంది మన దేశాన్ని గాంధేయ భారతదేశం అనడం సరియైనదే. కాని, ఈ మాట అనడంలో వున్న సాధకబాధకాలను కమ్యూనిస్టు పార్టీ నాయకులు బాగా ఆలోచించినట్లు కనబడదు.

గాంధీజీ కొన్ని నూతన పోరాట రూపాలను సృష్టించేరు. సామాజిక నడవడికను ఏర్పాటుచేసేరు. అవిమన దేశానికి తగినవి. ఆ ప్రత్యేక పరిస్థితులలో అవి విజయం పొందేయి. గాంధీసిద్ధాంతాలనూ, ఆయన పద్ధతులనూ నేనిక్కడ పరిశీలించబోవడంలేదు. అయినా గాంధీగారి పద్ధతులలో చాల భాగం నేటి మన దేశ పరిస్థితులలో కూడా ఆచరణీయాలే. కమ్యూనిస్టు సూత్రాలను అమలులో పెట్టేటందుకై అటువంటి పద్ధతులను కమ్యూనిస్టులు అనుసరించాలి. దానిలో తప్పులేదు. సరియైన సిద్ధాంతాలను సముచితమైన పద్ధతులలో అమలు జరపడంలో తప్పేముంది? భావవాది అయిన హెగెల్ ప్రతిపాదించిన గతితార్కిక పద్ధతిని మార్క్సు తీసుకొన్నారు. మార్క్సిస్టు సిద్ధాంతాలకు పొత్తుకుదరని ధర్మకర్తృత్వ సిద్ధాంతంవంటిదానిని వదలి, మిగిలిన గాంధేయ పద్ధతులను మనం అనుసరించవచ్చు.

వినోబాజీ వానిని సర్వోదయమే అననీయండి; కాని అది భారతదేశ ప్రత్యేక పరిస్థితులకు అన్వయించే మార్క్సిజం అవుతుంది.

— 'న్యూఏజ్' ఫిబ్రవరి 1958

# సర్వోదయం మార్క్సిజానికి ప్రత్యామ్నాయం కాజాలదు

## జి. సుకుమారన్ నాయర్

భారతదేశానికి కమ్యూనిజం విజాతీయమన్నట్లు నేడు చాలమంది మేధావులు సర్వోదయంవేపు ఆకర్షితులయ్యారు. భారతదేశం చాల క్లిష్టపరిస్థితిలో వున్న ఈనాడు సర్వోదయం, కమ్యూనిజం గురించి చర్చజరపడం చాల సముచితం. నేను కమ్యూనిజాన్ని అంతనూ పరిశీలించి, అది భారతదేశానికి కూడా వర్తించే ప్రపంచ తాత్విక విధానమా కాదా అని తేల్చబోవడంలేదు. కాని సర్వోదయాన్నీ, కమ్యూనిజాన్నీ పోల్చవలసివచ్చినప్పుడు సర్వోదయం ఒక భ్రమవంటిదనీ, కమ్యూనిజం నిజమైనదనీ నా అభిప్రాయం. బ్రిటిష్ తత్వవేత్త ఎఫ్. హెచ్. బ్రాడ్లే ప్రతిపాదించిన తాత్విక దృష్టితో నేనీ మాట చెప్తున్నా.

జాతీయమైన తాత్వికవిధానాన్ని ప్రచారంలో పెట్టాలని ఆచార్య వినోబాభావే అభిప్రాయం. కాని కమ్యూనిజం ప్రపంచవ్యాప్తమై వుండగా, ఊహాజనితమైన సమాజ వ్యవస్థను మనసులో పెట్టుకుని తయారుచేసిన తాత్వికాలో

చనలకు విస్తృత ప్రచారం రావాలంటే అది అసంభవం. ఆచార్యులవారు చెప్పే దేమిటి ? "ఒక్కొక్కచోట పరిస్థితులు ఒక్కొక్క విధంగా వుంటాయి. వానినిపట్టి మార్క్సిజం మారుతూండాలి" – అనేది ఆయన మొదటి మాట. ఇది కేవలం పునరుక్తి. దీనిని గురించి ఆలోచించవలసిన పనే లేదు. ఏ తాత్విక సిద్ధాంతమూ కూడా తన మాటే శాశ్వతం, సంపూర్ణం అని చెప్పుకోదు. ప్రతిదానినీ చారిత్రక పరిస్థితుల కనుగుణంగా సవరించి అనువర్తింపయాలిసిందే.

మన భారతదేశపు అలవాట్ల ప్రకారమే ఆచార్యుల వారు ఆలోచిస్తూ ఉండివుంటారు. మన . అలవాట్ల ప్రకారం దర్శనములు పరిపూర్ణాలు, అపరిచ్ఛేద్యాలూను. తత్వదర్శ నాలలోని అర్ధరహితమైన డంబాలను నమ్మేరోజులు పోయేయి; ఈ నాడు తత్వదర్శనాలకు విస్పష్టమైన విజ్ఞానశాస్త్రాలు ఆధారం. విజ్ఞానశాస్త్రం సిద్ధాంతాలతో (Hypothesis) ప్రారంభించి నిర్ధారణలతో ముగుస్తుంది నిర్ధారణలు మరల సిద్ధాంతాలు అవుతూంటాయి. మార్క్సిజం తనది శాశ్వత మైన సమగ్ర సత్యం అని ఎప్పుడూ చెప్పుకోలేదు. వినీతమైన సిద్ధాంతస్థాయిలో పూర్వపక్షాలకు (Anti-thesis) ఎప్పుడూ అది సిద్ధంగానేవుంది. అవసరమైనప్పుడు నూతన సిద్ధాం తాన్ని రూపొందించుకోనేటందుకు చరిత్ర కెప్పుడూ అది అవకాశం కలిగిస్తూంది. రష్యా చైనాల అనుభవం వాని నుంచి నేర్చుకోనేటందుకు భారతీయులను ప్రోత్సహించడానికే గాని, ఏదో ఒకటి వెతికి సంతృప్తిపొందేటందుకు కాదు.

రెండోది: "సర్వోదయం జీవితాదర్శం" అని ఆచార్యులవారు అంటున్నారు. భారతదేశాని కింకా కొత్త జీవితాదర్శాలు అక్కర్లేదు. గతంలో బయలుదేరిన అసంఖ్యాక దర్శనాలు అద్భుతమైన జీవితాదర్శాలను చిత్రించేయి. శంకరాచార్యులవారి అద్వైతం సర్వోదయ జీవితాదర్శంకన్న తక్కువ జీవితాదర్శమని వినోబాజీ అభిప్రాయమా? ఉపనిషత్తులు, గీత, బ్రహ్మసూత్రాల సారం అని భావింపబడే అద్వైతాన్ని మించిన జీవితాదర్శాన్ని ఇంత వరకు ఎవ్వరూ చూపలేదు. ఆ మహామేరువులోని ఒక శకలమే ఈ సర్వోదయం; కాని మనం అద్వైతాన్ని కూడా మించిపోదలచేము. ఒక సామాజిక విప్లవాన్ని పారంభించి, రాజ్యాంగ యంత్రం సహాయంతో న్యాయమైన, సమన్వయ దృష్టిగల సామాజిక వ్యవస్థను నిర్మించదలచుకున్న తత్వశాస్త్రాన్ని మనం స్వీకరించదలచేము.

ఆచార్యులవారికి సామాజికదృష్టి లేదనాలి ఆ దృష్టి సర్వోదయ ఆదర్శంతో రాదు. సామాజిక దృష్టి అనేది బాధలకూ, దుర్మార్గాలకూ సమాజంలో వున్న మూల కారణం ఏమిటని మొట్టమొదట విచారిస్తుంది. ఇండియా దినదినం కృంగిపోతూంది. ఏమంటే బాధలకూ, దుర్మార్గాలకూ మూలం ఏమిటనీ, దానికి పరిష్కారం ఏమిటనీ ఆలోచించేటప్పుడు మన ప్రజానీకం యొక్క మనస్సులు ఎంత సేపూ తమ వూహాకల్పనలవేపే మొగ్గుతున్నాయి. వర్గాలుగా సమాజం విభజించబడడం, ఒక మనిషిని వేరొక మనిషి దోచుకొనేస్థితి వుండడమే ఈ బాధలకూ, దుర్మార్గాలకూ మూల

మని మార్క్సిజం ఖండితంగా చెప్తూంది. సృష్టి అంతా భగవదేచ్ఛకు ప్రతిబింబం అనీ, అందుచేత సమస్తమూ మంచిదేననీ, ఒక మూఢ విశ్వాసంమీద ఆధారపడి భారతీయ తత్వవేత్తలు వేల సంవత్సరాలుగా మోక్ష సాక్షాత్కారంకోసం ఉద్యమిస్తూ వచ్చారు. అది ఏ మాత్రం చాలదు.

సర్వోదయంలో వ్యక్తిగతమైన అహంభావాలు తప్ప మరేమి ఉన్నాయి? దానిలో తార్కిక పద్ధతి, కార్యకారణ విజ్ఞానం, జ్ఞాన సిద్ధాంతం అనేవి లేవు. అందుచేత "సర్వోదయానికి తాత్విక పునాది" అనేది లేదు. అది ఏవో కొన్ని నైతికసత్యాలు, తదితర తత్వవిధానాలనుంచి ఎరువుతీసుకొన్న సాంఘిక తత్వశాస్త్రం. మార్క్సిజానికి స్వతంత్రమైన కార్యకారణ విజ్ఞానంవుంది. జ్ఞాన సిద్ధాంతంవుంది. అది ప్రపంచం గురించి సరియైన, సహజమైన వివరణనిస్తూంది. దానికి సంబంధించిన నైతిక సూత్రాలనూ, సామాజిక తత్వ విధానాన్నీ శాస్త్రీయ సోషలిజం అంటారు. ఇటువంటి దశలో మార్క్సిజం ఏదో ఒక రోజున "సర్వోదయంలో సంలీనమవుతుంద"నే ఆచార్యులవారి మాటను ఏమనాలి?

రాజ్యాంగ యంత్రం డుల్లిపోవడం గురించీ, వర్గరహిత సమాజం ఏర్పడడంగురించీ చెప్పిన భవిష్య కథనం మార్క్సిజానికి మూలకందమని ఆచార్యులవారు భావించేరు. అవి మార్క్సిజంలోని ప్రధానాంశాలే. సందేహంలేదు. కాని, ఆగమ్యాన్ని చేరుకొనేటందుకు తోడ్పడే ఘటనా పరంపరను విస్మరించడం తర్కబద్ధమైన ఆలోచన అనిపించుకోదు. ఆయన

చెప్పే సత్యయుగం ఇక్కడ అసంబద్ధం. గట్టిగా పోరాటాలు జరిపి, దశలవారీగా సత్యయుగాన్ని సాధించవలసి వుంటుందనీ, దానికోసం శ్రామికవర్గ నియంతృత్వాన్ని నెలకొల్పవలసి వుంటుందనీ కమ్యూనిస్టులు చెప్తారు. కమ్యూనిస్టుల మొట్ట మొదటి ప్రధాన గమ్యం ఇదేనని నా అభిప్రాయం.

ఇక దౌర్జన్య పద్ధతుల విషయం. భౌతిక, ఆధ్యాత్మిక విలువలు రెండూ సమన్వయం పడే నాగరిక సమాజాన్ని సృష్టించదలచిన తమ తోడివారిని ఆటంకపరచడంలో మన పూర్వపురుషులు చూపినంత పట్టుదల ఆచార్యులవారికుంది. మన దేశ జీవితం బహుచురుకుగా గంభీరంగా ముందుకు సాగవలసి వుంది. అటువంటి స్థితిలో సోమరితనంగా, కేవలం ఊహా సౌధాలు నిర్మించుకొనే మధ్యయుగాలనాటి భారతీయ సమాజ వ్యవస్థను పునరుద్ధరించాలనీ ఆధునిక యుగంవేపు ప్రజలు పురోగమించకుండా వుండాలనీ సర్వోదయం కోరుతుంది. మన జీవితాలను పూర్తిగా ధ్వంసంచేసిన ప్రాచీన సాంఘిక ప్రత్యేకతలను నిర్మూలించేటందుకు కొన్ని పరిస్థితులలో దౌర్జన్యం అవసరమయితే సెను కాదకూడదు. జీవితానికీ, ప్రపంచానికీ సర్వోదయం అర్థంచెప్తుంది. కాని మార్క్సిజం వానిని మార్చ డానికి పూనుకొంది. కనుక భారతదేశ చరిత్రలో వ్రాయ బోయే అధ్యాయాన్ని మార్క్సిజం వెలుగులో మనం వ్రాయ బోతున్నాం. సర్వోదయం మార్క్సిజానికి ప్రత్యామ్నా యమూ కాజాలదు; కనీసం దానికి సహాయపడే సిద్ధాంతమూ కాదు.

— 'న్యూఏజ్' మార్చి 1958

# హృదయ పరివర్తన

## శ్రీనివాస్ మిశ్రా

'న్యూ ఏజ్' పత్రికలో సర్వోదయ, కమ్యూనిస్టు సిద్ధాంతాలను గురించి చర్చను ప్రోత్సహించటం చాలా బాగుంది. తాత్విక సమస్యలకు సంబంధించిన కొత్తకొత్త విషయాలపై ఇలాంటి చర్చలను ఇతోధికంగా సాగిస్తే ఇంకా బాగుంటుంది.

కమ్యూనిజం అనేది మార్క్సిజానికి మరొక పేరు; అది జగత్తును గురించిన ఒక సమ్యక్ దృష్టి. ప్రపంచమూ, అందలి సంఘటనలను గురించిన ఒక భావనావిధానం అది. ఈ దృక్పథానికి మూలాధార మయిన సిద్ధాంతం భౌతికవాదం. భౌతికవాదమం టే అర్థమిది: జగత్తు వాస్తవం; అన్నిటికీ మూలం పదార్థం; జగత్తులోని సమస్త వస్తువులు పదార్థమయం. జగత్తు, అందలిసంఘటనలు ఎరుకకం దేక, భావాలు, చింతన, పంచేంద్రియ వ్యాపారం, హృదయ వేదనలు వీటి కన్నిటికీ పదార్థ వ్యవస్థాపరిణామంలో అత్యున్నతదశకు చెందిన మెదడు కారణ భూతం. కాబట్టి ఇవి పదార్థం తరువాత వచ్చేవే. ఇవి బాహ్య జగత్తుకు జీవప్రతిబింబాలు. వీటి తప్పొప్పులు ఆచరణలో,

కర్మలో సాంఘిక జీవితానికి అనువర్తింపజేస్తే ఈ సిద్ధాంతం చెబుతున్నదిది: మానవ సమాజమూ, మానవులూ వారి భౌతికావసరాలూ మిధ్యకాదు; అర్థహీనమూ కాదు. కాబట్టి మానవుడు పరలోక దృష్టితో ఇహాన్ని పరిత్యజించడం తప్పు; పైపెచ్చు, సమాజాన్ని మార్చి తదంతర్గతమయిన చెడును కూకటివేళ్ళతో పెకలించివేయడానికి తోడ్పడ్డం అతని ధర్మం.

మార్క్సిజాన్ని సాంఘిక జీవితానికి అన్వయించి చూచి నప్పుడు ఇంకా తేలేదేమిటి? మానవసమాజమూ, అందలి సంఘటనలూ ఊహాతీతమయినవికావు. వాటిని మనం అధ్యయనం చేయవచ్చు; వాటిని విడమర్చి పరిశీలించవచ్చు; కార్యకారణ నిరూపణ చేయవచ్చు; ఇలాచేసి, నేడుకాక పోతే రేపైనా వీటి పూర్వాపరాలన్నీ తెలుసుకోవచ్చు. మార్క్సిజం "ఇది ఇంతే" అని చెప్పే వేదంలాంటిదికాదు. కృత్రిమ బాలచంద్రులు అంతరిక్షంలోనికి పంపబడుతున్న యుగంలో, మానవ శరీరంలోని దుష్టాంగంతీసివేసి దాని స్థానంలో కొత్త అవయవం అతికించుతున్న యుగంలో, చని పోయిన వారికి ప్రాణప్రతిష్ఠచేస్తున్న యుగంలో, సర్వోదయ వాదులు ప్రపంచమూ మానవసమాజమూ అభేద్యాలనే నమ్మకంతో కళ్లుమూసుకొని కూర్చునివుండలేరు. జనన మరణాదుల కతీతమైన, సర్వస్వానికి ఉపాధిభూతమైన మహాదర్శంకోసం వారు చేస్తున్న అన్వేషణలో సమాజాన్నీ, మానవులమధ్య సంబంధాలనూ తదేకదీక్షతో వారు పరి శోధించడానికి ప్రయత్నించడం మార్క్సిస్టులకు సంతోష దాయకమయిన విషయం. మానవ సమాజాన్ని పునర్ని

ర్శించే మార్గాలనుకూడ సూచించడానికి వారు పూనుకోవడం మార్క్సిస్టులకు ఉత్సాహం కలిగిస్తుంది.

సామాజిక జీవితానికి అనువర్తింప జేసినప్పుడు మార్క్సిజం ఇంకా నిర్వచిస్తున్నదేమిటి ? భావాలూ, ఆలోచనలూ, రాజకీయ వ్యవస్థలూ, న్యాయసంస్థలూ ఇవన్నీ ఆకాశం నుండి ఊడిపడినవికావు; మానవుని జీవితం నుండి, అతని ఆర్థిక పరిస్థితులనుండి ఉత్పన్నమయినవివి. దోపిడీపై ఆధారపడ్డ ఆర్థికవ్యవస్థగల సమాజంలో, దోపిడీదారులలో పీడించడం, మోసగించడం, బలహీనులను అణచివేయడం మొదలగు ధోరణులు పైకొనక మానవు. దోపిడీదారుల బిడ్డలకు కూడ ఈ దుర్గతి తప్పదు.

సమానావకాశాలుగల సంఘంలో, పసిపిల్లల హృదయాలు మానవత, సత్యసంధత, ఇత్యాది సద్గుణాలకు ఆలవాలమవుతాయి. ఈ విధంగా భావాలు, ఆలోచనలు, దృక్పథాలు హృదయ సంవేదనలు మంచివైనా, చెడ్డవైనా - మానవుని పరిసరాలయొక్క, అంటే, ఆర్థిక వ్యవస్థాది భౌతిక పరిస్థితులయొక్క జీవత్ప్రతిబింబాలు తప్ప వేరు కాదు. భౌతిక పరిస్థితులను మార్చామా, ఆర్థిక వ్యవస్థను మార్చామా నూతన మానవుడు నూతన భావాలతో అవతరిస్తాడు.

"కాని కమ్యూనిస్టునే తీసుకోండి. అతడు ఆర్థిక వ్యవస్థలో మార్పురాకమునుపే హృదయ పరివర్తన చెందిన విప్లవకారుడు కాదా ! ఇదెలాసాధ్యమయింది ?" అని సర్వోదయ వాది ప్రశ్నిస్తున్నాడు. దీనికి కమ్యూనిస్టు చెప్తున్న సమాధానమిది : పీడితులయినవారిలో మానవత, నమ్రత,

నిజాయితీ, సత్యసంధత, ప్రజాపీడకులపై ద్వేషం, తాము సంఘటితంకావాలనే ఆకాంక్ష, ప్రతిఘటించాలనే మనస్తత్వం వృద్ధి చెందుతాయి. వారి జీవన విధానంవల్లనే, వారి ఆర్థిక పరిస్థితులవల్లనే, పీడిత ప్రజల్లో విప్లవ లక్షణాలు వేరూనుతాయి. అయితే దోపిడీవర్గంనుండివచ్చే కమ్యూనిస్టుమాటేమిటి అని అడగవచ్చు. దోపిడీవర్గానికిచెందిన కమ్యూనిస్టుపై అతని చుట్టూగల పీడితవర్గాల జీవితవిధానంయొక్క ప్రభావమూ, సంఘ వైరుధ్యాల బలవత్తర ప్రభావమూ బాగా పడింది. కాని మరొక విశేషంకూడ ఉంది. భౌతిక పరిస్థితుల నుండి ఒకసారి ఉత్పన్నమయిన భావాలు, ఆ తరువాత మానవునిపై తమ ప్రభావాన్ని అపారంగా ప్రసరింపజేయగలవు. అయితే, భావాలొకవైపుకీ జీవితం మరోవైపుకీ లాగేవారిపై భావాల ప్రభావం శక్తివంతంగా ఉండదు; భావాలకూ భౌతిక పరిస్థితులకూ అనుకూల్యం ఉన్నవ్యక్తులపై భావాల ప్రభావంచాలహెచ్చుగా ఉంటుంది. సోషలిస్టుభావాలు దోపిడీదారుల మనస్సుల్లోకన్న పీడితప్రజల మనస్సుల్లో సులభంగాను దృఢంగాను పాదుకొనిపోవడానికి ఇదేకారణం. దోపిడివర్గంలో నూటికొకరు కోటికొకరు సోషలిస్టు భావాలచే ప్రాభావితులు కావచ్చు. అంతమాత్రాన కమ్యూనిస్టులు పీడిత ప్రజానీకాన్ని సంఘటితంచేసే కార్యం మానుకొని, క్రూరచిత్తులైన దోపిడీవర్గాల హృదయ పరివర్తనకోసం ప్రాధేయపడుతూ కూర్చోలేరు. కమ్యూనిజానికీ సర్వోదయ సిద్ధాంతానికీ ఉన్న తేడా ఇదే.

మరి, దోపిడీ వర్గాల హృదయ పరివర్తననుఉపలక్షించి కృషిచేస్తున్న ఉద్యమాన్ని కమ్యూనిస్టులు వ్యతిరేకించాలా ? అలా వ్యతిరేకించకూడదు. ఈనాడు సోషలిస్టు భావాలు, సాంఘిక న్యాయం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, ప్రజాతంత్రం అనే భావాలు సర్వత్రా వ్యాపించి వున్నాయి. సోషలిజం ఒక జగద్వ్యవస్థగా జయభేరి మ్రోగిస్తూవుంది; మనదేశ ప్రజలలోనే రోజురోజుకు ప్రస్తుత ఆర్థిక వ్యవస్థపైన, ఆ పునాదిమీద నిర్మింపబడ్డ రాజకీయ వ్యవస్థపైన అసహనం పెరిగిపోతూంది. ఇలాంటి పరిస్థితుల్లో భూదానం, ధనదానం, గ్రామదానం, పేదప్రజల పరిస్థితులను బాగుపరచాలనే ప్రచారం – ఇవి అణగారిన ప్రజల పక్షానికి బలం చేకూర్చుతాయి. పాలకవర్గంపైకూడ వాటిప్రభావం కొంతకుకొంతపడుతుంది. ఇలాంటి ప్రచారంవల్ల, పైన పేర్కొన్న పరిమిత ఫలితాలు ఎల్లప్పుడూ కలుగుతూనే వున్నాయి. ఐతే మార్క్సిజం భారత దేశానికి ఉపయోగపడాలంటే అందులోని భౌతికవాదాన్ని మార్చివేయాలా ? అక్కర లేదు. భారత దేశంలో సామాన్యమానవుడు పదార్థానికి ఉపాధి చిత్తే (spirit) అని నమ్ముతున్నాడు. అట్లని ఎవరూ పదార్థాన్ని ఉపేక్షించడంలేదు. సామాన్యుడు ఏదో ఒకవిధంగా తన దుర్భర జీవితాన్ని వెళ్ళబుచ్చడానికి తంటాలు పడుతూ వున్నాడు. శ్రీమంతుడు బీదల శ్రమ ఫలితాన్ని సాధ్యమయినంత స్వాహాచేయడంలో నిమగ్నుడై వున్నాడు. పాలకవర్గం, దేశ ఆర్థిక వ్యవస్థను తాను నిర్ణయించుకొన్న మార్గంలో తీర్చిదిద్దడంలో నిమగ్నమైవుంది. సర్వోదయ కార్యకర్త

వర్గరహితమయిన కొత్త సమాజాన్ని రూపొందించడంలో నిమగ్నులై వున్నాడు. అలాంటప్పుడు కమ్యూనిస్టులను జీవితంలోని మంచిని ద్వేషిస్తారంటూ ముద్ర వేయడ మెందుకు ? ప్రపంచంలో సమానత్వం, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం, న్యాయం మొదలగు భావాలకు ప్రాచుర్యం కలగాలనీ దుష్ట శిక్షణ జరగాలనీ, ప్రజాపీడకులకు వ్యతిరేకంగా జనత ఏకం కావాల నేది ఈశ్వరేచ్ఛ అనేది మత, సంఘ, సంస్కర్తల వాదం. సర్వం సహుడు సర్వాంతర్యామి అయిన దేవు డొక డున్నాడని కమ్యూనిస్టులు నమ్మరు. కాని, ఒక సమ్యక్ సామాజిక వ్యవస్థయందు వారికి నమ్మకముంది; దాన్ని సాధించేందుకై ఆత్మవిశ్వాసంతో, చిత్తశుద్ధితో వారు కృషి చేస్తున్నారు. కాబట్టి ఇక్కడ దేవుని ప్రస్తావన తీసుకురాకుండా వుండడంమంచిది. నిజంగా దేవుడనేవాడుంటే దేవుడున్నాడని ఒక వైపున నమ్ముతూ లాభతృష్ణతో మరొక వైపు క్రూరకర్మలకు పాల్పడే ఆస్తికుల నేకులకన్న సులభంగా శీఘ్రంగా కమ్యూనిస్టులే దైవ సాన్నిధ్య మందగలరు. ఎందుకంటే మార్క్సిస్టుల మాటలకు చేతలకూ తేడా లేదు. కాని ఆస్తికులయిన సర్వోదయ వాదులను మార్క్సిస్టులు తృణీకరించవలసిన అవసర మేముంది? లేదు. ఎవరుకూడ వారి భావాలను మరొకరిపై బలవంతాన రుద్దకూడదు. జీవితానుభవం కన్న మానవునికి మహోపదేశం చేయగలది మరొకటి లేదు. ఇలాంటి గీటురాయిపై అనుభవమనే వివిధ భావాలను పరీక్షించి చూద్దాం. ముందుగానే ఒకరిని గురించి ఒకరు దురభిప్రాయాలు ఏర్పరచుకోకుండా అంతా కృషి చేస్తూ

వుందాం. కమ్యూనిస్టులూ, మత సంస్కర్తలూ - ఈ ఉభయుల్లో ఎవరు తమ తమ లక్ష్యాలను ముందుగా, దివ్యతరంగా సాధించగలరో చూద్దాం.

— 'న్యూఏజ్' ఏప్రిల్ 1958

# సర్వోదయం : దాని ప్రధాన లక్షణాలు

## సుబోధ్ మెహతా

సర్వోదయవాదుల్లో భూదాన, గ్రామదానోద్యమ కార్యకర్తలు "దున్నేవానికి భూమి" అనే గమ్యస్థానం చేరుకోడానికి కమ్యూనిస్టులతో కలిసి ప్రయాణం చేస్తున్నప్పటికీ సర్వోదయ సిద్ధాంతంలోని మరొక అంశమయిన భావవాద దృక్పథానికి వారిస్తున్న ప్రాధాన్యం, సర్వోదయలక్ష్యమైన వర్గరహిత సమాజస్థాపన భగ్నంచేయక తప్పదు.

పరమ సత్యాన్నీ, సాపేక్ష సత్యాన్నీ ఒకదానితో ఒకటి గందరగోళం చేసుకొని, అస్తిత్వం పదార్థం - ఈ రెంటి నిర్ణాయక పాత్రను గమనించలేని ఈ ధోరణియొక్క ప్రధాన లక్షణాలను పరిశీలిద్దాం.

సర్వోదయ సిద్ధాంత వ్యాఖ్యాతలలో సుప్రసిద్ధుడైన దాదా ధర్మాధికారి ఇలా అంటున్నాడు : "సాంఘిక విలువలు శాస్త్రీయమైనవిగా గాని ఆర్థికమైనవిగా గాని ఉండరాదు. అవి కేవలం 'పారమార్థికమయినవిగా' ఉండాలి."

ఆయన "పరమార్థాన్ని" ఇలా నిర్వచించారు: "ఏకైక రూపంలో సుస్థిరమై, మార్పుకు లోనుగాక, సర్వకాలాల్లో

సర్వత్రా సర్వులకు అందుకోవలసిన ఆదర్శంగా ఏదైతే వుంటుందో అటువంటి లక్ష్యమే పరమార్థం."

ఇంకా ఇలా వివరించారు: "మనం ఏదైతే నిర్మూలించాలని అనుకొంటున్నామో అది క్షణికమైనది; లేక పరిచ్ఛిన్నమైనది. ఏదైతే మనం నిర్మూలించ దలచుకోలేదో అది శాశ్వతమైనది; అఖండమయినది."

ఆయన విప్లవాన్ని ఇలా నిర్వచించారు: "సంఘంలో అంతర్గతమైవున్న వైరుధ్యాలను తొలగించడమే విప్లవం. ఆ తరువాతనే సర్వోదయ స్థాపన సాధ్యంకాగలదు" ఈయన "చింతన" వైయక్తికమయినది కాదనీ, దానికి స్వయం ప్రతిపత్తి వున్నదని అంటూ, "చింతనలో వైరుధ్యాలు పొడసూపడం అసంబద్ధం" అని ఉద్ఘాటించారు.

సందర్భంనుండి వేరుచేసి చూచినప్పుడీ నిర్వచనాలు దేనికదె సబబుగానే కనిపించవచ్చు. కాని వీటన్నిటిని సమష్టిగా పరిశీలిస్తే కనిపించే చిత్ర మీా క్రిందివిధంగా ఉంటుంది:

హృదయపరివర్తన కలిగించడానికై వ్యక్తి స్వయం ప్రతిపత్తిగల చింతన అనే ఆయుధాన్ని చేపట్టి, పవిత్రాత్ముడు కావాలి. ఇలా పవిత్రుడై, సంఘంలో అంతర్గతమైవున్న వైరుధ్యాలను నిర్మూలించుకొంటూ, అఖండమైన జీవితపు విలువలనే దుర్గమ్యమైన పరమార్థాన్ని లక్ష్యంగా వుంచుకొంటే, సర్వోదయం సిద్ధిస్తుంది.

సంఘంలోని వైరుధ్యాలను తొలగించి, వర్గాలూ రాజ్యాంగయంత్రం లేని సామాజిక జీవితాన్ని అందుకోవడమే

మన చరమలక్ష్యం అని శ్రీ ధర్మాధికారి నిర్వచిస్తున్నప్పుడు మన మాయనతో సంపూర్ణంగా ఏకీభవిస్తాము. 'చింతన' వైయక్తికమయిన ప్రక్రియకాదని ఆయన అంటున్నమాటను కూడా మనం అర్థంచేసుకోవచ్చు. ఎందుకంటే 'చింతన' ఏ ఒక్క వ్యక్తికో పరిమితమైనది కాదు.

కాని ఈ 'చింతన'కు స్వయం ప్రతిపత్తి వున్నదనీ, దీనికి అఖండమయిన అస్తిత్వమున్నదనీ అన్నప్పుడే గందరగోళం ప్రారంభమవుతుంది. చింతన అనేది ఒక మనోవృత్తి; జీవితవిధానం లేక పదార్థస్వరూపం యొక్క అభివ్యక్తీకరణ. కాని, జీవితానికిగాని పదార్థానికిగాని సంబంధంలేకుండా చింతన స్వతస్సిద్ధంగా ఎలా భాసిస్తుందో వివరించబడలేదు. కాని ఈ అవగాహన యాదృచ్ఛికమైనది కాదు; ఎందుకంటే ఆయన "ప్రేమ, అహింస" మానవస్వభావంలో అంతర్గతమై వున్న మూల విషయాలని నిర్వచిస్తున్నాడు. మానవ స్వభావం మారకుండా స్థిరంగా ఉండేదని ఆయన అభిప్రాయం.

'అహింస' అనేది మహా అయితే మానవుడవలంబించు ఒక వైఖరి లేక ప్రవర్తన అని మాత్రమే చెప్పడానికి వీలుంది. అదే విధంగా 'ప్రేమ'అనేది ఆ యావ్యక్తులను పరిస్థితులనుబట్టి వుండే 'సాపేక్ష' (relative) విషయం. కాని వీటికి "అఖండ" (absolute) గుణాలు ఆపాదింపబడుతున్నాయి. 'ఆర్థిక' విలువలకు శాస్త్రీయమైన విలువలకు భిన్నమైన ఆ అందరాని "పరమార్థా"నికి కూడ యిదే దృక్కోణంనుండి నిర్వచనం ఇస్తున్నాడు. అంటే మానవునిచుట్టూవున్న భౌతిక జగత్తు ఉనికిని కాదంటున్నాడన్నమాట.

మానవుడు స్వతస్సిద్ధంగా మంచివాడనేకాక, స్వత స్సిద్ధంగా అతని మనస్సు మలినంకాదని సర్వోదయవాదుల భావం. ఏ విధమైన మార్పు లేకుండా స్థిరంగావుండేదేదో మానవునిలో ఉందని వారిఅభిప్రాయం. కాబట్టి మన పనంతా ఎన్నటికీ మారని, మలినంకాని ఈ 'మహదర్థాన్ని' బహిర్గతం చేయడమే అని వారి తాత్పర్యం.

వారి దృక్పథంలో భౌతిక ప్రపంచమనేది బొత్తిగా లేదు. వారి దృష్టిలో భౌతికపరిణామ సూత్రాలు, పదార్థంలో కలిగే మార్పులకు సంబంధించిన శాస్త్రీయ విషయాలు పెద్దగా అంచనాలోనికి తీసుకోవలసినవి కావు. కేవలం ఆధ్యాత్మికమైన ఈ సర్వోదయ కార్యక్రమంలో ఒకవ్యక్తి మరొకవ్యక్తి హృదయాన్ని మార్చడానికి ప్రయత్నిస్తాడు. ఫలితంగా యావత్తు సమాజమూ మారిపోతుంది. విప్లవం జరిగిపోతుంది.

భావవాద జనితమైన ఈ అపోహనుండి బయలుదేరిన సర్వోదయవాదం కొసకు తేల్చినదిది: ప్రపంచంలోని అనర్థాల కన్నిటికి అధికారమే (దాని దుర్వినియోగంకాదు) మూలకారణం; ఈ అధికార బీజాలు నిర్మాణంలోనే (లేక పరిపాలనలో) వున్నాయి. కాబట్టి నిర్మాణమంటే ఏదో ఒక రూపంలో అంతర్గతమై ఉన్న అధికారమని అర్థం.

రాజ్యాంగ యంత్రం అధికారం చలాయించే సాధనం. రాజ్యాంగయంత్రంలేని సమాజాన్ని స్థాపించడం మన లక్ష్యం. కాబట్టి మనం మొట్టమొదటి నుండి అధికారబీజాలను పూర్తిగా నాశనం చేయాలి. అందుకని, నిర్మాణాన్ని మనం మనసా కర్మణా పరిత్యజించివేద్దాం. ఇదీ వీరివాదం. ఈ విధంగా

ఎన్నో సంవత్సరాల చరిత్ర పరిణామఫలితమూ, నియమబద్ధమైన సమిష్టి జీవిత విధాన ఫలితమూ అయిన మానవ జీవిత వ్యవస్థ వీరి దృష్టిలో అధికార మాలిన్యంవల్ల కళంకితమైపోయింది.

శ్రీ ధర్మాధికారి భవిష్యత్ మానవ సమాజం ఎలా ఉండాలనే విషయం కూడ వివరించారు. పొరుగువాని కోసం ఉత్పత్తి చేయడం, 'సన్నిహితత్వం' అనేవి ఈయన ఊహిస్తున్న సమాజానికి పునాదిరాళ్ళు. 'పొరుగువానికోసం ఉత్పత్తిచేయడం' అనేదానికీ, సోషలిజానికీ భేదం చెప్పబడింది. సోషలిజమంటే 'వినియోగానికై ఉత్పత్తి చేయడం' అని నిర్వచించారు. వినియోగానికై ఉత్పత్తి చేయడంవల్ల మానవుడు వ్యక్తిత్వం కోల్పోతాడని, ఏదో ఒకపనిలో ప్రత్యేక నైపుణ్యం సంపాదించడమంటే మానవులు ఒకరికొకరు సంబంధం లేకుండా జీవించడమేననీ శ్రీ ధర్మాధికారి అభిప్రాయం.

సమష్టి జీవితాన్ని పరిపుష్టంచేసే విలువలపై ఆయనకు గల అపనమ్మకానికీ, వాటిని గూర్చి ఆయన ఏ మాత్రమూ అవగాహన చేసుకోలేదనడానికీ ఇంతకన్న మంచి ఉదాహరణ లేదు. వాస్తవానికి సమష్టి జీవితంలో వివిధ వ్యక్తుల ప్రత్యేక నైపుణ్యాలు అన్యోన్యాశ్రయాలై ఉంటాయి. ఉత్పత్తి సాధనాలు అభివృద్ధిచెందేకొద్దీ, ఉత్పత్తి అధికాధికమై మానవ సమాజం స్వీయ సాంస్కృతిక వికాసానికి కృషిచేయటానికి తగిన వ్యవధి అవకాశాలు ఏర్పడుతాయి. సర్వోదయవాదులు కలలుగనే ఈ 'సమైక్యసమాజంలో' ప్రతివ్యక్తి తక్కినవారం దరినీ ఎరుగును. ప్రతివాడూ తాను స్వయంగా ఎరిగిన ఫలానా వ్యక్తి ఫలానా విధంగా వుపయోగానికే వస్తూత్పత్తి చేస్తాడు.

'సర్వోదయ'మని పిలువబడుతూన్న సిద్ధాంతంలో ఇలాంటిభావవాద ధోరణి, ఊహాస్పష్టంగా, వేళ్లూని వున్న ప్పటికీ ప్రజల సమస్యలకు సంబంధించినంతవరకు గాంధీజీ ఒక విశిష్ట మైన భారతీయపంథా అవలంబించారు. మార్క్సిజాన్ని మన దేశంలో ఒకసజీవమైన శాస్త్రంగా నెలకొల్ప దలచుకొనే ప్రతి మార్క్సిస్టు యీ వైఖరిని అలవర్చుకొని తీరాలి. ఇదొక క్రియాత్మకమైన, పురోగామిశీలమైన మానవతా దృక్పథం లేక పంథా. చిత్తశుద్ధి, దీక్ష, ఆత్మత్యాగం, సౌభ్రాతృత్వం, సంపూర్ణ నిరాడంబరత, అణగారిన ప్రజలపట్ల గాఢానురాగం, సత్యసంధత మొదలయిన సద్గుణాలు ప్రజా హృదయోద్దీపనకారులై భారతీయ జీవితపు విలువలను ప్రతిబింబిస్తూన్నందున అవి గాంధీజీ పేరుతో పెనవేసుకు పోయ్యాయి.

ప్రజలకు సేవచేయాలని చెప్పుకొనే ఎవరికైనా ఈ గుణాలన్నీ తప్పనిసరిగా ఉండాలన్నప్పుడు ఇక కమ్యూనిస్టుల విషయం చెప్పనక్కరలేదు. కాని ఇక్కడ నేను స్పష్టం చేయదలచుకొన్న విషయ మేమంటే, మార్క్సిస్టు అయిన వాడెవ్వడూ ఒక దృక్పథాన్ని విషయ వస్తువుగానూ, లేక బాహ్య స్వరూపాన్ని సిద్ధాంతంగాను పొరపడకూడదు.

హింసపట్ల మార్క్సిజానికీ సర్వోదయానికీ గల విభిన్న వైఖరే ఈ రెండు సిద్ధాంతాలను వేరు చేస్తున్నదని కూడ చెబుతున్నారు. కాని ఇది నిజంకాదు. మార్క్సిజంలోని భౌతికవాద సిద్ధాంతం దాన్ని ఊహాత్మకమైన సర్వోదయ భావవాద సిద్ధాంతంనుండి వేరుపరుస్తున్నది. అదేవిధంగా,

మార్క్సిజం యొక్క గతితార్కిక పంథా కూడ దీన్ని జడాత్మకమయిన సర్వోదయ పంథానుండి వేరుచేస్తూంది.

ఈ రెంటికీగల భేదం బాగా స్పష్టం కావడానికి క్రింది విషయం గమనించాలి. సర్వోదయవాది కపటులూ, పాషాణ హృదయులూ అయిన దోపిడీదారులలో కూడ హృదయ పరివర్తన కలిగించడమే ఏకైక కర్తవ్యంగా భావిస్తున్నాడు. కాని మార్క్సిస్టు ఈ దోపిడీదారులను సృష్టిస్తున్న సాంఘిక వ్యవస్థాలను, అంటే భౌతిక ప్రాతిపదికను తొలగించడమే ప్రథమ కర్తవ్యంగా ఎంచుకొంటున్నాడు.

ఇలాంటి స్పష్టమైన అవగాహన కలిగి, ఒకరి చిత్తశుద్ధిని మరొకరు సంపూర్ణంగా విశ్వసిస్తూ, వాస్తవమైన సర్వోదయ వాదులూ కమ్యూనిస్టు కార్యకర్తలూ మన దేశంలో వర్గ రహిత సమాజ స్థాపన అనే ధ్యేయానికై కలిసి ఎంతో కృషి చేయవచ్చు.

— 'న్యూఏజ్' మే 1958

# ప్రధానాంశాలలో సామ్యంలేదు

## సి. యల్. చక్రవర్తి

సోషలిజం స్థాపించడానికై భారత కమ్యూనిస్టులు గాంధేయపద్ధతు లనుసరించాలంటూ, ఒకానొక గుజరాత్ కమ్యూనిస్టునాయకు డన్నట్లు కొన్ని రోజులక్రితం నేను పత్రికల్లో చూచాను. ఆ వార్త నిజమే అయితే, అలాంటి అభిప్రాయాలు సరియైనవి కావని చెప్పవలసివుంది. మార్క్సిస్టు సిద్ధాంతాలూ, దృక్పథమూ కొద్దిమాత్రం తెలిసినవా రెవరైనా సరే ఇలాంటి ప్రమాదకరమైన భావాలలో, గందరగోళంలో చిక్కుకొనివుండడం నిజంగా ఘోరమయిన విషయం.

ఈ రెండు దృక్పథాలకు మూలవిషయాల్లోనే భేదముంది. మార్క్సిస్టు సిద్ధాంతం జగత్పరిణామాన్నీ, సామాజిక ఉద్యమాలనూ శాస్త్రీయంగా వివరిస్తుంది. ఆచరణలో, మార్క్సిజం కర్తవ్యాన్ని తెలియజెప్పేది; కాబట్టి అది ఊహాత్మకమయిన సిద్ధాంతంవలె కాక, మానవజాతి తన భవిష్యత్తును అభ్యుదయ కరమైన మార్గంలో తీర్చిదిద్దుకోవడానికి అనువయిన సాధనంగా వుపయోగపడుతోంది. అంటే

దీని అర్థం, మార్క్సిస్టు సిద్ధాంతం - ఆచరణ అనే పరికరాల సహాయంతో, మానవజాతి కమ్యూనిజమనే తుది లక్ష్యాన్ని సాధించడానికి మొట్టమొదట సోషలిజంద్వారా సమతా సమాజాన్ని స్థాపించడానికి చైతన్యంతోనూ, దీక్షతోనూ కృషిచేస్తుంది.

చరిత్ర అంటే సమాజం ఒకదశనుండి అంతకన్న ఉన్నత మయిన దశకు పురోగమించడమేనని మార్క్సిస్టు సిద్ధాంతం చెప్పుతున్నది. శాస్త్రీయ విజ్ఞానంలోనూ, సాంకేతిక రంగంలోనూ మార్పులు రావడంతో, ఆర్థికసంబంధాలు కూడ మారుతాయి, ఆర్థికసంబంధాల్లో వచ్చిన ఈమార్పులు సాంఘిక వ్యవస్థా విశ్వాసాలపైన, అంటే సంఘోపరి నిర్మాణంపైన తమ ప్రభావాన్ని ప్రసరింపజేస్తాయి. భౌతికపరిస్థితులు మారినప్పుడే, సాంఘిక సంబంధాలలోను దృక్పథాలలోను మార్పు రావడం సాధ్యమవుతుంది. ఈ మార్పు తరచు హింసతో కూడుకొని వుండడంకద్దు. ఎందుకంటే, క్షీణముఖం పట్టి చావుకు సిద్ధంగావున్న శక్తులు అభ్యుదయ శక్తులను అరికట్టడానికై ప్రయత్నించి, ఘర్షణలకు కారణభూతమవుతాయి.

మార్క్సిజం ఇలా చెబుతోంటే, గాంధేయ సిద్ధాంతమూ దాని సాంఘిక దృక్పథమూ, చెబుతున్నదేమి? తన ఆదర్శంకోసం అది వెనుదిరిగి గతంవైపు చూస్తుంది. గతానికి 'రామరాజ్యం' అని పేరుపెట్టి ఆకాశానికెత్తుతోంది. కాని వాస్తవంలో మన భావనాబలమంతా ఖర్చుచేసినప్పటికీ, ఈ రామరాజ్యం ఒకఆదర్శంగా పరిగణించడానికి వీలులేదు.

గాంధీవాదం పురోగతిని అరికడుతుంది. ఎందుకంటే, అది శాస్త్రీయ విజ్ఞానానికీ, సాంకేతికాభివృద్ధికీ విస్తృత పారిశ్రామికీకరణకూ పూర్తిగా విముఖం. ఇక గాంధీవాద రాజకీయ దృక్పథం అభివృద్ధినిరోధకమైనది. ఎందుకంటే, అది ప్రజల మతవిశ్వాసాలను రాజకీయ లక్ష్యసిద్ధికి సాధనాలుగా ఉపయోగిస్తుంది. ఇంతేకాదు. ధనికవర్గాలవారు స్వభావసిద్ధంగా మంచివారనీ (ఇది అనుమానాస్పదమయిన విషయం), వారికి విజ్ఞప్తిచేయడం ద్వారా తామాశిస్తున్న సామాజిక వ్యవస్థను నెలకొల్పవచ్చుననీ గాంధీవాదుల తాత్పర్యం. ధనికవర్గాలు పేదల తరఫున వ్యవహరిస్తున్న ధర్మకర్తలని గాంధేయుల అభిప్రాయం.

సమతా సమాజమనే ఆదర్శాన్ని సాధించడానికి తదనుకూలమయిన కొన్ని భౌతిక పరిస్థితులను కల్పించడం అవసరమని మార్క్సిస్టు మూలసూత్రాలు చెప్తున్నవి. గాంధీ సిద్ధాంత ప్రాతిపదిక కిది విరుద్ధం. కాబట్టి గాంధీవాదం, మార్క్సిజం ఈ రెండూ పేర్కొంటున్న వర్గరహిత సమాజం ఒకటే అని పైకి కనబడుతున్నప్పటికీ దాన్ని సాధించడానికి ఈ ఉభయ సిద్ధాంతాలు అనుసరించే పద్ధతులు పూర్తిగా భిన్నమయినవి. వర్గసామరస్యమే ఇందుకు మార్గమని గాంధీవాదమంటోంది. కాదు, వర్గపోరాటమనేది మానవ చరిత్రలోనే ఉన్నదని మార్క్సిజం అంటుంది. భవిష్యత్తును తెలుసుకోవడానికి గతచరిత్ర కొన్ని విషయాల్లోనైనా తోడ్పడుతుందని మనమనుకొంటే, మార్క్సిస్టు దృక్పథమొక్కటే సహేతుకమయినదని చెప్పక తప్పదు.

సర్వోదయ సమాజాన్ని ఎలా నెలకొల్పాలి? గాంధీవాదులయిన సంఘసంస్కర్తలంతా కలిసి. భూస్వాములనూ పెట్టుబడిదారులను వారి వారి ఆస్తులలో అత్యధికభాగాన్ని ఐచ్ఛికంగా వదలుకొమ్మనీ, బీదలకు దానంచేయమనీ వేడుకోవాలి. ఇది అమలు జరుగుతుందా లేదా అనే విషయం అలా వుంచి, ఈ వైఖరే మానవుని ఆత్మాభిమానాన్ని కించపరుస్తుంది. అందుచేత దాన్ని ఖండించవలసివుంది. చారిత్రక దృష్టితో చూచినప్పుడు ఆస్తి అనేది చౌర్యంతప్ప వేరు కాదు. అందువల్ల, దాన్ని మళ్ళీ స్వాధీనం చేసుకోవడానికి ప్రజలకు సంపూర్ణమైన హక్కుంది. దానికై ప్రాధేయపడవలసిన పనిలేదు.

ఇంతేకాదు. సర్వోదయ సిద్ధాంతం వస్తూత్పత్తికై పాతకాలంనాటి మోటుపద్ధతులనే మళ్ళీ చేపట్టాలనిఅంటుంది. ఈ వైఖరి దేశంలో పారిశ్రామికాభివృద్ధిని అరికడుతుంది. తత్పర్యవసానంగా, మొత్తం ఉత్పత్తీ జాతీయాదాయం తగ్గిపోక తప్పదు. జనాభా పెరుగుదల సమస్యను కూడ మనం దృష్టిలోకి తీసుకొన్నపుడు, ఈ విధానం శుద్ధ తప్పని వేరే చెప్పనవసరంలేదు. ఈవిధానం అమలుజరపడమంటే, దారిద్ర్యాన్ని అందరికి పంచిపెట్టడమే అవుతుంది. గాంధేయ ఆర్థిక విధానం పారిశ్రామికీకరణవల్ల కలిగే దుష్ఫలితాలను ఏకరువు పెట్టడంలో కేవలం పాక్షిక వైఖరి నవలంబిస్తోంది. ఎందుకంటే, పరిశ్రమలను మొత్తం సమాజశ్రేయస్సుకు వినియోగిస్తే, మానవజీవితం మహోజ్జ్వలం కాగలదనే సత్యాన్ని ఇది విస్మరిస్తున్నది.

ధనాఢ్యులు ప్రజల ధర్మకర్తలని వారిని నమ్ముకోని కూర్చోడంకూడా చరిత్ర నేర్పుతున్న గుణపాఠాలకు విరుద్ధం. గతంలోకూడ గాంధీవలె మానవునిలో హృదయపరివర్తన తేవడానికి కృషిచేసినవారు కొల్లలుగా కనిపిస్తున్నారు. కాని 'ఉన్నవారు' ఒకడో అరో కాకుండా, వర్గం వర్గమే తమ సంపదను ప్రజల పరంచేసిన ఉదంతం చరిత్రలో లేదు. ప్రాచీన ఈజిప్టు, సుమేరియా, మెసొపొటేమియా, సింధులోయ నాగరికతలన్నీ విపరీతమైన ఆర్థిక వ్యత్యాసాలపై నిర్మింపబడినాయి. కాబట్టి ప్రాచీనకాలాన్ని ఒక మహాదర్శంగా కీర్తించడంలో అర్థం లేదు. ప్రాచీన భారతావని మానవతావాదాన్ని గుత్తకు తీసుకొన్నట్లుగా చిత్రింపబడుతున్నప్పటికీ, భారతదేశ చరిత్రకూడ పైన చెప్పిన దానికన్న భిన్నంగా కనిపించడం లేదు.

మార్క్సిజం భారత దేశంలో జయప్రదం కావాలంటే దాన్ని మన దేశ ప్రత్యేక పరిస్థితులకు అనుగుణ్యంగా మార్చవలసి వుంటుందని వినోబాజీ చెప్పడంలో కొత్తదేమీ లేదు మార్క్స్, ఎంగెల్స్ కూడ పదేపదే ఈ విషయం నొక్కిచెప్పారు. అయితే పత్రికలూ, మతబోధకులూ అవిరామంగా ప్రచారం చేస్తున్న ఈ భారతదేశ ప్రత్యేకత ఏమి? ప్రభుత్వాన్ని బలప్రయోగంతో కూలద్రోయడం తప్పని చెప్పే ఒక విశిష్టమయిన ఆధ్యాత్మిక గుణమా? అయితే ఈజిప్టులో అఖ్నాటన్, గ్రీసులో స్టాయిక్ తత్వవేత్తలూ, జీసస్ క్రీస్తూ, ఇంకా ఇలాంటి అనేక మంది మహాపురుషులు భారతదేశం వెలుపల అహింసాతత్త్వాన్ని బోధించారని చరిత్ర చెబుతున్న దే

సామాజిక పరిణామంలోని ప్రతిదశలోనూ అహింస అనేది మీరరాని సూత్రంకాదు; ఐతే అది వాంఛనీయమే కావచ్చు. మన దేశ చరిత్రలోని స్వర్ణయుగంలో అంటే మౌర్య, గుప్తయుగాలలో సైతం జైన బౌద్ధమత ప్రబోధాల ననుసరించి భారతదేశం సామ్రాజ్య ప్రయోజనాలకోసం "హింసాత్మక"మైన పద్ధతులను చేపట్టకుండా మానుకొన్నదని చెప్పడం సరికాదు. ఇంకొక విషయమేమంటే, సమాజాన్ని హింసాత్మకమైన పద్ధతులద్వారా సత్వరమే మార్చేటప్పుడు కలిగే ప్రాణనష్టంకన్నా బాధలకన్నా అలాంటి మార్పు జరగనప్పుడే మానవాళి ఎక్కువ బాధలకూ ప్రాణనష్టానికీ గురికావచ్చు. అహింసా సిద్ధాంత ప్రవక్తయైన గాంధీజీసైతం ఎన్నో సందర్భాలలో హింసను డొంకతిరుగుడు వాదనలతో సమర్థించారు.

ప్రస్తుతం భారతదేశంలోని పరిస్థితిని కూడ గమనించండి. అవసరమని తోచినప్పుడు గాంగ్రెసు నాయకులు క్రౌర్యం ప్రదర్శించడంలో ఎవరికీ తీసిపోరు. కోటానుకోట్ల ప్రజల జీవితాలేమైనాసరే వారు పట్టించుకోరు. భారతీయులు జన్మతః కరుణారస తరంగిత హృదయులని తలపట్టుగట్టేలా ప్రచారం సాగుతున్నప్పటికీ, మన దేశంలో సన్నుటెగవేసేవారూ, దగాకోరు కోటీశ్వరులూ, లంచగొండి ఉద్యోగులూ, వంచకులైన రాజకీయ నాయకులూ చాలమందిఉన్నారు. వీరు నాలుగుడబ్బులు వస్తాయంటే ఎంత నీచానికైనా వెనుదీయని రకం. మార్క్సిజాన్ని మన సంప్రదాయ సంస్కృతులకు అనుగుణ్యంగా మలచుకోవాలనే సమస్యపై ఏవిధమైన వివా

దమూ లేదు. కాని ఇది సర్వోదయవాదులనుకొనే అర్థంలో మాత్రం కాదు.

సంగ్రహంగా చెప్పిన పైవిషయాలనుబట్టి ఈ రెండు దృక్పథాలకు ప్రధానాంశాలలో సామ్యంలేదని స్పష్టమవుతుంది. సర్వోదయలక్ష్యం వర్గరహితసమాజమే కావచ్చు. కాని ఈ సిద్ధాంత ప్రతిపాదకులు అనుసరించే అశాస్త్రీయమైన పద్ధతులే వారి ఉద్దేశాలను భగ్నంచేస్తున్నాయి. వారి ఆశయం ఒక పగటికలగా నిలిచిపోక తప్పదు. కాని ప్రపంచ మంతటా ప్రతిధ్వనులీనుతున్న కమ్యూనిస్టు ఉద్యమం బాధలతో క్రుంగుతున్న కోటానుకోట్ల ప్రజానీకానికి ఆశాజ్యోతిగా వెలుగొందుతోంది. ఎందుకంటే, ఆ ఉద్యమానికి ప్రాతిపదికయైన మార్క్సిజం ప్రతివిషయాన్ని శాస్త్రీయమైన వాస్తవికతా దృష్టితో వివరిస్తుంది. కాని ఆచరణలో గాంధీవాదం చేస్తున్న దేమిటి ? చావుకు సిద్ధమైన సామాజిక వ్యవస్థ మరికొన్నాళ్ళు కొనసాగేలా ప్రయత్నిస్తోంది.

—"న్యూ ఏజ్" మే 1958

# సర్వోదయం : కమ్యూనిజం

## బి. టి. రణదివే

వినోబాభావే సర్వోదయ సిద్ధాంతం భారతీయ సమాజంలోకల్లా ఆసక్తిజనకమయిన ఘటనలలో ఒకటని చెప్పాలి. వినోబాజీ, ఆయన శిష్యులూ రాజ్యాంగ యంత్రాన్ని రద్దుపరుస్తా మంటున్నారు. భూమిమీదా, ఇతర ఉత్పత్తి సాధనాలమీదా వ్యక్తులకున్న స్వత్వాన్ని తొలగించుతా మంటున్నారు. డబ్బుయొక్క ప్రాముఖ్యాన్ని రద్దుచేస్తా మంటున్నారు. వీనిని సఫలంచేయగల శాంతియుత విప్లవాన్ని నడుపుతా మంటున్నారు. ఐనా, ప్రభుత్వంలోవున్న వర్గమూ ప్రభుత్వమూ యీ నూతన విప్లవనాయకునికి జేజేలు కొడుతున్నారు. ఆయనను ఒక మహాయోగి అని కీర్తిస్తున్నారు. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ప్రధాన మంత్రి నెహ్రూ, రాష్ట్రాల మంత్రులు, కాంగ్రెసు నాయకులు సర్వోదయ మహాసభలకు వెడుతూంటారు. సర్వోదయ విప్లవం యెడల తమకు విశ్వాసమున్నదని ప్రకటిస్తూంటారు. బహుశా యీ విప్లవ కార్యక్రమాలకు కొంతవరకు ప్రభుత్వ కోశంనుంచి సహాయంకూడా లభిస్తూ ఉండవచ్చు.

భారతదేశం ఒక నూతన చరిత్రను సృష్టిస్తూంది. సందేహం లేదు. ఏమంటే తన అధికారాన్నీ, పెద్దరికాన్నీ నిర్మూలించుతానంటున్న విప్లవానికి ప్రభుత్వమూ, పాలక వర్గమూ సహాయపడడమనేది చరిత్రలో ఇదే ప్రథమం.

గాంధీవాదం అడుగు జాడల్లో

జాతీయ ప్రభుత్వం హయాములో సామాజిక సమస్యల పరిష్కారానికి గాంధీవాదాన్ని సమన్వయించి, వర్తింప చేయడమే వినోబాజీ సిద్ధాంతాల ఆశయం. బ్రిటిష్ పరిపాలన రోజుల్లో సత్యాగ్రహోద్యమానికీ, ప్రభుత్వంమీద ఒత్తిడి తేవడానికీ గాంధీవాదం ప్రాముఖ్యత నిచ్చింది. అది యిప్పుడు పనికిరాదు. దానిని నూతన పరిస్థితులకు అనుగుణంగా మార్చాలి. వినోబాజీ ఆవిధంగా దానిని చాలవరకు మార్చి అబాధకం చేసేరు. గాంధీజీ విదేశీ ప్రభుత్వంతోను, రాజ్యాంగ యంత్రంతోను పోరాడేరు. కాని వినోబాజీ ఈ నాటి ప్రభుత్వంతో ఘర్షణ పడడానికి వెనుతీస్తున్నారు. ప్రజల నుంచి ఒత్తిడి తెచ్చేటందుకై గాంధీజీ సత్యాగ్రహాన్ని ఒక పనిముట్టుగా వుపయోగించేరు. వినోబాజీ దానికి ఒక నిర్మాణాత్మకరూపం ఇవ్వదలచేరు. వినోబాజీ ఇల్లా అన్నారు:

"సత్యాగ్రహం యొక్క నిర్వచనంలో వ్యతిరేకతా స్వభావం ద్యోతకం అయింది; అంటే – మన అభిప్రాయంతో ఏకీభవించనివారిని ఒప్పించేందుకై ఒత్తిడి తెచ్చే వుద్యమం అనే అర్థం దానికి రూఢం అయింది...వ్యతిరేక దృక్పథంతో పనిచేయవలసిన పరిస్థితులలో గాంధీజీ పడ్డారు. కాని కొన్ని విషయాలను వ్యతిరేకించేందు కుద్దేశించబడిన వుద్యమాలకు

కూడ నిర్మాణాత్మక రూపాన్నివ్వగల మేధో సంపద ఆయన కుంది...ప్రజాతంత్ర వ్యవస్థలో సత్యాగ్రహం అధిక సత్ఫలితాల నివ్వాలంటే అది ఎక్కువ నిర్మాణాత్మకంగా వుండాలి. ఏదో ఒకదానిని వ్యతిరేకించడం అనేది తక్కువ కావాలి. ప్రజాతంత్ర ప్రభుత్వాధికారంలో సత్యాగ్రహానికి స్థానం లేదనడం పొరపాటు. మన ఎదుటనున్న పరిస్థితులలో శక్తి వంచన లేకుండా నిర్మాణాత్మకంగా కృషి చేయగలిగేటట్లు ఆత్మ శిక్షణ పొందాలి. దానిలో ఆరితేరాలి."

(వినోబా, ఆయన ఆదర్శం : పుట 122. అడుగు గీతలు నావి.)

ప్రజాతంత్ర (జాతీయ) ప్రభుత్వంక్రింద నిర్మాణాత్మకమైన సత్యాగ్రహానికే స్థానం. ప్రజా ఉద్యమం ద్వారా బ్రిటిష్ వాళ్ళమీద వొత్తిడి తెచ్చిన గాంధీజీ యొక్క వ్యతిరేకతా మూలక సత్యాగ్రహానికి స్థానం లేదట! హింసా, అహింసా అనేదిక్కడ ప్రధానం కాదు. నిర్మాణాత్మకమా, వ్యతిరేక మూలకమా అనేది ప్రధానం. గాంధీజీ సత్యాగ్రహం వేరు, వినోబాజీ సత్యాగ్రహం వేరు. బ్రిటిష్ పరిపాలనా కాలంలో అహింసాయుత సత్యాగ్రహం జరిగింది. జాతీయ ప్రభుత్వం వచ్చేక అహింసాయుత నిర్మాణాత్మక సత్యాగ్రహం జరుగుతుంది.

జాతీయ ప్రభుత్వం అధికారంలో వున్న యీనాటి పరిస్థితులకు వినోబాజీ గాంధీవాదాన్ని సమన్వయపరచ చూస్తున్నారనేది మనం గుర్తుంచుకొంటే, మనం ఆయన సిద్ధాంతాలను అర్థం చేసుకోగలుగుతాము

## సర్వోదయ సమాజం

వ్యక్తులమధ్య తగాదాలు లేని, ప్రేమమూలకమైన, రాజ్యాంగరహితమైన సమాజాన్ని నిర్మించే యత్నంలో భూదానం, గ్రామదానం, సంపత్తిదానం అనేవి భిన్న భిన్న దశలు. సర్వోదయోద్యమంయొక్క ఆశయాలలో కొన్ని సోషలిస్టు వుద్యమంయొక్క అభివృద్ధికి ఫలితాలు. 1920 నాటి గాంధేయ ధోరణులల్లే గాకుండా వినోబాజీ ఆధునిక విజ్ఞానాన్ని, యంత్రాలను, పాశ్చాత్య నాగరికతను, పారిశ్రామికాభివృద్ధిని కొంతవరకు అంగీకరిస్తారు. స్వయంసంపూర్ణ గ్రామ వ్యవస్థను పునఃస్థాపించాలనుకోరు. ఇండియాలోనూ, ఇతరత్రానూ వచ్చిన ఆధునిక పరిణామాలూ, పారిశ్రామికాభివృద్ధీ దృష్ట్యా తమ ఆశయాలనూ, గమ్యాలనూ రూపొందించుకోనేటందుకై ఆయనా, ఆయన అనుచరులూ ప్రయత్నించేరు. గ్రామరాజ్య నిర్మాణంతోబాటు (అన్నివిధాలా స్వయం సంపూర్ణం అనదగిన గ్రామీణ వ్యవస్థ) ఆధునిక సాంకేతికాభివృద్ధిని కూడా జోడించడానికి ఆయన ప్రయత్నించేరు. "శక్తికొద్దీ పని, అవసరంకొద్దీ ప్రతిఫలం" - అనే సూత్రాన్ని అమలుజరపగల సమాజమే వారు కావాలంటారు. కాని, భారీ పరిశ్రమలు కనీస స్థాయికి మించి వుండరాదంటారు. గ్రామాలలో చిన్నతరహా రైతుల ఉత్పత్తివిధానం గ్రామీణ చేతిపరిశ్రమలతో కలిసి సాగాలంటారు. సర్వోదయ సమాజం వర్గరహితముగానూ, రాజ్యాంగరహితముగానూ వుంటుందని చెప్పినా, దానికీ సంపూర్ణ కమ్యూనిస్టు

సమాజాన్ని గురించిన మార్క్సిస్టు పండితుల భావనకూ తేడావుంది.

సర్వసేవాసంఘంవారి అధికార ప్రచురణ ఒకదానిలో వారి ఆదర్శ సమాజం గురించి యిల్లా వ్రాసేరు:

"మానవసమాజం పరస్పర సహకార పద్ధతిమీద ఏర్పడాలి. ఈ నూతన సమాజానికి పునాది ప్రేమఅయి వుండాలి. ఈ సమాజంలో ప్రతిఒక్క సభ్యుడూ స్వతంత్రుడు. సాధ్యమైనంత ఎక్కువగా సమానత పాటింప బడుతుంది. వర్గాలుండవు. వర్ణభేదం వుండదు. అన్యాయం జరగదు. దోపిడీ వుండదు. తన వ్యక్తిత్వాన్ని పూర్తిగా పరిణతి పొందించుకొనే అవకాశం యీ సమాజంలోని ప్రతిసభ్యునికీ వుంటుంది. సమాజానికి మూలం వ్యక్తియే అయినా, సామాజిక వ్యవస్థకు స్వార్థప్రయోజనాలు పునాది కాబోవు. దీని వలన మానవుడు సర్వతోముఖంగా వృద్ధిపొందగలడు. పాక్షికంగా మాత్రమే అభివృద్ధి పొందగల అవకాశాలు తగ్గిపోతాయి.

"ఇక ఆర్థిక వ్యవహారాలలో భూమితో సహా సంపద యావత్తూ సమాజానిది. అది యావన్మంది క్షేమార్థం సమష్టిగా వుపయోగించబడుతుంది. పెట్టుబడిదారులనీ, కార్మికులనీ సమాజంలో విభజన వుండదు. లాభం, వడ్డీ, అద్దె, జీతం మొదలయిన మాటలకు అర్థం వుండదు. ప్రతి ఒక్కడూ తన శక్తికొద్దీ పనిచేస్తాడు. సమాజం అతని అవసరాలను తీరుస్తుంది. అటువంటి సమాజంలో ఉత్పత్తి అనేది ఉపయోగం దృష్టితోనేగాని అమ్మకం (మారకం) దృష్టితో

జరగదు. తయారయిన వస్తువులను అందరికీ పంచుతారు. వారు వాటిని వుపయోగిస్తారు. ఎవ్వరూ సంపదలు పోగుచేయ డానికి అవకాశం ఇవ్వరు. ఏమంటే సంపదలన్నిటికీ సమాజమే అధికారి. ప్రతి ఒక్కరి అవసరాలనూ, తోడివారి అవస రాలనూ గమనికలో వుంచుకొని ఎవరి వాటా వారికి ఇవ్వ బడుతుంది.

"అటువంటి సమాజం తనను తానే పరిపాలించు కొంటుంది. పైన పెత్తనం అనేది వుండదు. లేదా సాధ్య మైనంత తక్కువ పెత్తనం వుంటుంది. అంటే ప్రభుత్వాని కుండే అధికారాలూ, ప్రత్యేకతలూ ఈనాటి ప్రభుత్వాల కున్నట్లుండవు. ప్రభుత్వం సమాజంలోని సభ్యులెవ్వరినీ ఒత్తిడిపెట్టదు. అటువంటి ఒత్తిడి అనవసరం.

"మరోలా చెప్పాలంటే ఏంగిల్సు అన్నట్టు ప్రజలపై పెత్తనంస్థానే, వ్యవహారాల నిర్వహణ ఏర్పడుతుంది. పరిపా లించేవాడుండడు. ప్రభుత్వమూవుండదు. రాజ్యాంగయంత్రం అంటూ వుండదు. మనిషిని మనిషి దోచుకొనే సమాజంలో స్వార్థప్రయోజనాల రక్షణకోసం రాజకీయాధికారం అవసరం. ప్రభుత్వమంటేనే అది. కాని పరస్పర సహకారం పునాదిగా యేర్పడిన సమాజంలో సంపద యావత్తూ సమాజానిదయి వుంటుంది. ప్రతి వ్యక్తీ తనకు అవసరమైనంతా తీసుకుంటాడు. అటువంటి సమాజంలో పరిపాలన అనేది అనవసరం. ఉత్పత్తికీ పంపకానికీ సంబంధించినంతవరకు కొన్ని నియమాలను తయారుచేస్తే ఆ సమాజంయొక్క అవసరాలు తీరుతాయి

"స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పూర్తిగా అనుభవంలో వుండే, పరస్పర సహకార ప్రాతిపదికమీద ఏర్పడిన సమాజమే చిన్న చిన్న యూనిట్లతోనూ, వ్యవస్థలతోనూ తన వ్యవహారాలను తాను బాగా చక్కదిద్దుకోగలదు. ఎక్కడో వున్న ప్రభుత్వం పాలనక్రింద అత్యధిక సంఖ్యాకులు జీవించే సమాజంలో నిజమైన స్వాతంత్ర్యానికి స్థానం లేదు. చిన్న సామాజిక సంస్థలు స్వపరిపాలనం చేసుకొనే చోటనే నిజమైన స్వాతంత్ర్యం, ప్రజాతంత్రం వుంటాయి.

"సాధ్యమైనంతవరకు ప్రతి ఒక్క ప్రాథమిక యూనిటూ తనకు కావలసిన వానిని తానే తయారు చేసుకొంటుంది. అదే దాని స్వాతంత్ర్యానికి రక్ష. పెద్ద యంత్రాలతో నేడు వుత్పత్తి చేయడంవల్ల వుత్పత్తి కేంద్రీకృతం అవుతూంది. దానితోపాటు సంపదా, అధికారమూ కేంద్రీకృతం అవుతున్నాయి. అది అందరికీ తెలుసు. ఇతరులను దోచుకునే ధోరణీ, ఇతరుల మీద పెత్తనంచేసే ధోరణీ అప్పుడే ఏర్పడుతుంది. అందుకే నూతన సమాజంలో వికేంద్రీకరణ జరగాలనడం. అల్లాగని పాతబడిపోయిన ఉత్పత్తి సాధనాలనే వుపయోగించాలని కాదు. పైగా వికేంద్రీకృత ఉత్పత్తి వ్యవస్థలో యంత్రపరికరాలను నిరంతరం వృద్ధిపరచేటందుకు అవకాశం వుంటుంది.

"శ్రమద్వారానే మనుష్యుడు సర్వతోముఖంగా అభివృద్ధి పొందగలుగుతాడు; ప్రతి మనిషీ పనిచేస్తే సమాజానికి లాభం. సమాజంయొక్క ఉత్పాదక సామర్థ్యం పెరుగుతుంది. సంతృప్తీ, సుఖం వుంటుంది. ఇల్లా జరిగితే ఈనాడు శారీరక

మానసిక శ్రమల మధ్య కనబడే తేడాలు భావి సమాజంలో కనబడవు.

"విశేషోత్పత్తి చేయకతప్పని పరిశ్రమలూ, ఫ్యాక్టరీలూ కొన్ని వున్నాయి. అటువంటి సందర్భాలలో కేంద్రీకరణ జరగక తప్పదు. కాని వానిమీద సమాజానిదే పెత్తనం. వానిని ప్రజాతంత్రయుతంగా నిర్వహిస్తారు. నూతన సమాజంలో ఆయుధోత్పత్తి పూర్తిగా నిషేధించబడుతుంది.

"నూతన సమాజంలో ప్రజలు మైత్రితో జీవిస్తారు. పరస్పర సహకారము, సహాయముమీద ఆధారపడి జీవితం కొనసాగుతుంది. కనుక దానిలో స్వార్థంకోసం ఘర్షణ లుండవు. ఏ నిర్ణయాలు తీసుకున్నా ఏకగ్రీవంగానే వుంటాయి, గాని అధికసంఖ్యాకుల కిష్టమైన విధంగా వుండదు. సమాజ సంక్షేమము, సమాజ సౌఖ్యము మొదలగు సమస్యలమీద ఒకొక్కప్పుడు నిశితమైన అభిప్రాయ భేదాలు కలుగవచ్చు. దీనికి కారణం స్వార్థంకాదు. ఒక విషయంమీద సామాజిక క్షేమాన్ని సాధించడ మేలాగ అనే దానిమీద భిన్నాభిప్రాయాలు కలుగవచ్చును. అటువంటి సందర్భాలలో ఆ సమస్య ఎంత ప్రధానమైన దయినా వెంటనే నిర్ణయం తీసుకోరు. ఆంతరికంగా సద్భావాన్ని, ఐక్యతనూ కాపాడాలి గదా ? బహు జనాభిప్రాయంతో ఒక వ్యక్తి ఏకీభవించలేడు. తన ధోరణిని మానుకోడానికి మనస్సాక్షి వొప్పుకోదు. అటువంటప్పుడు సత్యాగ్రహంచేసే హక్కు అతనికి వుంటుంది. భిన్నదృక్పథాలు గలవారికి కూడా ఈ హక్కు వుంటుంది.

వ్యక్తి, పౌరస్వాతంత్ర్యాల రక్షణలో సత్యాగ్రహమే చరమ సాధనం.

"ఈ నూతన సమాజం సోషలిస్టు, కమ్యూనిస్టు సమాజాలకు, యితర 'సంక్షేమ' సమాజాలకు భిన్నం. ఏమంటే, ఆ సమాజాలలో అధికారం అంతా పైనున్నవారి చేతులలో వుంటుంది. క్రింది ప్రజలకు అతిస్వల్పంగా వదలుతారు. పాలకముఠా, పార్లమెంటు, అధికారవర్గము చేతులలో అధికారం అంతా వుంటుంది. ప్రజల హక్కుల్లో మిగిలేదల్లా వోటు చేయడమే."

పైన యిచ్చిన వివరణను చూస్తే సర్వోదయ చైతన్యం యొక్క పరిమితులను అర్థం చేసుకోవచ్చు. వారికి శాస్త్రీయ దృక్పథం లోపించింది. తత్ఫలితంగా పరస్పర వచన వ్యాఘాతాలు బోలెడు వస్తున్నాయి. కొంత ముందుకు వెళ్ళేక యీ నూతన సమాజ కల్పనను గురించి వ్రాస్తాను. ప్రస్తుతం యిక్కడ ఒక్కటి చేస్తాను. కమ్యూనిస్టు సమాజంలో రాజ్యాంగయంత్రం అదృశ్యం అవుతుందనీ, దోపిడీ విధానం రద్దు అవుతుందనీ, ప్రతి ఒక్కరూ తమ శక్తికొద్దీ పనిచేసి, అవసరానుగుణంగా అనుభవిస్తారనీ చెప్పబడుతూంది. ఆ సత్యాన్నే సర్వోదయసమాజ గమ్యంగా పేర్కొంటున్నారు. కాని అటువంటి సమాజం ఏర్పడాలంటే కావలసిన భౌతికావసరాల పరిజ్ఞానం వారిలో కనబడ్డంలేదు.

ఈ విధమైన ఆశయాలను వారు ప్రకటించారంటే దానికి కారణం చుట్టూవున్న పెట్టుబడిదారీ సమాజంయొక్క ప్రభావమూ, శాస్త్రీయ సోషలిస్టు భావాల ప్రభావమూనని

చెప్పాలి. అందుచేతనే మార్క్సిజాన్ని నిరాకరించేవారు కూడా దానిలోని కొన్ని గంభీర సత్యాలను స్వీకరించవలసి వస్తూంది.

భూ దా న ం

సర్వోదయ సమాజపథంలో భూదానం మొదటి అడుగు. భారతదేశంలోని సామాజిక వ్యవస్థను మార్చేటందుకు ఏ ప్రయత్నం జరిగినా ముందు భూమి సమస్యవద్ద ప్రారంభించాలి; ప్రధానమైన భూమి సమస్యను భూమి వున్నవాళ్ళకు, లేనివాళ్ళకు లభించేటట్లుగా పరిష్కరిస్తే తప్ప భారతదేశంలో ఆర్థిక జీవితాన్ని పునర్వ్యవస్థీకరించలేము. దేశంలోని స్త్రీ పురుషు లందరకూ మంచి జీవనం కల్పించగలిగేటట్టుగా పారిశ్రామికాభివృద్ధి జరగదు. అటువంటి భూసమస్య వినోబాజీ దృష్టినాకర్షించడంలో తప్పేంలేదు. ఆయన గ్రామీణ బీదప్రజలమధ్య జీవించేరు. జీవితం పొడుగునా భారతదేశ పల్లెటూళ్ళలో పడి సంచారం సాగిస్తున్నారు. అటువంటి వ్యక్తి యీనాడున్న భూమిపంపక పద్ధతిలోని అన్యాయాన్నీ, అసమానతనూ చూడకుండా వుండలేరు. భూసమస్య ప్రాధాన్యతను గుర్తించకుండా వుండలేరు. తక్షణ భూసంస్కరణాలను అభివృద్ధికర పార్టీలన్నీ తమ కార్యక్రమంలో భాగంగా చేసుకొన్నాయి. వినోబాజీ, ఆయన అనుచరులూ కూడ ఆ సమస్యకే ప్రాముఖ్యం యిచ్చేరంటే అందులో విశేషంలేదు. కాని, దానికి వారొక కొత్త పరిష్కారమార్గం కనుగొన్నామంటారు.

మొత్తంమీద వారు భూసమస్యా పరిష్కారంతో అన్నీ చక్కబడతాయనే అభిప్రాయంలో వున్నారు. దానికే అత్యధిక ప్రాముఖ్యం యిస్తున్నారు. తరచు యితర ఉత్పత్తి సాధనాలను గురించికూడా మాట్లాడుతూనే వున్నారు. అయినా భవిష్యత్తులో దేశం పునరుజ్జీవనం పొందాలన్నా, సర్వోదయ సమాజం యేర్పడాలన్నా కీలకం భూసమస్య అని భావిస్తున్నారు. దానికోసమే తమ ఆలోచనలన్నీ వినియోగిస్తున్నారు. దానిని చూస్తే మన దేశం ఆర్థికంగా వెనకబడి యున్నదనే దానిమీద తమ ఆలోచనలను లగ్నంచేస్తున్నారని గ్రహించగలం. ఉత్పత్తి విధానంఅంతా పెట్టుబడిదారీవర్గం యొక్క స్వాధీనంలోకి వచ్చివుండని సమాజంలో మాత్రమే భూమి కంత ప్రాముఖ్యం యివ్వడం జరుగుతుంది.

భూదానంయొక్క మహాత్మ్యాన్ని గురించీ, దానికి తాము అనుసరిస్తున్న పద్ధతులను గురించీ వినోబాజీ, ఆయన అనుచరులూ అతిశయోక్తిగా మాట్లాడుతున్నారు. ఈ దిగున ఆలోచనలు గమనించండి :

"మీరు చేసిన పని ప్రపంచమంతటా శాంతి స్థాపనకు తోడ్పడగలదని భావిస్తున్నారు. భూమిని దానం చేయడం శాంతికి వోటుచెయ్యడమేనని నేను కొంతకాలంగా చెప్తున్నాను. కాని పాశ్చాత్య విజ్ఞాన పండితులు యీవిషయంలో కళ్ళుమూసుకొని వుంటున్నారు. ఒక అణువులోనో, పరమాణువులోనో నిబిడీకృతమై వున్న శక్తిని గురించి వారు పరవశులైపోతారు. కాని మనుష్యునిలో దాగివున్న శక్తి వాళ్ళ కక్కర్లేదు. గ్రామదానం మనుష్యునిలోవున్న శక్తికి

ప్రతిబింబం. దౌర్జన్యయుత ప్రపంచంలో అణు-హైడ్రోజన్ బాంబుల కెంత ప్రాముఖ్యం వుందో, శాంతియుత ప్రపంచంలో గ్రామదానానికి అంత ప్రాధాన్యంవుంది."

(పై పుస్తకంలోనే, పుట 130)

వినోబాజీ కోరిన పద్ధతిలోనే భారతదేశంలో భూసమస్య పరిష్కారం అయినా, దానివలన ప్రపంచ రాజకీయాలలో మార్పురాదు. ప్రపంచశాంతి ఏర్పడదు. ఈ విషయం ఎవరి కైనా తెలుస్తుంది.

భౌతికమైన ఆర్థిక సమస్యను ఆధ్యాత్మిక విషయంగా వినోబాజీ మార్చేరు. అందుచేతనే ఈ అసహజమైన ఫల శ్రుతి. ఈ సమస్యను పరిష్కరించేటందుకు తనను ఒక పని ముట్టుగా భగవంతుడు ఎంచుకొన్నాడని ఆయన చెప్తారు.

"తమకున్న భూములను ఇచ్చెయ్యమని నేను ప్రజల నడుగుతాను. నేను బ్రాహ్మణుణ్ణి. కనుక ప్రతిగ్రహాధికారం నాకుంది. కాని నేను యాచించడంలేదు...తమ అదనపు సంపదను ఇచ్చెయ్యడం ధర్మ విహితమైన పనియని ప్రజలకు చెప్తాను. బుద్ధునితో ప్రారంభమైన తన కర్తవ్యాన్ని, బల హీనుడనైనా నా ద్వారా కొనసాగించాలని భగవంతుడు నిశ్చయించి, నన్ను వుపయోగిస్తున్నాడని నా నమ్మకం."

(అదే పుస్తకం, పుట 73. దిగువ గీతలు నావి.)

అసలు భూదాన భావనే దైవవాక్కులాగ ఆయనకు తోచింది. 1950 లో ఆయన తెలంగాణాలో పర్యటించారు. ఆనాటి కింకా అక్కడి రైతాంగం భూమికోసం పోరాటాలు

జరుపుతున్నారు. ఒక వూళ్లో హరిజనులు తమకు భూమి కావాలని ఆయనను అడిగారు. వినోబాజీని చూడవచ్చిన వారెవరో భూమి నిస్తామన్నారు. భూమిలేనివారి సమస్యను అహింసా మార్గంలో పరిష్కరించడ మెల్లాగని వెతుకులాడు తున్న వినోబాజీకి ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు.

"హరిజనులు ఎనభయి ఎకరాలు కావాలని అడగడం మాత్రంతో నూరెకరాల దానం లభించింది. ఇదేదో సామాన్య ఘటనమాత్రమేనా, లేక దీని వెనుక ఏదన్నా సందేశం దాగివున్నదాయని నేను అబ్బురపడ్డాను. మనుష్యుడు స్వబుద్ధితో ఏ పనీ చెయ్యడని నేనెరుగుదును. పరిసర ప్రపంచం అతని నా పనికి ప్రేరేపిస్తుంది. ఆ దాత ఎవరో కేవలం నిమిత్త మాత్రుడని అనిపించింది. విశ్వవ్యాప్తమైన శక్తి ఏదో వుంది అనిపించింది. ఈ ప్రకృతియంతా పరమాత్ముని సృష్టికదా అనుకున్నా. ప్రకృతిలో పక్షపాతం వుండదని నాకు నేనే చెప్పుకొన్నాను... వెంటనే తోచింది. విశ్వవ్యాప్తమైన ఆ శక్తి ఏదో కొత్తపని చేయించదలచుకొన్న దనిపించింది..."

(అదే పుస్తకం, పుటలు 47-48)

భూదానం అనే భావన విశ్వవ్యాప్త శక్తివలన కలిగిందట! తన ఆంతరిక రహస్యాలను తెలియచెప్పేటంత విశ్వాసం ఆ శక్తికి భారతదేశంమీద వుంది కాబోలు. భారతదేశం దేవభూమి, వినోబాజీ దేవదూత! విశ్వవ్యాప్తశక్తి ఏదో ఈ జ్ఞానోదయాన్ని కలిగించిందంటే, ఆలోచనగలవారెవరైనా నమ్మగలరా?

కాని వినోబాజీ భూదానోద్యమానికి ప్రేరణా, సిద్ధాంతమూ కూడ అదే. అదే కాకపోతే వినోబాజీ, ఆయన శిష్యులూ గత చరిత్ర అనుభవాలన్నింటినీ త్రోసిపుచ్చి, తమ పరిష్కార మార్గాన్ని ఈ విధంగా పిడివాద పద్ధతులలో ప్రచారం చేయలేరు. జ్ఞానోదయమయిందనీ, విశ్వాత్మకశక్తి ఏదో ప్రేరేపిస్తూందనీ భావించే వ్యక్తిగత చారిత్రక సామాజిక పాఠాలను గణనలోకి ఎందుకుతీసుకొంటారు? జ్ఞానోదయ మయిందని వినోబాజీ మనస్ఫూర్తిగానే నమ్ముతున్నారు. ఏది ఏమయినా భూమిలేనివారికి ఏదో చేయాలనే అభిలాష ఆయనకు వుంది. ఘర్షణ అనేది కూడదనేది కూడా వుంది. ఈ విధంగా ఆలోచిస్తున్నప్పుడు భూదానంద్వారా సమస్యను పరిష్కరించవచ్చుననేది దైవ ప్రేరితంగా తోచడంలో ఆశ్చర్యంలేదు. ఆ విధంగా భూమినిస్తానన్న వ్యక్తి దైవనిర్ణయానికి సాధన మాత్రుడుగానూ తోచవచ్చు.

## భూమిలేని వ్యవసాయ కార్మికులు

భూదానోద్యమానికి మూలం అది. ఆధ్యాత్మిక ప్రేరణ అనేది కేవలం ఊహానిర్మితమే అయినా వినోబాజీ భూదానోద్యమం భౌతిక ప్రపంచంలోని ఒక లోపాన్ని ప్రతిబింబిస్తూంది. భూమి పంపకంలోవున్న అవ్యవస్థనూ, భూమిలేని వారి దురదృష్టాన్నీ గురించి ఆయనా ఆయన శిష్యులూ ఎంతో బాధను వ్యక్తీకరిస్తూ మాట్లాడుతారు. తెలంగాణాలో పర్యటించేటప్పుడు ఒక వూళ్లో 90 కుటుంబాలకు 3,000 ఎకరాల భూమి వున్నదనీ, 600 కుటుంబాలకు ఏమీ

భూమి లేదనీ వినోబాజీ గమనించేరు. ప్రజలను దోచుకొని నిరాశ్రయుల్ని చేయడమనేది బ్రిటిష్‌వాళ్ళనాటినుంచీ అన వచ్చిన్నంగా జరిగిపోతూంది. గ్రామాలలో భూమి ఏమా త్రమూ లేని నిరుపేదలు కుప్పతిప్పలుగా తయారయ్యేరు. దేశం మొత్తం జనాభాలో భూమిలేని వ్యవసాయ కార్మికులు 15.2 శాతం వున్నారు. బీహారు జనాభాలో 14.3 మంది వ్యవసాయ కార్మికులు; ఒరిస్సాలో 19.2 మంది; మద్రాసులో 24.7 మంది; తిరువాంకూర్ – కొచ్చిన్‌లో 18.7 మంది; హైద్రాబాద్‌లో 22.6 మంది. ఇల్లాగే...

వినోబాజీ భూమిలేని వ్యవసాయ కార్మికుల విషయమై ఆలోచిస్తున్నారు. కాని, భూస్వామిని ప్రతిఘటించవలసిన రైతును గురించి ఏమీ మాట్లాడకపోవడం గమనించవలసి వుంది

"నేను కార్మికుని గురించి ఎత్తుకున్నాను. బలహీనుల, భూమిలేని నోరులేని వారల వృత్తాంతం ఇది...మన వ్యవసాయ కార్మికులకు ఒక సంస్థ, నిర్మాణం అంటూ లేదు. వారిలో చైతన్యంలేదు. వారికి చదువులేదు. ఒక్క వ్యవసాయంతప్ప వారికి మరోవృత్తి తెలియదు. వారు సాగుచేసే భూములయినా వారివి కావు. సమాజంలో ఈ కార్మికుల స్థానం అట్టడుగున వుంది. వర్గాలన్నింటిలోకీ అతి మెత్తనివాళ్లు. వాళ్ళ ప్రయోజ నాలకై నేను పనిచేస్తున్నాను..."

(అదే పుస్తకం, పుట 72)

1952 జూలై 1 న జమీందారీ రద్దు దినోత్సవాలు జరిగేయి. వానిని ఉద్దేశించి ఆయన ఇల్లా అన్నారు :

"మీలో కొందరు ఉత్సవాలు చేసుకొని వుంటారు. కాని, నేనే వుత్సవం జరపను? జమీందారీల రద్దువలన ఆ భూములు చేసుకొనేవారికి భూములు లభించేయి. గతంలో ఆ భూములకు వారు యజమానులు కారు. ఇప్పు డయ్యేరు. పెద్ద జమీందార్ల చేతులనుంచి రైతుల చేతుల్లోకి భూములు వచ్చేయి. మంచిదే. కాని సర్వవిధాలా అస్పృశ్యులుగా భావించబడే భూములు లేనివారి మాటేమిటి? ఈ దరిద్ర నారాయణులకు మనం ఏమన్నా చేయగలిగిననాడే మనకు సంతోషం..."

(అదే పుస్తకం, పుట 77)

భూస్వామ్య యుగ ఆస్తి సంబంధాలలో రైతు ప్రజా సామాన్యంయొక్క సమస్యను గురించి వినోబాజీ చెప్పారు. భూమిలేని కార్మికులు భూమి కావాలనడాన్ని ఆయన ప్రత్యేకంగా ఒత్తి చెపుతున్నారు. భూస్వామ్యయుగపు ఆస్తి సంబంధాలను రద్దుపరచి, గరిష్ట పరిమితిపెట్టి, అదనపుభూమిని పంచిపెట్టేందుకు జరిగే విస్తృత పోరాటంలో భూమిలేని వ్యవసాయ కార్మికుల సమస్య ఒక భాగం మాత్రమే. కాని, వినోబాజీ పంథా అదికాదు.

వ్యవసాయ కార్మికుల బాధలు చూస్తూండడంవల్లనే ఆయన వారికోరికలయెడ అంత శ్రద్ధ చూపుతున్నారనుకో కూడదు. దేశంలో ఇంచుమించు అన్ని ప్రాంతాలలోనూ భూములు లేని వారిలో అత్యధిక సంఖ్యాకులు అస్పృశ్యులే. గాంధీ మహాత్ముని లాగనే వినోబాజీ కూడ వారి విషయంలో శ్రద్ధ తీసుకున్నారు. భూములులేని అస్పృశ్యులకు భూముల

నివ్వడమూ, అవి వారికి దక్కేటట్లు చేయడమూ జరిగితే, గ్రామాలలో అస్పృశ్యతకు గట్టిదెబ్బ తగులుతుంది. భారత దేశంలోవున్న పరిస్థితులలో భూమిలేనివారు భూమికోసం సాగించే పోరాటానికీ, అస్పృశ్యతా వ్యతిరేక పోరాటానికీ సంబంధం తప్పకుండా వుంది.

భూమిలేనివారికి భూమినివ్వడంలో వుండే ప్రాముఖ్యతను దీనినిబట్టి అర్థం చేసుకోగలం. అయితే భూదానం ఆ పనిని సాధించగలదా ? భూదానోద్యమానికి వెనుకనున్న రాజకీయాలివి: "తెలంగాణాలో కమ్యూనిస్టుల తొందర వున్నది గనుక అక్కడ భూమి లభ్యమయిందంటూరా, భారత దేశంలో దౌర్జన్యరహిత విప్లవం తెస్తామనేమాట కట్టిపెట్ట వచ్చును. ఈ యజ్ఞానికి వెనుకనున్న ప్రధాన సూత్రాన్ని అర్థం చేసుకొంటే, ధనికులు బీదలయెడ మర్యాదగా వ్యవహరిస్తారు. నా చేతికి భూమినిస్తారు. ఇదే జరిగితే అహింసాయుత విప్లవానికి అమిత ప్రోత్సాహం లభిస్తుంది." ఈ విధంగా రైతాంగంయొక్క పోరాటాలకు భూదానం ప్రత్యామ్నాయం మాత్రమే. భవిష్యత్తును గమనించి, ముందే రైతులకు కొంత భూమి నిచ్చివెయ్యమని అది విజ్ఞప్తి చేస్తోంది.

భూ దా న వి ధా న ం

రైతు వుద్యమం, రైతు పోరాటాలు రాకుండా చేయడానికై ప్రజలకు విజ్ఞప్తిచేసి, భూదానాలు పోగుచేయడమే మందు అని వీరి అభిప్రాయం.

"కానైతే నా పొట్ట చిన్నదే. కాని, దరిద్ర నారాయణుని పొట్ట చాలా పెద్దది. ఏమిటయ్యా నువ్వడిగేదంటే,

నా సమాధానం ఇది : "ఐదుకోట్ల ఎకరాలభూమి". భూమి అంటే వ్యవసాయానికి పనికివచ్చేదని నా అభిప్రాయం. ఇంట్లో అయిదుగురు కొడుకులుంటే నేను ఆరోవాడిననుకోండి; నలుగురుంటే అయిదో వాడిననుకోండి. ఆ రూపంలో దేశంలో వున్న మొత్తం సాగుకాదగిన భూమిలో ఆరోవంతో అయిదోవంతో నాకిమ్మంటున్నా."

(భూదానయజ్ఞ: పుట 15.)

"నా లక్ష్యం అయిదుకోట్ల ఎకరాలు. మన దేశంలో వ్యవసాయానికి పనికివచ్చే భూమి ముప్ఫయికోట్ల ఎకరాలుంది. దేశంలో కుటుంబానికి సగటున అయిదుగురు సభ్యులున్నారనుకొందాం. భూమిలేని బీదవానిని కుటుంబంలో ఆరవవానిగా తీసుకొని, అందరూ తమ భూమిలో ఆరోవంతును ఇస్తారనే నా అభిప్రాయం. దేశంలో శాంతియుత విప్లవం తీసుకొచ్చేటందుకిదొకమార్గం."

ప్రతి కుటుంబమూ - దానికున్న దొక్క ఎకరంగానీ వేల ఎకరాలుగానీ సమానంగా ఆరోవంతు భూమినివ్వాలనే అభిప్రాయాన్ని గమనించాలి. వినోబాజీ అభిప్రాయాలు ఈ ధోరణిలోనే వుంటాయి. తమ కొద్దిపాటి ఆస్తుల్ని విడిచి పెట్టడానికి బీదవాళ్ళు ఇష్టపడరు గనక ధనం గలవాళ్ళు తమ సంపదను వదలడంలేదని ఆయన చెప్తారు.

"ఆస్తి (పెద్ద) వంతుల్ని ద్వేషించే వారే తమకు ఆస్తి కావాలనుకుంటారు. చిన్న ఆస్తిపరులు తమ ఆస్తుల్ని వదులుకోడానికి సిద్ధంగా లేరు. కనుక పెద్ద ఆస్తిపరులుకూడ తమ ఆస్తిని వొదులుకోవడంలేదు. చిన్న ఆస్తిపరులు పెద్దవాళ్ళని

అసహ్యించుకొంటున్నారేగాని ఆస్తిమీద తమకున్న హక్కును వదులుకోడానికి సిద్ధంగాలేరు. ఫలితంగా పెద్ద ఆస్తిపరులు తమ ఆస్తుల్ని అంటిపెట్టుకు కూర్చుంటున్నారు. ఒకడు తన లంగోటి వదలనంటే, మరొకడు ధోతీని విడువడానికి యిష్టపడడం లేదు. ఒకడు తన భవనంగురించి ఆలోచిస్తూంటే, వేరొకడు గుడిసెను గురించి ఆలోచిస్తున్నాడు. అందుకే చిన్న ఆస్తిపరులు ఆస్తిపై తమకున్న మమకారాన్ని వదలాలని మేము చెప్తున్నాం; అప్పుడే పెద్ద ఆస్తిపరులు ఆస్తిమీద ఆశ వదలుకుంటారు."

(సర్వోదయాచే ఆధార్ [సంగాంధీ] పుట 3)

పెద్ద భూస్వామికన్న చిన్న పట్టాదారు ఎక్కువ నేరస్థుడు, వేయెకరాలనూ ఆపోశనపట్టి కూర్చున్నవానికన్న తన ఎకరాన్ని ప్రాణపదంగా చూసుకొనే బీదరైతు కడుపు మాడుతున్నా నేరస్థుడే. బీదరైతే పెద్ద ఆస్తిపరుడికి మార్గదర్శికావాలి.

బీదలనుంచీ, ధనికులనుంచీ తీసుకొన్న దానభూములు అద్భుతాలను నిర్వర్తిస్తాయని చెప్పేరు. "ఎవరితిన్నవారు ధారాళంగానూ, వెంటనేనూ తమ భూముల్ని ఇచ్చివేయడం జరిగితే నిమేష మాత్రంలో అసలు వాతావరణమే పూర్తిగా మారిపోతుంది. భారతదేశం యావత్ప్రపంచానికీ స్వేచ్ఛ, ప్రేమ, సుఖమయమయిన నవయుగోదయాన్ని చూపగలదు."

(భూదానయజ్ఞ, పుట 16)

భూదానోద్యమాన్ని ప్రచారం చేయడంలో వినోబాజీ భూమిమీద వ్యక్తిగత ఆస్తిహక్కు వుండరాదని ధైర్యంగా

చెప్పేరు. "భూమి యావత్తూ భగవానుడిదేనన్న సూత్రాన్ని ప్రజలు అంగీకరించాలి. యావత్తు భూమిమీదా సమాజం యొక్క స్వత్వం ఏర్పడితే ఈనాడున్న అసంతృప్తి తొలగు తుంది. దాని స్థానే ప్రేమ సహకారాలు నెలకొంటాయి."

(అదేపుస్తకం, పుట 19)

ప్రజల్ని – ధనికుల్నీ బీదల్నీకూడ – తమ భూమి హక్కు వొదులుకొనేటట్లు వొప్పించేందుకై ఆయన నిరంతరాయంగా ఈ భూమి దేవునిదనీ, దానిమీద పట్టాహక్కు ఎవరికీ వుండ రాదనీ చెపుతున్నారు. కాని, దేవుని ఆస్తి హక్కును స్థిర పరిచేటందుకు, ఆయన చట్టం చేయించేటందు కొప్పుకోరు. భూమిమీద తమకు కూడా వున్న హక్కును స్థాపించుకొన రమ్మని శ్రమజీవులయిన ప్రజల్ని పిలవరు. పైగా ఈ దేవుని ఆస్తి హక్కును నెలకొల్పడానికై భూస్వాములకు నష్టపరి హారంకూడా ఇమ్మంటారు.

"భూమిని తీసుకుంటే ప్రతిఫలం ఇవ్వాలని ఈనాటి చట్టం చెబుతూంది. ఈనాటి పరిస్థితులలో ఇవ్వవలసిందేమరి. ఏది ఏమయినా జాగీర్దార్లూ, పెద్ద భూస్వాములు, జమీం దార్లూ మన సోదరులేకదా! వారి యోగక్షేమాలను మాత్రం మనం మరువవచ్చునా? అందుచేతనే ప్రతిఫలం ఇవ్వడం అనేది అహింసా సూత్రాలకు విరుద్ధమేంకాదు. కాని ప్రతిఫలాన్ని పూర్తిగా ఇవ్వనూకూడదు. పూర్తిగా పుచ్చు కోనూకూడదు. తమకు ఎంత కావాలో అంతమాత్రమేపుచ్చు కోవాలని పెద్దభూస్వాములకు చెప్పగలననుకొంటున్నాను."

(అదే పుస్తకం, పుట 28)

దోపిడిగాళ్ళ అన్యాయార్జితాలను కాపాడేటందుకు అహింసా సూత్రాన్ని వల్లించడం ఇదే మొదలుకాదు.

ప్రస్తుతం వున్న చట్టాల ప్రకారం భూస్వాములు లాభం సంపాదించడానికి వినోబాజీ సుముఖులే. దానిని రైతుల ప్రయోజనాలకు అనుగుణంగా మార్పించడానికి ఆయన విముఖులు. ఒక పత్రికా విలేఖరి, "రాజ్యాంగ చట్టాన్ని మార్చకూడదా ?" అని అడిగాడు. దానికాయన సమాధానం: "అది చెయ్యాలంటే జమీందార్ల నైతిక ప్రోద్బలం వుండాలి. చట్టాన్ని ప్రజలమీద రుద్దకూడదు. ప్రతి ఒక్కరూ, భూస్వాములతో సహా అందరూ దానిని ఆమోదించాలి."

(అదే పుస్తకం, పుట. 21)

ప్రతిఫలం ఇవ్వడం గురించి రాజ్యాంగంలో పొందుపరచిన క్లాజును, ఆ ప్రతిఫలం యిచ్చుకోవలసిన రైతుల సమ్మతి ప్రకారమే చేర్చినట్లు అనుకోవాలి కాబోలు !

ప్రచారం ఫలితాలు

ఈ పవిత్ర వుద్యమం ఏ విధంగా సఫలం అయింది ? 1957 సంవత్సరాంతానికి వినోబాజీ 5 కోట్ల ఎకరాలు సంపాదించాలనుకొన్నారు. పెద్ద పెద్ద విరాళాలను ప్రకటించినా, అనుకున్న దాంట్లో పదోవంతుకూడా సమకూడినట్లు తోచదు. ఆయన పదయాత్రలకు పత్రికలలో విపరీతంగా ప్రచారం జరిగింది. ప్రభుత్వంలోఉన్న పార్టీ ఆయనను బలపరచింది. ఆయనకు ఎంత ధనం కావాలంటే అంతధనం అందుబాటులో వుంది. అయినా అనుకున్న నాటికి రమారమిగానైనా అను

కున్నంత భూమి సమకూడలేదు. 1957 ఆఖరునాటికి భూమి విప్లవాన్ని సాధించాలన్న పథకం విఫలమయింది.

దొరికిన భూమి అయినా చాలభాగం వ్యవసాయానికి పనికిరానిదీ, పేచీలలో వున్నదీ, ఇచ్చిన వాళ్ళకి హక్కు లేని దీను.

భూమి లేనివారికోసం వినోబాజీ ఒక వేపున భూములు పోగుచేస్తూంటే, పై వర్గాలవారు రైతాంగాన్ని భూములనుంచి బేదఖల్ చేసి, మరింతమందికి భూమిలేకుండా చేస్తున్నారు. కష్టపడి వినోబాజీ సంపాదించినదానికన్న ఎక్కువ భూమినే భూస్వాములు లాక్కున్నారు. కొద్ది రాష్ట్రాలను తీసుకొంటే చాలు. హైద్రాబాద్ రాష్ట్రంలో రక్షిత కౌలుదార్లలో 40 శాతం మందినీ, బొంబాయిరాష్ట్రంలో 57 శాతం మందినీ ఈ కాలంలోనే వాళ్ళ భూములనుంచి బేదఖల్ చేశారు. హైద్రాబాద్‌లో 40 శాతం భూమీ, బొంబాయిరాష్ట్రంలో 58 శాతం భూమీ ఈ విధంగా లాక్కున్నారు. ఆంధ్రలో అంతకంటె ఎక్కువే లాక్కున్నారు. ద్వితీయ ప్రణాళికా రచయితలు ఈ విషయంలో ఇల్లా వ్రాయవలసి వచ్చిందికూడా :- "గడచిన కొద్ది ఏళ్ళలో కొన్ని రాష్ట్రాలలో పెద్ద యెత్తున రైతుల్ని భూములనుంచి బేదఖల్ చేసేరు. పెద్దఎత్తున కౌలు భూములు 'వదలుకు పోవడం' జరిగింది." వినోబాజీ భూదానోద్యమం ముమ్మరంగా సాగుతున్నప్పుడే ఇది జరిగింది.

ఈ విధంగా, వినోబాజీకీ, ఆయన అనుచరులకు చరిత్ర అనుకూలించలేదు.

అయితే వినోబాజీ కి వేవీ తెలియకపోలేదు. బేదఖలీలకు ఆయన మనస్సు క్షోభించింది. సత్యాగ్రహం ప్రారంభిస్తానని బెదిరించేరుకూడా.

"బేదఖలీలవలన ఏర్పడిన తీవ్రపరిస్థితులను మీా దృష్టికి తేదలిచాను. భూస్వాముల దగ్గరకు వెళ్ళి, వారి తప్పులు చూపించి, భూదానాలు తీసుకొని, బేదఖల్ అయినవారికి పునరావాసం కల్పించడం మన వుద్యమంలో ఒక అంశంగా చేసేం. భూస్వాములు కనుక వినకపోతే, ఏమయినాసరే భూములు వదలవద్దని రైతులకు చెప్పవలసివస్తుంది. దీనివలన ప్రజలకుబాధలు కలుగవచ్చు. అందుచేత ఈసమస్యను భూదానోద్యమంలో భాగంగా తీసుకొని పనిచెయ్యమని కాంగ్రెసును కోరుతున్నాను.

(వినోబా, ఆయన ఆదర్శం, పుట 128-129.)

వినోబాజీ ఎప్పుడూ ఇల్లా మాట్లాడలేదు: ఏమయినా సరే భూములు వదలవద్దని ఆయన రైతులకు చెప్పేవుంటే లక్షలమంది బేదఖల్ కాకుండేవారు. వారికి భూములు మిగిలేవి. ఆ జనం అంతా ఎంతో భక్తి ప్రపత్తులతో ఆయన ప్రారంభించిన వుద్యమానికి భూముల నిచ్చేవారు. కాని, ఆయన ఆ పిలుపు నివ్వలేదు. ఆ మాట ఏదో పొరపాటున, నోరుజారి అన్నట్లే వుండిపోయింది

దీనితోపాటే భూదానంద్వారా దేశంలో శాంతిని స్థాపించగలమన్న ఆశకూడా వట్టిదయిపోయింది. ఒకవైపున భూదానోద్యమం బ్రహ్మాండంగా విజయం పొందుతున్నట్లు పత్రికలు వ్రాస్తూనే వున్నాయి. రెండోవేపున ప్రభుత్వానికి

ప్రజలకూ మధ్య తీవ్రమైన ఘర్షణలు సాగుతున్నాయి. పోలీసులు మూకవుమ్మడిగా జనాన్ని కాల్చిచంపుతున్నారు. కాంగ్రెసు ప్రభుత్వాలకు వ్యతిరేకంగా సాగుతూన్న తీవ్ర సామాజిక పోరాటాల ప్రభావం భూదాన కార్యకర్తలకు కూడా సోకకపోలేదు ఒక దశలో వినోబాజీయే ఇల్లా అన్నారు :

"భూదానం ద్వారా శాంతిని నెలకొల్పగలనని ఆశించేను. దేశంలో వైషమ్యాలు ఎంతలోతుగా వున్నాయో రెండేళ్ళక్రితం నేనూహించనేలేకపోయేను. భూదానోద్యమానికి ఎక్కువ భూమి లభించిన బీహార్‌లో కల్లోలాలు జరుగుతున్నాయి. వందలకొద్దీ గ్రామాలు దానంగా లభించిన ఒరిస్సాలో బహిరంగసభలలో కాల్పులు జరుగుతున్నాయి... భూదానోద్యమ ప్రభావం పల్లెలకేగాని, పట్టణాలకు పాకలేదని నే ననుకొంటున్నాను. నరనరాల జీర్ణించిన దార్జన్య ధోరణులు విద్యార్థి ఆందోళనల, కార్మిక తగాదాల రూపంలో బయటపడడానికి భాషారాష్ట్ర విభజన నిమిత్త మాత్రం అయింది"

(అదే పుస్తకం. పుట 150)

తాను తయారుచేసిన ఆధ్యాత్మిక చట్రంలో సామాజిక పరిణామాలు యిమడనప్పుడు వినోబాజీ ఓరిమిని కోల్పోతారు. తన విధానాలను సమాలోచించుకొనడానికి బదులు ప్రజలను నిందిస్తారు. ప్రజల్ని కాల్చి చంపుతున్న ప్రభుత్వాన్ని గురించి ఒక్కమాట అనరు. సాధారణంగా భావవిహారులంతా అంతే. తాము వర్గాలన్నింటికీ అతీతుల

మనుకుంటారు. పీడించేవారినీ, పీడించబడేవారినీ ఒకేగాట కట్టేస్తారు.

## వైఫల్యానికి కారణాలు

ప్రపంచాన్ని మార్చివేయగలమని అంత ఆశలు ప్రకటించిన భూదానోద్యమ ఫలితాలు చాలకొద్దిపాటివి. తప్పదు. సామాజిక పోరాటాల మూలసూత్రాలను విస్మరించి, ఆర్థిక సత్యాలను, దాని మూలంగా బయలుదేరిన ఘర్షణలను పక్కకు నెట్టి, సామాజికములయిన మార్పు తేవో తీసుకురాగలమనుకోవడం పొరపాటు. అల్లా జరగదు. భూమిలేనివారికి భూమిని పంచిపెట్టడం అనేది ఈనాడు చాల ముఖ్యమైన పనే. సందేహంలేదు, కాని, మన దేశంలోని భూమి స్వత్వ విధానాన్ని మార్చేటందుకూ. భూస్వామ్యయుగ సంబంధాలను పూర్తిగా మార్చి భూసంబంధాలను ప్రజాతంత్రయుతమైన, న్యాయమైన విధంగా ఏర్పరచేటందుకు జరిపే పోరాటంలో అదొకభాగం మాత్రమేనని భూదానోద్యమం గుర్తించలేదు. అదొక్క భూమిలేనివారి సమస్య కాదు. పల్లెటూళ్ళలో వుంటున్న అసంఖ్యాక ప్రజాకోటికి, బీద రైతులకు సంబంధించిన సమస్య అది. ఈ దృష్టితో చూస్తే అది భూమి విప్లవం తెచ్చేటందుకు సరియైన విధానంకాదు. భూమిలేని వారి ఇబ్బందుల్ని తొలగించేటందుకు ఈ ప్రయత్నాలు అభినందనీయాలే. హృదయపూర్వకమైనవే. కొంత సహాయకారే కావచ్చు. కాని అవి పూర్తిగా సమాజంలో మార్పును తీసుకురాలేవు.

భూదాన విధానంలోనే గొప్పలోపం వుంది. అహింస పేరుతో వినోబాజీ ఆస్తివిహీనులను ఏ విధమైన పోరాటాలూ చేయరాదని బోధించారు. వర్గపోరాటం అంటే ఆయనకు పీడకల. దానిని కమ్యూనిస్టులే కల్పించేరని ఆయన భావన కావచ్చు ప్రేమ పేరుతో దోపిడిగాండ్రను అణచడానికై చట్ట సహాయం తీసుకోరాదంటారు. భూమిని పంచేటందుకు చట్టం చేస్తే సరిపడుతుంది కదాయని ఒక శ్రోత అడిగితే ఆయన ఇల్లా అన్నారు :

"అహింస చట్టాలక్కర్లేదనదు. కాని ఆ చట్టాలను ప్రజాభిప్రాయం బలపరచాలి. కొంతమంది దానిని వ్యతిరేకిస్తే ఫర్వాలేదు." దీనినిబట్టి చూస్తే భూమి పంపకచట్టం వెంటనే చెయ్యవచ్చుననిపిస్తుంది. కాని వెనువెంటనే ఆయన వివరణ నిచ్చేరు : "ప్రస్తుతం వున్న వ్యవస్థ సరిగాలేదని అందరి మనస్సులకీ అనిపిస్తే, అందరి మనస్సులూ దయానిలయ మయితే, పరిస్థితుల నందరూ సరిగ్గా అర్థం చేసుకొంటే అప్పుడు చట్టం తీసుకురావచ్చును."

[ భూదానయజ్ఞ, పుట 26–27 ]

దీని అర్థం ఒక్కటే. స్వార్థప్రయోజనపరులను ఒప్పించండి. తర్వాత చట్టం చేయండి.

ఏదో విధమైన ఒత్తిడి తీసుకురావలసి వుంటుందని ఒకొక్కప్పుడు వినోబాజీకి అనిపిస్తూంటుంది :

"మనుష్యునిలో వున్న భగవదంశ ఏదో ఒకనాడు తల ఎత్తక మానదనీ, అదే మానవుణ్ని సరియైన మార్గంలోకి తెస్తుందనీ మన ప్రథమ విశ్వాసం. తరువాత తప్పనిసరిగా

ఇచ్చితీరేటట్లు చైతన్యం కలిగించేటందుకు మనం ప్రయత్ని స్తున్నాం ... ప్రజలలో చైతన్యం మాత్రమే కలిగి, నైతిక ఉద్బోధ కలగకపోతే అది దౌర్జన్యానికి దారితీస్తుంది. అలా గాక కేవలం నైతిక ఉద్బోధ మాత్రమే కలిగించాలంటే, మన గమ్యాన్ని చేరుకొనేటందుకు చాలకాలం పడుతుంది."

[ వినోబా, ఆయన ఆదర్శం. పుట 223 ]

వ్యతిరేకతామూలక సత్యాగ్రహాన్ని త్రోసిపుచ్చడం పేరుతో ఆయన ఉన్నత సర్గాలమీద ప్రేమ తప్ప మరేవిధమైన ఒత్తిడి తీసుకురావడానికీ యిష్టపడడంలేదు. మానవుని మంచితనం, ప్రేమమీద మాత్రమే ఆధారపడాలనడం, మనుష్యునిలో భగవదంశను జాగరితం చేయగలమనే అచంచల విశ్వాసము యివి భూమికోసం రైతులూ, భూములు లేని వారూ జరుపుతున్న వుద్యమాన్ని నిర్వీర్యం చేస్తాయి; ఒక నిర్మాణయుతమైన వుద్యమాన్ని చెదరకొట్టిస్తాయి. ఆ వుద్యమానికి గల పోరాట స్వభావాన్ని తొలగిస్తాయి. అంతే వానివలన కలిగే ఫలితం.

భూదానోద్యమం ద్వారా పట్టణాలలోనూ, ఇతర త్రానూ వున్న జనానికి భూసమస్య గురించి తెలిసివచ్చిందని చాలమంది నమ్ముతారు. వినోబాజీ వ్యక్తిత్వమూ, భూమి లేనివారి తరఫున అవిరామంగా ఆయనచేసే ఉద్బోధ, త్రికరణ శుద్ధిగా పనిచేస్తున్న ఆయన అనుచరుల ఫలాపేక్షా రహితమైన కార్యక్రమమూ – ఇవి ఈ సమస్యను పట్టణ ప్రజలదృష్టికి తేవడంలో తోడ్పడ్డాయి. సందేహంలేదు; కాని, అంత మాత్రంచేత అవి భూమిలేనివారికీ, రైతాంగానికీ ఆత్మ

విశ్వాసం కలిగించేయనీ, న్యాయం సంపాదించేటందుకై నిర్మాణయుతులు కావలసిందని చెప్పి సరియైన చైతన్యం కలిగించేయనీ చెప్పలేము.

భూమిసమస్య నెరగనివారికి దానిని తెలుపడం కోసమే భూదానోద్యమం అంటే పేచీయేలేదు. కాని ఆ సమస్యను పోరాటంతో నిమిత్తం లేకుండా ప్రేమతో పరిష్కరిస్తానంటారు; తమ పద్ధతులే సర్వోత్కృష్టాలంటారు. క్రమంగా ప్రజలనూ వారి చైతన్యాన్నీ పరివర్తనం పొందిస్తానంటారు; ప్రపంచ శాంతికి అనితర సాధ్యమైన విజయం కూరుస్తానంటారు. ఈ ఆశయాలమీదనే మనం విమర్శ సాగిస్తున్నాం.

గ్రామదానం : నూతన దశ

గ్రామదానం అనేది భూదానంయొక్క అభివృద్ధి దశ. అదే నిజమైన భూవిప్లవం అని భావన. వ్యక్తులు తమ భూముల్ని దానం చెయ్యడం కాకుండా యావత్తు గ్రామము తమ యావత్తు భూమినీ దానం ఇస్తారు. ఈ గ్రామదానం ఆశయాలు ఏడు :

(1) దారిద్ర్యవినాశనం, (2) భూకామందుల హృదయాలలో ప్రేమాభిమానాలను రేకెత్తించి దేశంలోని నైతిక వాతావరణాన్నే మార్చెయ్యడం, (3) పరస్పర సహకారం, సోదరప్రేమద్వారా దృఢతర సంబంధాలు వృద్ధిపరచి, సమాజాన్ని బలపరచడం. ఆ విధంగా ఇతర ప్రదేశాలలో భూస్వాములకూ, భూములులేని పేదవారికీ మధ్య రేగుతున్న వర్గద్వేషాన్ని నిర్మూలించడం, (4) యజ్ఞం, దానం, తపస్సులను బోధించే తాత్విక వివేచనమీద ఆధారపడి వృద్ధిపొందిన

భారతీయ సంస్కృతిని పునరుజ్జీవింపచేసి ముందుకు తీసుకు పోవడం; ఆ విధంగా నిజమైన మతంమీద మానవుని విశ్వాసాన్ని దృఢపరచడం, (5) ఐచ్ఛికంగా శారీరకశ్రమ చేయడం, తనది అనేదేదీ వుంచుకోనకపోవడం, సహకారం ఆత్మవిశ్వాసంతో నూతన సామాజిక వ్యవస్థను నిర్మించడం; (6) అన్ని రాజకీయపార్టీలూ బోధించడానికీ, కలిసి పనిచేయడానికీ వీలయిన అవకాశం కలిగించడం; ఆ విధంగా ద్వేషాలూ స్వార్థపరత్వమూ పోగొట్టడం; ప్రపంచశాంతికి తోడ్పడడం.

(అదే పుస్తకం – పుట 134)

పెద్దపెద్ద ఆశలతో ఒక మంచి ఆలోచనను నిరుపయోగం చెయ్యడం మళ్ళీ ఇక్కడకూడా కనబడుతుంది. గ్రామం యావత్తూ తమకున్న భూములను ఏకంచేస్తే సహకారంతో పనిచేయడం సులభం అవుతుంది. ఉత్పత్తి పెరుగుతుంది. ఈనాటి సమాజంలో వున్న పరిస్థితుల దృష్ట్యా సుఖజీవనం సాధ్యమవుతుంది. ఇది స్పష్టంగా తెలుస్తున్న విషయం.

కాని రెండోదికూడ వుంది ఉత్పత్తి సాధనాలు యావత్తూ సమాజపరం అయి, సరుకుల వుత్పత్తి రద్దు అయే వరకూ (అంటే మనుష్యుడు వుపయోగించుకోడానికి గాక అమ్ముకోనేటందుకు వస్తువులను వుత్పత్తిచేసే పద్ధతి) గ్రామదానాలు ఎన్ని జరిగినా ఏమీ ప్రయోజనం వుండదు. గ్రామాలలో దోపిడీ విధానం ఆగదు. ధరలద్వారానూ, హెచ్చుతగ్గు మారకం ద్వారాను మార్కెట్లు వానిని దోచుకొంటూనే వుంటాయి. దారిద్ర్యాన్ని పూర్తిగా నిర్మూలించలేము.

గ్రామదానం ద్వారా భూమిమీద వ్యక్తి యాజమాన్యం రద్దయినంత మాత్రాన నూతన సామాజిక వ్యవస్థ ఏర్పడదు. పట్టణాలలోనూ, ఇతరత్రానూ వున్న ఉత్పత్తి సాధనలన్నీ సమాజగతం కావాలి. ఉత్పత్తి అనేది మార్చుకొనేందుకు గాక సామాజికావసరాల దృష్ట్యానే జరగాలి అప్పుడే నూతన సమాజ వ్యవస్థ ఏర్పడుతుంది.

గ్రామదానం పాలకవర్గ పార్టీని హెచ్చుగా ఆకర్షించడానికి కారణం ఏమిటి ? పోరాటం వద్దనే అభిప్రాయమును చాటడమూ, దేశంలోని దిగువ తరగతులవారు హద్దులుదాటి సామాజిక శాంతిని భంగపరచరన్న విశ్వాసం కలిగించడమూ దానికి కారణాలు.

## స్వయంపోషకత్వం యెడ భ్రమ

గ్రామాలలో వివిధ విషయాలమీద ఐచ్ఛికంగా పరస్పరం సహాకరించుకొనేటందుకు ప్రజలలో వుద్యమం రావడమంటే దానికి అంతా సుముఖంగానే వుంటారు. శ్రామిక వర్గం అధికారంలోకి వచ్చేక, గ్రామాలలో సహకారోద్యమం చాల ప్రముఖపాత్ర వహిస్తుంది వ్యవసాయంలో ఉత్పత్తి సమాజపరంగా జరగడానికది పునాదులు వేస్తుంది.

వినోబాజీ ప్రయత్నాలు సఫలమయి గ్రామదానం పెద్దఎత్తున జరిగితే, గ్రామదానంచేసిన వూళ్ళలో భూస్వామ్య సంబంధాలూ, అసమానతలూ అన్నీ రద్దు అయితే, గ్రామ జీవితంలో హెచ్చుతగ్గులు బాగా తగ్గిపోతాయి. భూమి నంతనూ గ్రామానికిచ్చివేయడం, అందరూ కలిసి దానిమీద

హక్కునను భవించడం హెచ్చుతగ్గుల్ని సరిచేయడంలో బాగా తోడ్పడుతుంది.

అయినా దీనికెన్నో పరిమితులున్నాయనే సంగతి గుర్తించాలి. మిగిలిన ఉత్పత్తి సాధనాలన్నింటినీ సమాజపరం చేసేవరకూ అది సమాజంలో మూలమట్టుగా మార్పు తీసుకు రాలేదు.

ప్రభుత్వం అడుగడుగునా సాయం చేస్తూ, చట్టాలు చేస్తూ తోడ్పడుతూంటే తప్ప గ్రామదానం వూళ్లు సుఖం గాను విజయవంతంగాను జీవించలేవు. వినోబాజీ కోరినట్లు అదంతా ఐచ్ఛిక సహాయమే కానక్కరలేదు. ప్రభుత్వ సహాయం తోనూ సమష్టి కృషితోనూ ఆ గ్రామం మహా అయితే పెట్టుబడిదారీ మార్కెట్ల, వ్యాపారుల, దళారుల దోపిడీ నుండి తన్ను తాను కాపాడుకోగలుగుతుంది. అంతేగాని, ఇతరులతో సంబంధం లేకుండా స్వయం సంపూర్ణంగా బ్రతక లేదు.

వినోబాజీ గ్రామదానం వూళ్లో వుత్పత్తి సహకార పద్ధతిపైగాక వ్యష్టిరూపంలోనే జరుగుతుందని తోస్తుంది. వ్యవసాయమూ చేతినడుకూ పక్కపక్కనే సాగించిన పూర్వపు రోజులకు మళ్ళడానికి గ్రామదానం వూళ్లలో నిర్బంధంగా ప్రయత్నం జరుగుతుంది. గ్రామం వెలుపలనుంచి బట్టదిగుమతి అననివ్వరు. వూళ్ళోని పనివాళ్ళను—చెప్పులు కుట్టేవారు, నూనెగానుగ వేసేవారు – నేతగాడు మొదలయిన వృత్తిపనివారిని గ్రామం ప్రోత్సహించాలి. గ్రామం పూర్తిగా స్వయం పోషకంగా వుండవలసిందేనని వినోబాజీ చెప్పారు.

మారకం అవసరాన్ని ఆయన గుర్తించేరు. కానైతే దానిని గట్టి అదుపులో వుంచేరు. పరివర్తనదశలో గ్రామీణ పరిశ్రమ లకు, వృత్తులకు ప్రోత్సాహమూ ఇవ్వాలి. రక్షణా ఇవ్వాలి. కాని గ్రామం స్వయం పోషకం కాగలదనే ఆలోచన అమలు జరిగేదీకాదు; సరియైనదీకాదు. బహిః ప్రపంచంతో అతి స్వల్పమైన మార్పిడి సంబంధాలు పెట్టుకొనే గ్రామదానం కోసం వినోబాజీ ఎందుకు పట్టుపడుతున్నారో అర్థం చేసుకో వచ్చు. పట్టణాలతోడి వ్యాపారంలో గ్రామస్థులూ, గ్రామాలూ నష్టపోతున్నాయని ఆయన గమనించేరు.

గ్రామాలలో దారిద్ర్యం, పట్టణాలతోడి వ్యాపారంలో నష్టపడడం, పెద్దపరిశ్రమలు వుత్పత్తిచేస్తున్న వస్తువుల పోటీ ఇవన్నీ గ్రామప్రజానీకాన్ని నాశనం చేస్తున్నాయి. బయటి ప్రపంచంతో వ్యాపారాన్ని నిషేధించాలనుకోవడం చూస్తే ఆయనకు సరియైన సోషలిస్టు దృక్పథంలేదనీ, ప్రస్తుత పరిస్థితు లకు తలచాటుచెయ్య చూస్తున్నారనీ అనిపిస్తుంది. గ్రామా లను పట్టణాలు దోచుకొంటూండడాన్ని చూసి వినోబాజీ స్వయంపోషకత్వంద్వారా ఆ బాధను తప్పించుకో జూస్తు న్నారు.

కాని అసలు సమస్య వుండనేవుంది. గ్రామదా నోద్యమం ఎల్లా సాగుతూంది? 1957 సెప్టెంబరు నాటికి 3 వేల గ్రామాలలోని భూకామందులు తమకున్న భూమిసంతనూ ఇచ్చేసేరు. ఈ భూమిలో అత్యధికభాగం ఆటవికుల గ్రామా లలోనిది. అక్కడ వ్యక్తిగత ఆస్తిపై మమకారం అంత హెచ్చుగా వుండదు. తను పుట్టిన మహారాష్ట్రలో ఆయన

సంచారం అత్యంత సఫలం అయినట్లు కనబడదు. భూదానంలాగే గ్రామదానంకూడా ఆనుకోతగిన విజయాలను సంపాదించ లేదు. విఫలం అవుతూంది. సామాజిక పరిస్థితులను గుర్తించ కుండా, చరిత్రక్రమంలో పరస్పర విరుద్ధమైన ఆర్థిక ప్రయోజ నాలు పరిణతి పొందిన విషయం గుర్తించకుండా, దోచు కొంటున్న వారినీ, దోపిడీకి గురి అవుతున్న వారినీ ఒకే గాటన కట్టివేసే వుద్యమం ఏదీ ఎంత తంటాలుపడ్డా ప్రజా వుద్య మంగా వృద్ధిపొందలేదు. సామాజిక పరిణామ సూత్రాల నెరుగని సహృదయులైన వ్యక్తుల్నీ యోగ్యుల్నీ అది ఆకర్షించ వచ్చు. కాని ఎన్నటికీ అది సమాజాన్ని మూలమట్టుగా మార్చలేదు. ప్రజానీకాన్ని వుద్యమంలోకి తేలేదు.

గ్రామాలలోని స్వార్థప్రయోజనపరులు ఏనాటికైనా తమ ప్రచారానికి లొంగక మానరనీ, తమ ఆస్తులను తామే వదులుకొంటారనీ గ్రామదాన కార్యకర్తలు ఆశిస్తున్నారు. తమ విజ్ఞప్తిని దిగువ తరగతులవారు వింటే, వారిలాగే చేయక తప్పని నైతిక బాధ్యత పై తరగతులమీద పడు తుందని వారి ఆలోచన. ఈ ఆలోచన శాస్త్రసమ్మతం కాదు. ఏఆర్థికవర్గమైనా తన వర్గదృక్పథంతోనే సమాజంలో వ్యవహ రిస్తుందనీ ఎవరో కొద్దిమంది వ్యక్తులు మాత్రం ఆ దృక్పథాన్ని అతిక్రమించగలుగుతారనీ ఆయన అర్థం చేసుకోవడంలేదు. ఒక భావన, లేక ఆలోచన మనుష్యులనూ, పరిస్థితులనూ కూడ మార్చివేయగలదని వినోబాజీ వుద్దేశం.

## సంపత్తిదానం

గ్రామదానం, భూదానంతోపాటుదే సంపత్తిదానం.

"ధనికుల, బీదలమధ్య తారతమ్యాన్ని రద్దు పరచక తప్పదు. దయాసముద్రుడైన భగవంతుడు మనందరకూ తల కొకటీ ఇచ్చేడు. భగవద్దత్తమైన దానిని ఇతరులతో కలిసి ఎందుకు అనుభవించకూడదు? అలా జరిగితే మన పరిసరాలన్నీ మారుతాయి. భారతదేశం సుఖవంతమూ, సౌభాగ్యవంతమూ అవుతుంది. భూదానోద్యమం లాగే సంపత్తిదాన యజ్ఞం పుష్టినీ బలాన్నీ కలిగిస్తుంది."

(భూదానయజ్ఞ, పుట 77)

"భూదానోద్యమం సాగినకొద్దీ మరో అడుగు ముందుకు వేసి సంపదలలోనూ, ఆస్తులలోనూ వాటా అడిగితే తప్ప ఆ ఉద్యమంయొక్క అసలు వుద్దేశం నెరవేరదని క్రమంగా తెలిసివచ్చింది. అందుచేత ప్రజల సంపదలోకూడ వాటా కోరడానికి నిర్ణయించుకొన్నాను. ఆపనే ఇప్పుడు చేస్తున్నాను. సంపదలో ఆరోవంతు నాకివ్వండి."

(వినోబా, ఆయన ఆదర్శం, పుట 84)

ఇక్కడకూడా అదే ధోరణీ, అదే దృక్పథమూను. దోపిడీ ఫలితంగా ఏర్పడిన ఆర్థిక అసమానతను తొలగించేటందుకు విరాళాలకోసం ధనికులకు విజ్ఞప్తి చేస్తారు. ప్రజలు కష్టపడి సృష్టించిన సంపదలో వాటా అడుగుతారు. దోపిడీని ఆపడం, నిలపడంగాక ధనికుల దయాధర్మాలకు విజ్ఞప్తి చేయడం – ఇదీ ఆయన ఇచ్చిన పరిష్కారం.

భూదానం సందర్భంలో తన కార్యక్రమాలు పెరుగుతున్నకొద్దీ వానికి కావలసిన ఖర్చులకై వినోబాజీ సంపత్తిదానం కోరుతున్నారు. ఈ సంపత్తిదానంయొక్క గమ్యాలు అయిదు: (1) బీదల ప్రేమాభిమానాలు చూరగొనే అవకాశం ధనికులకు లభిస్తుంది; (2) ధనికులకూ, బీదలకుకూడ ఆస్తిపై మమకారం వదల్చి, ఆస్తి యావత్తూ ప్రభుత్వానిదో, సమాజానిదో అనుకొనేటట్లు చేస్తుంది; (3) సంపదకూ, బంగారానికీ విలువ లేకుండా చేస్తుంది. శ్రమయే నిజమైన సంపద అని గుర్తింపజేస్తుంది; (4) ప్రజాశక్తిని సృజించి, ప్రజలు తమ వ్యవహారాలను తామే చక్కదిద్దుకొనేటట్టూ, ప్రభుత్వంమీద ఆధారపడడం తగ్గించేటట్లూ చేస్తుంది; (5) సామాజిక వ్యవస్థను కొత్తగా మరల వ్యవస్థీకరిస్తుంది

ధనికులూ, బీదలూకూడ సంపత్తిదానం చెయ్యాలి. ఆస్తి మమకారాన్ని పోగొట్టుకోవాలి. కోటీశ్వరుడూ, చిల్లరకొట్టువాడూకూడ ఆస్తి మమకారాన్ని విసర్జించాలి! వారిద్దరినీ ఒకే పరిధిలో పెట్టేరు ఆయన. ఉత్పత్తి సాధనాలను జాతీయంచేసి సమాజపరం చేయడానికి బదులు వారి సంపదలో ఆరోవంతు యివ్వమనడం; పరిశ్రమలను జాతీయం చేస్తూ చట్టం చేయమనడానికి బదులు సంపన్నులు ఏనాటికైనా తమ ఆస్తిని వదలిపెట్టరా అని ఆశలు పెట్టుకోనడం – ఇదీ వినోబాజీ నిర్మించదలచిన సర్వోదయ సమాజానికి పునాది.

యావత్తు సమాజమూ – ముఖ్యంగా దిగువవర్గాలు – తమ సంపదలో ఆరోవంతు ఇచ్చెయ్యాలి; దీనివలన ఒక నైతికోత్తేజనం కలుగుతుందనీ, కోటీశ్వరులు ముందుకొచ్చి

తమ ఆస్తిని సమాజానికి వప్పగింత పెడతారనీ అభిప్రాయం. చిన్నగా అసమ్మతి తెలుపు తేనే కాల్చిచంపడానికి పోలీసుల్ని తెచ్చే తాతాలూ, బిర్లాలూ సర్వోదయవాదుల విజ్ఞప్తిని అనుసరించి ఆస్తిని వదిలేసుకుంటారట! వినోబాజీ తన సిద్ధాంతాలను పిడివాదంగా మార్చేరు. సమయం, సందర్భం చూచు కోకుండా అవి విజయం పొందాలని అనుకొంటున్నారు.

ఊహా కల్పిత దృక్పథం

భూదాన, గ్రామదాన, సంపత్తిదానములన్నింటా మనకు సమానంగా కనిపించే దొకటుంది. పోరాటం పనికి రాదనడం, సత్యాగ్రహంతో సహా ఘర్షణలు ఏవీ రాకుండా చేయడం, ప్రస్తుతం వున్న సమాజాన్ని మార్చాలనే ప్రజల కోరికల నమలు జరపకుండా తప్పించుకోవడమూ కనబడు తుంది. అన్నీ మాటలద్వారా జరిగిపోతాయంటారు. వినోబాజీకి ఫలితంకన్నా పద్ధతిమీద పట్టుదల హెచ్చు. తన పద్ధతిద్వారా మనుష్యుల్ని మార్చి, నూతన సమాజానికి అనుకూలురనుగా చేస్తానని ఆయన ఆశ. ఆయన గమ్యంగాని, వాళ్ళు మారడంగాని సాధ్యమయ్యేది కాదు. ఆ సంగతి వేరే చెప్పనక్కర్లేదు. కేవలం ప్రచారంద్వారా తమ ఆశయాలు సఫలమవుతాయనే భ్రమను ప్రజలలో కలిగించి, ప్రజాతంత్రం సోషలిజం సాధనకై సాగుతున్న వుద్యమాన్ని నిర్వీర్యం చేయడం ఒక్కటే అది చేయగలపని.

ప్రజల క్షేమంకోసం ఎంతో వ్యథపొందుతూ మన స్ఫూర్తిగా వినోబాజీ ఆయన అనుచరులూ పనిచేస్తున్నా,

ఫలితాలు ఇల్లా ఎందుకున్నాయి ? కారణం ఒక్కటే. సామాజిక పరిణతికి సంబంధించిన చారిత్రక సూత్రాలను వారు మరచిపోయేరు; వినోబాజీ వర్గాల కతీతంగా వుండదలిచేరు. ఉభయుల యెడా నిష్పక్షపాతంగా వ్యవహరించదలిచేరు. ఘర్షణలకు దూరంగా వుండదలచేరు. ఫలితంగా ప్రజా ప్రయోజనాలకు విరుద్ధమైన కార్యవిధానాన్ని చేపట్టేరు.

గతంలో కూడా సామాజిక పరిణామ సూత్రాలను అర్థం చేసుకోకుండా కొందరు మహాపురుషులు తమ వూహలలో ఏదో ఆదర్శ వ్యవస్థను సృష్టించుకొన్నవారు వున్నారు. సజీవమైన సామాజికగతిని యీ ఊహాజనిత వ్యవస్థవేపు నడిపించడానికి ప్రయత్నించేరు వారు. మార్క్సు కమ్యూనిస్టు మానిఫెస్టోలో యిటువంటివారిని గురించి వ్రాసిన వ్యాఖ్యలు వినోబాజీకి కూడా చెల్లుతాయి :

"స్వయంకల్పిత కార్యవిధానానికి చారిత్రక క్రియా విధానం లొంగివుండాలి. విముక్తికై చారిత్రకంగా ఏర్పడిన పరిస్థితులు భావనాజనితమైనవానికి తావివ్వాలి. క్రమ క్రమంగా దానంతటదే ఏర్పడిన శ్రామికవర్గ నిర్మాణం కాల్పనికులు తయారుచేసిన సామాజిక వ్యవస్థకు తల వొంచాలి. వారి దృష్టిలో భవిష్యత్తంతా ప్రచారంలోనూ, తమ పథకాల నమలు జరపడంలోనూ పర్యవసితం అయి పోతుంది.

"వర్గ పోరాటం యొక్క అపరిణత దశా, పరిసరాలూ ఈ మాదిరి సోషలిస్టులు తాము వర్గ వైషమ్యాల కతీతుల మనుకొనేటట్లు చేస్తాయి. సమాజంలోని ప్రతి ఒక్కరి స్థితినీ-

ఆఖరికి ఉచ్ఛస్థితి ననుభవిస్తున్న వారిని కూడా – బాగుపరచా లని వారు కోరుతారు. అందుచేత వారు ఒక వర్గానికని కాకుండా సమాజానికంతకూ విజ్ఞప్తి చేస్తారు; ముఖ్యంగా పాలకవర్గానికే విజ్ఞప్తి చేస్తారు. వ్యవస్థను అర్థం చేసుకొన్నాక అవకాశం వున్నంతలో ఉత్తమ వ్యవస్థను నిర్మించేటందుకు ఉత్తమమైన మార్గం ఏదో ప్రజల కెందుకు తెలియకుండా ఉంటుంది – అని వారి వూహ.

"అందుచేత వారు రాజకీయ కార్యక్రమాన్ని, ముఖ్యంగా విప్లవ కార్యక్రమాన్ని నిరాకరిస్తారు; శాంతియుత మైన పద్ధతులలో గట్టిగా పనిచేసి, చిన్న చిన్న ప్రయత్నా లతో (అవి విఫలం అయితీరుతాయి) తమ ఆశయాన్ని చేరుకో చూస్తారు. మార్గదర్శిత్వం వహించి నూతన సామాజిక ప్రవచనానికి మార్గం ఏర్పరుస్తారు."

(మార్క్స్-ఏంగిల్సు, సెలక్టెడ్ వర్క్స్ సం. 1, పుట 62)

## మంచి లక్షణాలు

ఇతర విషయాలకు మళ్ళేముందు ఒక ప్రధాన విష యాన్ని గురించి ఇక్కడ ఆలోచించవలసివుంది. ప్రపంచ శాంతిని వినోబాజీవలె అంత గాఢంగా వాంఛించేవారు కొద్ది మంది వుంటారు. అహింసయందున్న విశ్వాసం ఆయనలో ప్రగాఢమైన శాంతివాంఛను కలిగించింది. భూదాన, గ్రామ దానాలు శాంతికి పుష్టినిస్తాయన్నారంటే, అది శాంతి విష యంలో ఆయనకున్న పట్టుదలను తెలుపుతుంది. శాంతిని సమర్థించడానికి ఏమాత్రం అవకాశం దొరికినా ఆయన విడు

వరు. ప్రపంచ పరిస్థితులగూర్చి ఆయన చేసే విశదీకరణతోనూ పరిష్కారాలతోనూ అందరూ ఏకీభవించకపోవచ్చు. ఐనా ఆయన శాంతికోసం సర్వశక్తులూ వినియోగిస్తారు.

వినోబాజీ, ఆయన అనుచరులూ సమాజం మార్పు చెందాలని గట్టిగా కోరుతున్నారు. ఉత్పత్తి సాధనాలు వ్యక్తుల అధీనంలో వుండడంవల్లనే సమాజంలో అసమానత వచ్చిందనీ, దానిని మార్చాలనీ స్వానుభవం వలన వారు గ్రహించేరు. ఆయనను పరివేష్టించి వుండే కాంగ్రెసు నాయకుల మాదిరిగా గాక ఆయన భూమిమీద వ్యక్తిస్వత్వాన్ని రద్దు చేయాలని నిర్భయంగా చెప్పేరు. భారతదేశపు పరిస్థితులలో యిది చాల చిక్కులతో కూడిన వ్యవహారం. వినోబాజీ వంటి వ్యక్తి వర్గాలు, ప్రభుత్వాలు లేని సమాజం కావాలనీ, ఉత్పత్తి సాధనాలమీద వ్యక్తి యాజమాన్యం వుండని సమాజం కావాలనీ చెప్పేరంటే ప్రజల దృష్టిని యీనాటి సమాజంలో వున్న కుళ్ళు పరిస్థితులమీద ప్రసరించడానికి తోడ్పడుతుంది.

సదుద్దేశంతో వ్యక్తిగత ఆస్తిహక్కుమీద చేసే ఈవిమర్శలకు మార్క్సిస్టులు స్వాగతం యిస్తారు. అటువంటి విమర్శలు ఈ అన్యాయపూరితమైన వ్యవస్థను కూలద్రోయడానికి తోడ్పడుతాయి. వినోబాజీ తాత్విక విధానంలో వున్న కొన్ని సవిమర్శక సూత్రాలు ఈనాటి భారతీయ పరిస్థితులలో చాల సత్ఫలితాల నివ్వగలవు. అయితే అక్టోబరు విప్లవం, చైనా విప్లవం విజయం పొందాయి. ప్రపంచమంతటా సోషలిస్టు వుద్యమ చైతన్యం కలిగింది. భారతదేశంలో కూడ ఆ వుద్య

మానికి విశేషవ్యాప్తి కలిగింది. ఈ దశలో ఆయన పెట్టుబడి దారీ విధానం గురించి చేస్తున్న విమర్శలు చూస్తే మరీ ప్రాథమికంగా వున్నాయనీ, దానికి శాస్త్రీయ సోషలిస్టు పునాదులు లేవనీ అనిపిస్తుంది. అంతే.

పో రా ట ని రా క ర ణ

ఆయనకున్న ఊహాకల్పిత దృక్పథమూ, పోరాటాన్ని పూర్తిగా నిరాకరించడమూ ఫలితంగా కార్యానుకూలతను సాధించగల, శాస్త్రదృష్టితో ఏర్పరచిన కార్యవిధానాన్ని సూచించలేకపోయేరు. ఇక్కడున్న సమస్య దౌర్జన్యయుత పోరాటమూ, దౌర్జన్యరహిత పోరాటమూ అనికూడా కాదు. అత్యంత శాంతియుతమైన మామూలు పోరాటంకూడా వ్యక్తి ద్వేషాన్ని కలిగిస్తుందనీ, వ్యక్తుల మధ్య ఘర్షణలు కలిగిస్తుందనీ దానిని ఆయన నిరాకరిస్తున్నారు. అహింస పేరుతో వ్యక్తితో వ్యక్తి, వర్గంతో వర్గం పోరాడరాదని ఆయన చెపుతున్నారు. బండి వెనక గుర్రాన్ని కట్టినట్లు వ్యక్తులలో మార్పు తీసుకొచ్చి - ముఖ్యంగా స్వార్థప్రయోజనపరులను మార్చి - సమాజాన్ని సంస్కరించాలని ఆయన ఆలోచన.

అందుకే ఆయన ప్రతిపాదించుతున్న భూసంబంధమైన కార్యక్రమంలో చట్టం కావాలని కోరడంగాని, అసమానమైన భూసంబంధాలను రద్దుచేసి బీద ప్రజల కనుకూలంగా ప్రభుత్వం తన బలాన్ని వుపయోగించవలసిందిగా కోరడం గాని వుండదు. చట్టం ద్వారా భూమికి గరిష్ఠపరిమితులను పెడితే భూమిలేని బీదలకు పంచేటందుకు భూమి దొరుకు

తుందన్నా ఆయన ఆ మాట చెప్పరు. ఆ కోరికను సాధించే టందుకు ప్రజలు పోరాడటానికి వొప్పుకోరు. పెద్ద పరిశ్రమ లను జాతీయం చేసేటట్లు చట్టాలు చేయమనరు. ప్రజోద్యమం బయలుదేరడానికే వొప్పుకోరు. ధనవంతులకు విజ్ఞప్తులు ప్రకటించడంతో ఆయన సంతృప్తిపడతారు.

భూకమతాలకు గరిష్ఠపరిమితి పెడుతూ చట్టంచేయ వలసిందనే కోరికపై రైతులను, భూములులేని కూలీలనూ కార్యరంగంలోకి తెచ్చేటందుకు వినోబాజీ తన శక్తినంతనూ వినియోగించివుంటే కోట్లకొలదిమంది ముందుకు వచ్చేవారు. ఎవరికీ అన్యాయం జరగ నక్కరలేకుండా పంచేటందుకు వలిసినంత భూమి లభించేది. కాని అలా చేస్తే దౌర్జన్యరహిత ఐచ్ఛిక వుద్యమాన్ని కాదనడమేనని ఆయన అభిప్రాయం. పాతకాలపు భూసంబంధాలను మార్చకుండా, గరిష్ఠపరిమితు లను విధించకుండా, ఈ పనికై చట్టాలు చేయకుండా భూవిప్ల వం సాధ్యమని అనుకోగలమా ?

చట్టంద్వారా ప్రభుత్వం చర్యతీసుకోడానికి, ప్రభుత్వం మీద ప్రజలు ఒత్తిడి తేవడానికి వినోబాజీ నిరాకరించడం అనేది ఏదో యాదృచ్ఛిక ఘటనకాదు. వినోబాజీ సిద్ధాం తంలోఅదొక ముఖ్యభాగం. జాతీయ ప్రభుత్వం ఏర్పడిన పరిస్థితులకు అనుగుణంగా గాంధీవాదాన్ని సమన్వయపరచ డమే దాని ఉద్దేశ్యం.

గాంధీజీ ఆధ్యాత్మికభావాల కెంత ప్రాముఖ్యం యిచ్చినా భారతదేశం కన్న రాజకీయ నాయకులలోకెల్ల ఆయన గొప్పవాడు. బ్రిటిష్ వాళ్ళకి వ్యతిరేకంగా ఆయన

రాజకీయ పోరాటాన్ని నడిపేరు. ప్రజల వుద్రేకాల తీవ్రతను తగ్గించడానికీ, ఉద్యమాన్ని అదుపులో వుంచుకోవడానికీ ఆయన సత్యాగ్రహాన్నీ అహింసనూ సాధనంగా చేసుకొన్నా, రాజకీయ పోరాటాన్ని విదేశీ ప్రభుత్వంతో డీ పోరాటాన్ని ఎన్నడూ మానలేదు. వినోబాజీ భారతీయ స్వార్థ ప్రయో జనపరుల పెత్తనం క్రిందవున్న జాతీయ ప్రభుత్వానికి ముఖాముఖిగా నిలబడ్డారు. మహాభారత యుద్ధారంభంనాటి అర్జునుడి పరిస్థితి ఆయనది.

వర్గసమాజా లన్నింటా సమాజాన్ని మార్చేటందుకు జరిగే పోరాటాలన్నీ ప్రభుత్వంమీదనే తప్పనిసరిగా సాగు తాయి. అసమానంగా వున్న సామాజిక వ్యవస్థను మార్చ వలసిందిగా కోరే ప్రజలకు ప్రభుత్వం ప్రత్యర్థిగా నిలబడు తుంది. సామాజికమైన మార్పులకోసం జరిగే పోరాటం తప్పకుండా రాజకీయ పోరాటరూపం ధరిస్తుంది. రాజ్యాం గాన్ని స్వాధీనపరచుకొనేటందు కది సాగుతుంది. ఆ పోరాటం శాంతియుతం, దౌర్జన్యరహితం అయినా, దౌర్జన్యసహితం అయినా అది రాజకీయ పోరాటరూపాన్ని ధరించక మానదు. నూతన వర్గం అధికారంలోకి రానిదే నూతన సామాజిక వ్యవస్థ ఏర్పడదు. సామాజిక పరిణామ గతి సూత్రం యిది. ఇది భారతదేశానికూడా వర్తిస్తుంది. నూతన సమాజాన్ని సృష్టిస్తామంటూ, ప్రభుత్వంతో పోరాటానికి వెనకాడేవారు అమలు జరగని వాగ్దానాలు చేస్తున్నారన్నమాట.

వినోబాజీ, ఆయన అనుచరులూ ప్రభుత్వంతో పోరాటం నడుపబోము అంటారు. అసలు రాజకీయ పోరా

టమే పనికిరాదంటారు. ఇప్పుడు సమాజంలో వున్న అసమా నతను, అన్యాయాన్నీ, పీడనను గురించి ఎన్నో వుపన్యసిం చినా వానిలో ప్రభుత్వంమీద విమర్శ చాల అరుదు. దౌర్జన్య ప్రయోగంతో ప్రస్తుత సమాజ వ్యవస్థను కాపాడు తున్న ప్రభుత్వాన్ని వారు దోషిగా భావించరు. దానికి వ్యతిరేకంగా పోరాటాని కెన్నడూ పిలుపు నివ్వలేదు. ప్రభుత్వం వుపయోగిస్తున్న దౌర్జన్యకాండను ఖండించినది కూడా అరుదు. సర్వసాధారణంగా ప్రజలదే తప్పు అంటారు. ఈ విధంగా ప్రధాన పోరాటాన్ని నిరాకరించేక ఇక సామా జికమయిన మార్పు తెచ్చేదేముంటుంది ?

భూదాన, గ్రామదానాల ఫలితం రాజకీయ పోరాటా లకు స్వస్తి చెప్పడమేననీ, ప్రజలు జరిపే సాంఘిక పోరాటా లను నిర్వీర్యం చేయడమేననీ మనకు కనబడుతూంది. విశ్వ ప్రేమ, అహింస అంటే ప్రజలను రాజకీయ పోరాటం చేయ వద్దనీ, ప్రభుత్వాన్ని ఇప్పుడున్నవారి చేతుల్లోనే ఉంచెయ్య మనీ అర్థంగా తయారయింది.

ఈ దృక్పథంతోనే వినోభాజీ రాజకీయపార్టీలన్నింటినీ నిరాకరిస్తూ వచ్చేరు.

"నేను పార్టీలను గుర్తించను. నాకున్న చరిత్ర పరి జ్ఞానం, ప్రస్తుత వ్యవహారాల అనుభవం, ఆలోచన పట్టి చూస్తే మన దేశంలోని పార్టీలు అపకారం చేయడమే కాదు – మొత్తంమీద సర్వనాశనం తెచ్చిపెడతాయి. తోటిమాన వులకు సేవ చెయ్యడమే మన చరమగమ్యంగా వుండాలి."

(వినోబా, ఆయన ఆదర్శం- పుట 285)

రాజకీయ పార్టీలు చేసిన అపరాధం ఏమిటి? "పార్టీ అనేది రాజకీయాధికారాన్ని చేజిక్కించుకొనేటందుకో పనిముట్టు. రాజకీయాధికారం కోసం జరిగే పోటీలో భావాలు వ్యాపార చిహ్నాలుగా తయారవుతూంటే అధికారం పెత్తనం సాగిస్తుంది." శిథిలమైపోతున్న అభివృద్ధినిరోధక వర్గాలకు సంబంధించిన పార్టీలు అవినీతికరంగా, అవమానకరంగా, ఏ యెండకాగొడుగుపట్టే విధంగా తయారవుతాయనేది నిజమే. కాని అంతమాత్రాన అన్ని రాజకీయ పార్టీలనూ యీ విధంగా ఖండించనక్కర లేదు. పీడితవర్గం ఒక పార్టీగా నిర్మాణం పొందితేతప్ప తాను విముక్తి పొందలేదు. తమ స్వంత పార్టీద్వారా అధికారాన్ని చేపట్టడానికి వుద్యమిస్తే తప్ప భారతదేశ ప్రజానీకం నూతన సమాజాన్ని నిర్మించలేదు. అధికారాన్ని చేజిక్కించుకోడానికే ఆ పార్టీ. అందులో తప్పేమీ లేదు.

వినోబాజీలాగనే టాల్‌స్టాయ్ కూడా రాజకీయాలు ముట్టుకోనవద్దనేవారు ఆ విధంగా ముట్టుకోకుంటే వచ్చే ఫలితాలను గురించి లెనిన్ ఇట్లా వ్రాసేరు :

"అల్లాంటి సందర్భాలన్నింటా జరిగేటట్లే, టాల్‌స్టాయ్ చెప్పిన విధంగా రాజకీయాలకు దూరంగా వుంటేనూ, వాటిని త్యజిస్తేనూ, వాటియెడ శ్రద్ధ తీసుకోకపోతేనూ, అర్థం చేసుకోనకపోతేనూ ఎవరో కొద్దిమందిమాత్రమే వర్గచైతన్యం గల విప్లవకర శ్రామికవర్గం వెంట నడుస్తారు. మిగిలిన అత్యధిక సంఖ్యాకులు నీతినియమాలు లేకుండా, చేతులు నలిపే బూర్జువా మేధావుల కుట్రల్లో పడిపోతారు..."

[టాల్‌స్టాయ్‌ని గురించిన వ్యాసాలు : మాస్కో, పుట 12 - 13]

తెలియక చేస్తున్నా రాజకీయాలకు పోవద్దనడం అధికారంలో వున్న వర్గానికి మేలుచేయడమే అవుతుంది.

రాజ్యాంగయంత్రానికి (State) వినోబాజీబద్ధవ్యతిరేకి. ఆయనా ఆయన శిష్యకోటీ రాజ్యాంగయంత్రంలేని సమాజం కావాలంటారు. దానికోసమే పనిచేస్తున్నామంటారు. కమ్యూనిస్టులు భవిష్యత్తులో ఎప్పుడో రాజ్యాంగయంత్రం రద్దు కావాలంటారు. తాను ఈ క్షణంలో రద్దు కావాలంటాడు. కనుక కమ్యూనిస్టులకన్న తానే ఒక అడుగు ముందున్నానని ఆయన భావిస్తారు. "పురాణ వాలాలు, భూత సత్యయుగ వాదులు (గతంలో ఎప్పుడో రాజ్యాంగరహితమైన సమాజం వుండేదని నమ్మేవాళ్ళు). కమ్యూనిస్టులు భవిష్య సత్యయుగవాదులు (ఎప్పుడో భవిష్యత్తులో రాజ్యాంగయంత్రం లేని సమాజం రాగలదని నమ్ముతారు). మనంమాత్రం వర్తమాన సత్యయుగవాదులం (ఇప్పటి కిప్పుడే రాజ్యాంగ యంత్రం లేని సమాజాన్ని నిర్మించడానికి పూనుకొన్న యోధులం)."

(వినోబా - ఆయన ఆదర్శం : పుట 189 - 190)

రాజ్యాంగయంత్రం అనేది కృతకమైన వ్యవస్థ అనీ, దానినెవరో సమాజంనెత్తిన రుద్దేరనీ. ఆర్థిక బలమూ రాజకీయ బలమూ కేంద్రీకృతంకానడం వలన వచ్చే దుష్ఫలితా లన్నింటికీ అది మూలమనీ వినోబాజీ, ఆయన అనుచరులూ భావిస్తున్నారు. పోరాడనక్కర్లేకుండానే ఈనాటి రాజ్యాంగయంత్రాన్ని రద్దుచేయాలని వారి భావం. సమాజాన్ని తమ చెప్పుచేతలలో ఉంచుకొనేటందుకై పాలకవర్గం ఉపయోగించే

పనిముట్టుగా కాక, సమాజాని కతీతమైన వ్యవస్థగా ఈ రాజ్యాంగయంత్రాన్ని భావిస్తారు. కొన్ని చారిత్రక పరిస్థితుల ఫలితంగా అది వచ్చిందనీ, వర్గాలు రద్దుఅయినప్పుడు ఒక మనిషి మరొక మనిషిని దోచుకొనే పరిస్థితి పోయినప్పుడు అది అంతరిస్తుందనీ వారు అనుకోరు. నూతన సామాజిక సంబంధాలు ఏర్పడినప్పుడే రాజ్యాంగయంత్రం అంతరిస్తుంది. అంతవరకూ అది రద్దుకాదు – అనే విషయాన్ని వారు గ్రహించరు. నూతన సమాజ వ్యవస్థను నిర్మించి ఆర్థిక జీవితాన్ని ఏర్పరచేలోపున రాజ్యాంగయంత్రాన్ని శ్రామికవర్గం స్వాధీనపరచుకోవలసి వుంటుందనీ, దానిని తల్లక్రిందులుచేసే వారిని శిక్షించడంలో వారా అధికారాన్ని వుపయోగించవలసి వుంటుందనీ వారు అర్థంచేసుకోరు.

## రాజ్యాంగయంత్రం గురించిన అభిప్రాయాలు

ఈ విషయంమీద వినోబాజీ వెలిబుచ్చిన అభిప్రాయాలు యీ విధంగా వున్నాయి :

"నైతిక, రాజకీయ విషయాలు భిన్న భిన్న పథాల ననుసరిస్తాయి. అందుచేత నేను రాజ్యాంగయంత్రానికి బదులు స్వరాజ్యాన్ని సంస్థాపించాలంటాను. అంటే రాజ్యాంగయంత్రం లేని ప్రజలు తమని తామే పరిపాలించుకొనే సమాజం కావాలంటాను."

(పై పుస్తకమే, పుట 166)

"పీడనమీద ఆధారపడి శిక్షణాధికారాలు గల్గిన ప్రభుత్వం అక్కర లేని దశ ఒకటి సమాజ పరిణామక్రమంలో

వస్తుందని మనలో చాలమంది విశ్వసిస్తాం. దీన్ని కమ్యూ
నిస్టులుకూడ అంతిమ గమ్యంగా ఒప్పుకుంటారు...

"ప్రస్తుత పరిస్థితుల్లో పీడనమీద ఆధారపడి ప్రభు
త్వాలు నడుస్తున్నాయనీ, ఇంకా కొంతకాలం వరకూ
అవి కొనసాగుతాయనీ మనం అందరం ఎరుగుదుం. ఈనాడు
పీడనకు సమాజంలో స్థానంవుంది. అయినా, దౌర్జన్యరహిత
సమాజంయొక్క అతి ప్రధానమైన వ్యవస్థ సేవాధర్మంతో
వ్యవహరించడం ప్రధాన లక్షణం. దానిలో పీడనకూ ప్రభు
త్వానికీ స్థానం వున్నా, అది అప్రధానం."

(అదే పుస్తకం, పుట 121.)

"ప్రభుత్వ వ్యవస్థ అనేది సహజసిద్ధంగా వచ్చినది
కాదు; కృత్రిమమైనది. కాని, ఈనాడున్న పరిస్థితుల్లో ప్రతి
వ్యక్తీ పుట్టినది మొదలు దాని అధికారం క్రింద వుంటున్నాడు.
ప్రభుత్వానికున్న అధికారాలు సర్వతోముఖాలు. అది
మానవుని జీవితరంగాలన్నింటినీ అదుపులో పెడుతూంది.
పుట్టినది మొదలు చనిపోయేవరకూ మనుష్యుడు ఈ వ్యవస్థ
క్రింద నలగవలసిందే."

(సర్వోదయానికి ఆధారం (సురాణీ) పుట 8)

"ప్రభుత్వంకన్న భయానకమైనది వేరొకటి లేదు.
గతంలోని ప్రభుత్వాలన్నిటికన్నా ఎక్కువ అధికారాలు
ఈ నాటి ప్రభుత్వాలకున్నాయి. ప్రజల ప్రయోజనాలను
రక్షించేటందుకై. సర్వాధికారాలను తమచేతిలో ఉంచు
కొంటున్నట్లు ప్రభుత్వాధికారంలో వున్నవారు అంటున్నారు
సమాజంమీద ప్రభుత్వానికి అధికారం వుండడంవలన

ప్రజల భవిష్యత్తును నిర్ణయించే అధికారం కొద్దిమందిచేతిలో పడింది. ఈనాడు ప్రపంచ మంతా భయంతో వణకిపో తూంది. వివిధ దేశాల ప్రతినిధులు తమ తమ ప్రజలకు మంచి చేయడానికీ, చెరుపు చేయడానికీ అధికారం తమ చేతులలో పెట్టుకున్నారు. సాధారణప్రజ నిస్సహా యంగా, నిర్వీర్యంగా తయారయింది; ప్రభుత్వం అనేది లేక పోతే తామేమీ చేయలేమని వారి భ్రమ. వోటుచేయడం ఒక్కటే ప్రజలకున్న హక్కు. కాపలా దారుని యెన్నుకునే హక్కు గొర్రెల కుంటే ఎంత ప్రయోజనమో ఇదీ అంతే. అంతమాత్రంచేత గొర్రెల స్థితి బాగుపడదు. ప్రభుత్వం తన చేతుల్లోకి అధికాధికంగా అధికారాన్ని చేర్చుకొంటూ వుంటే, ప్రజలు యీ విధంగా భ్రమలోపడి వుంటున్నారు.

"కమ్యూనిస్టులు ఎప్పటికో ప్రభుత్వవ్యవస్థ అంతరించా లంటారు గాని ఈనాడు అది బలపడవలసిందే నంటారు. ఈవేళ ప్రభుత్వ వ్యవస్థను బలపరచాలనడం బానిసత్వాన్ని సమర్థించడమే. అందుచేతనే ప్రభుత్వవ్యవస్థ వెంటనే క్షీణిం చాలని సర్వోదయ భావన అంటుంది.

"ఇక వ్యక్తులంతా తమ శరీరక, మానసిక శక్తు లన్నింటినీ అదుపులో వుంచుకోడం నేర్చుకోవాలి. వ్యక్తుల పరస్పర ప్రయోజనాల మధ్య తగాదా వుండదనేది మనస్సులో పెట్టుకొని నూతన సమాజ వ్యవస్థను ఏర్పరచాలి. ప్రభుత్వ వ్యవస్థ అనవసరమని ఎరిగి దానిని రద్దు పరచేటందుకు మన మీనాటినుంచీ పని ప్రారంభించాలి"

(అదే పుస్తకం, పుట 30)

రాజ్యాంగయంత్రం గురించిన మార్క్సిస్టు దృక్పథానికీ వినోబాజీ ఆలోచనలకూ తేడా వున్నదని దీనినిబట్టి తెలుసుకోవచ్చు.

అరాజ్యవాద దృక్పథం

ఒకవర్గం మరోవర్గంమీద అధికారం చెలాయించేటందు కుపయోగించే పనిముట్టు కాదట రాజ్యాంగయంత్రం; కొద్దిమంది వ్యక్తులు మిగిలినవారిమీద పెత్తనం చెలాయించే ఒక వ్యవస్థ మాత్రమేనట అది. సమాజంకంటె అది పై స్థాయిలో వుంటుందట. కొద్దిమంది వ్యక్తుల చేతులలో ఆర్థిక రాజకీయాధికారం అంతా కేంద్రీకరింపబడ్డంవల్ల అది వ్యక్తి స్వాతంత్ర్యాన్ని పరిమితం చేస్తుందనీ, అందుచేత రాజ్యాంగయంత్రం చెడ్డదనీ వారంటారు. సంకుచితమైన ఒక వర్గంచేతిలో ఆర్థికపెత్తనాన్ని కేంద్రీకరింపజేసి ప్రస్తుతపరిస్థితులను కల్పించడానికి కారణం ఆర్థిక దోపిడీ అని వారంటారు; పెట్టుబడిదారీ దోపిడీ కాదంటారు. కొద్దిమంది చేతులలో అధికారం కేంద్రీకరింపబడడానికి కారణం రాజ్యాంగయంత్రమే నంటారు సర్వోదయవాదులు.

ఈ దృక్పథం కొత్తది కాదు. యూరప్‌లోని అరాజ్యవాదులు (Anarchists) రాజ్యాంగయంత్రానికీ, వ్యక్తులకూగల సంబంధాలనుమాత్రమే ఆలోచించేరు. పెట్టుబడిదారీరాజ్యాంగయంత్రంమీద సాగించవలసినపోరాటంయొక్క వర్గస్వభావాన్ని వారు మరచిపోయేరు. కమ్యూనిస్టు సమాజంలో రాజ్యాంగయంత్రం రద్దుఅవుతుందనే శాస్త్రీయదృక్పథానికి ప్రత్యామ్నా

యంగా 19 వ శతాబ్దంనాటి యూరపియన్ అరాజ్యవాదులు మోటుగా అధికార వ్యతిరేకతను ప్రదర్శించేరు. వెంటనే రాజ్యాంగయంత్రం రద్దుకావాలన్నారు. వ్యక్తిమీద ఏవిధమైన పెత్తనమూ ఎవరికీ వుండరాదన్నారు. విప్లవకర శ్రామికవర్గం ధోరణినిగాక బూర్జువా సమాజంలోని మొండి వైయక్తిక (Individualist) ధోరణులను వారు ప్రకటించేరు.

19 వ శతాబ్దంలో యూరపులో బకునిన్, ప్రౌఢాన్ మొదలయినవారి అనుచరులలో ప్రబలంగావున్న వైయక్తిక ధోరణులవంటి అభిప్రాయాలనే వినోబాజీ రాజ్యాంగ యంత్రం, సమాజవ్యవస్థ, రాజకీయాలు మొదలయిన వానిని గురించి తెలియపరచేరు. అందులో అసహజం ఏమీ లేదు. ఏమంటే వినోబాజీ సర్వోదయ సిద్ధాంతం పీడిత విప్లవకర వర్గంమీదగాక, అన్ని వర్గాలనుంచీ వచ్చిన వ్యక్తుల మీద ఆధారపడుతుంది.

ఈనాడున్న జాతీయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడడం వినోబాజీ కిష్టంలేదని ఇంతకుముందే తెలుసుకున్నాం. దాని నాయన ఒక సిద్ధాంతంగా పరివర్తన పొందించేరు. ప్రస్తుత పాలకవర్గంమీద రాజకీయ పోరాటం జరపనక్కర్లేకుండానే రాజ్యాంగయంత్రంలేని నూతన సమాజాన్ని సమకూర్చగలమని ఆయన ప్రజలకు వాగ్దానం చేస్తున్నారు. వర్గ రహితమైన, రాజ్యాంగ రహితమైన సమాజం కావాలనే అభిప్రాయాన్ని మార్క్సిజంనుంచి సర్వోదయవాదులు స్వీకరించినా దానిని సాధించడమెలాగో వారికి అర్థం కాలేదు. రాజకీయ పోరాటం పనికిరాదనటంవలన యిప్వ

డున్న వర్గాధికారమే కొనసాగుతుంది. వర్గరహితమైన, రాజ్యాంగ రహితమైన సమాజానికి కావలసిన పూర్వ్వ రంగాన్ని తయారు చేసుకోకుండా ఆటంకం కలిగిస్తుంది. వర్గ రహితమైన రాజ్యాంగ రహితమైన సమాజంయొక్క ఆశయాలు సర్వోదయ విధానంవలన నెరవేరవు.

కమ్యూనిజం, వర్గరహిత సమాజం ఏర్పడే సంధియుగంలో శ్రామికవర్గంయొక్క ప్రభుత్వం ఏర్పడవలసిన అవసరాన్ని వినోబాజీ గుర్తించడంలేదు. ఆయన దృష్టిలో అన్ని ప్రభుత్వాలు చెడ్డవే. నూతన సమాజ నిర్మాణంలో శ్రామిక వర్గ ప్రభుత్వపు పాత్ర ఉందని ఆయన అభిప్రాయం. భూదాన విప్లవం విజయవంతంగా నిర్వహించబడాలంటే భూదాన వాదులు ప్రభుత్వాన్ని పట్టుకోవాలని శ్రీ కృపలానీ అన్నప్పుడు వినోబాజీ దానితో భేదించేరు. ఆ విషయాన్ని స్పష్టంగా చెప్పేరు కూడ:

"రాజకీయాధికారం నాచేతిలో ఉండవలసిన అవసరం లేదనుకుంటాను. దానిని అదుపులో ఉంచగల్గితే చాలు."

రాజనీతికిబదులు (రాజకీయాధికారం) వినోబాజీ లోకనీతి ((ప్రభుత్వాన్ని అదుపులో పెట్టగల ప్రజాశక్తి) చాలునంటారు. ఖద్దరు ప్రచారం, గ్రామ పరిశ్రమలు, నూతన విద్యావిధానం మొదలైన వాటిని ప్రస్తుత ప్రభుత్వం అనుసరిస్తూండటం భూదానంయొక్క ఫలితమేనని ఆయన అభిప్రాయం. ప్రజలు ప్రభుత్వాధికారాన్ని చేతబట్టుకోకూడదనీ, బయట ఉండి దానిని అదుపులోపెట్టాలనీ,

రాజ్యాంగయంత్రాన్ని రద్దుచెయ్యడం యిల్లాగేననీ ఆయన అభిప్రాయం.

ఒకవైపు ప్రస్తుత రాజ్యాంగయంత్రాన్ని అదుపులో పట్టుకోవాలని ఆయన అనుకుంటున్నారు. మరోవైపున సామాజికవిప్లవం అక్కర్లేకుండా, ఆర్థిక వ్యవస్థలో నుంచి వర్గాలను తొలగించనక్కర లేకుండా రాజ్యాంగయంత్రాన్ని ఈవేళనుంచే రద్దుచేసేటందుకు ప్రజాశక్తుల్ని కదిలించాలని కోరుతారు. దోపిడీ విధానాన్ని రద్దుపరచి ఉత్పత్తిని సమాజపరం చేసేక రాజ్యాంగయంత్రం డుళ్ళిపోతుందనేది విప్లవకరమైనశాస్త్రీయ మార్క్సిస్టు అభిప్రాయం. దానిని కాదని రాజ్యాంగ యంత్రాన్ని యిక్కడే యిప్పుడే రద్దుచెయ్యాలనేఊహాకల్పనలను వినోబాజీ ప్రతిపాదిస్తున్నారు.

## పార్టీలయెడ దృక్పథం

రాజకీయ పార్టీలంటేనూ, ఎన్నికలంటేనూ, అత్యధిక సంఖ్యాకుల పాలన అంటేను వినోబాజీకి అంగీకారంలేదు. దానిని చూస్తే, అనేక సమస్యలమీద రాజకీయాలకు పెత్తందారీ తనానికి వ్యతిరేకంగా ఆయన నిలబడుతున్నారని అర్థమవుతుంది. ఈనాటి రాజ్యాంగయంత్రాన్ని, సమాజాన్ని ఆయన విమర్శించే పద్ధతి చూస్తే విప్లవకరమైన శ్రామికవర్గం యొక్కదృక్పథంకాక పెత్తందారీతనాన్ని వ్యతిరేకించేనైయత్తిక ధోరణి కనిపిస్తుంది. ప్రజాతంత్ర విధానంకోసం ప్రపంచ వ్యాప్తంగా సాగుతూన్న ఉద్యమంయెడల ఆయన తెలుపుతూన్న అభిప్రాయం యిది :

"ఒక శతాబ్దంపైగా ప్రపంచంలో ప్రజాతంత్ర విధానం గురించి పరిశీలనలు సాగుతున్నాయి. దానిని గురించి భిన్న భిన్న దృక్పథాలున్నాయి. కొందరిని మితవాదులంటున్నారు; కొందరిని అతివాదు లంటున్నారు. ప్రపంచంలోని రాజకీయ వేత్తలందరూ అనేక పార్టీలుగా గ్రూపులుగా, విభిన్న సిద్ధాంతాలను అనుసరించే వారుగా విభజింపబడియున్నారు...... కాని విభిన్నధోరణులు ఆధారంగా పార్టీలేర్పడ్డాక వారు సిద్ధాంతాలమీద కంటె నిర్మాణం, క్రమశిక్షణ, ప్రచారం మొదలైనవాటిని గురించి శ్రద్ధచూపిస్తారు. రాజకీయాధికారాన్ని వశపరచుకునేటందుకు పార్టీ ఒక పనిముట్టు. అధికారంకోసంసాగే రాజకీయ పోటీలో సిద్ధాంతాలు ట్రేడ్ మార్కులుగా తయారవుతుంటే, అధికారానికి ప్రాముఖ్యత ఏర్పడుతుంది."

(వినోబా, 'శాసన ఆశయం : పుట 251).

ఈ వర్ణన అధికారంలోనూ, ప్రతిపక్షంలోనూ వున్న బూర్జువా పార్టీలకు సరిగ్గా అతుకుతుంది. ఆ పార్టీలు ప్రజలకు వాగ్దానాలు అనేకం చేస్తాయి. కాని పెట్టుబడిదారీవర్గం యొక్క పనుల్ని చేస్తాయి. అయితే వినోబాజీ తన వర్ణనను అన్ని పార్టీలకూ - శ్రామికవర్గ పార్టీలకూ, ఇతర పీడిత ప్రజల ప్రయోజనాలకోసం పనిచేసే పార్టీలకూ - కూడా వర్తింప చేస్తున్నారు. ఈ పార్టీలు అధికారంలో వున్న బూర్జువా పార్టీలతో సాగించే పోరాటం కేవలం అధికార కాంక్షాప్రేరితం కాదు. పీడితవర్గాల విమోచనకోసం సాగించేది. రాజ్యాంగయంత్రాన్ని గురించీ, రాజకీయ పోరా

టాన్ని గురించీ తనకున్న అభిప్రాయాల మూలంగా వినోబాజీ వర్తమాన యుగంలోని ప్రధాన సమస్యలను గమనించడం లేదు. ఈ వర్గాలమధ్య పోరాటానికీ, నూతన సామాజిక వ్యవస్థను ఏర్పరచేటందుకు జరిపే పోరాటానికీ సంబంధం లేదని ఆయన అభిప్రాయం. వ్యక్తులమధ్య అధికారంకోసం జరిగే పోరాటంగానే ఆయన దానిని భావిస్తున్నారు.

భారతదేశంలోని రాజకీయ పార్టీలమీద ఆయన ఈ విధంగా తీర్పు యిస్తున్నారు.

"కాంగ్రెసు ప్రజాసేవ చేయలేదు. ఏమంటే ప్రజాసేవ అనేది కాంగ్రెసు దృష్టిలో అపహాస్యంగా వుంది. వారు అధికార వ్యామోహంలో మునిగి తేలుతున్నారు. కమ్యూనిస్టులు దౌర్జన్యంతప్ప మరొకటి ఆలోచించరు. ఈ పరిస్థితులలో సర్వోదయ సమాజంఒక్కటే పని చేయగలదు."

([illegible], పుట 51)

రాజకీయాలకు దూరంగా వుండడాన్ని సమర్థిస్తూ వినోబాజీ ఇల్లా అన్నారు:

"దేశం స్వతంత్రం కానంతవరకూ రాజకీయాధికారాన్ని చేజిక్కించుకోనేటందుకు శక్తినంతానూ వినియోగించాలి. రాజకీయాధికారం చేజిక్కిన తర్వాత సాంఘిక, ఆర్థిక విప్లవం సాధించేటందుకు సర్వప్రయత్నాలూ చెయ్యాలి. అందుచేత రాజకీయాధికారం స్వాధీనం చేసుకోవడంలోనే జయం వున్నదనుకొంటే అసలు స్వరాజ్యం అనేదాని రహస్యాన్ని గ్రహించలేదంటాను. భూదాన యజ్ఞంమీద ఆధారపడిన దౌర్జన్యరహిత విప్లవంకోసం జీవితాన్ని అంకితం చేసినవా

రందరూ ప్రధానమైన సామాజికపరిణామాన్ని తీసుకురావలసి వుంటుందనే విషయాన్ని విస్మరించరు. భూదానోద్యమం పార్టీ భేదాల్ని అంతరింపజేస్తుంది. నేను చెప్పిన లోకనీతిని స్థాపిస్తుంది. ప్రభుత్వ విధానాల ఫలితంగా వచ్చినదిగాక నూతనమైన, సజీవమైన సామాజిక చైతన్యాన్ని సృష్టిస్తుంది."

(అదే పుస్తకం, పుట 292)

ఎన్నికలకు అభ్యంతరం

రాజకీయ పార్టీలకేగాక ఎన్నికలకుకూడా వినోబాజీ ఆటంకం చెప్పారు.

"మనందరం జాతి, మత భేదాల్ని మరచిపోవాలి. అది ఈ యుగప్రభావానికి నిలబడలేదు. రాజకీయపార్టీలు ఎన్నికల పద్ధతులూ కొత్తభేదాల్ని సృష్టిస్తాయి. మంచిపని చేయడానికైనా సమాజ సేవకులు కలిసిరాకుండా అవి ఆటంకాలు కలిగిస్తాయి. బలహీనంగా, బీదతనంలో వున్న దేశానికి సేవ చేయకుండా ఆటంక పరుస్తాయి. ఎన్నికలనేవి పాశ్చాత్య రాజ్యాలనుంచి మనకు వచ్చేయి. ఇది ప్రతిగ్రామాన్ని చీల్చేసింది. పార్టీలలోనే చీలికలువచ్చి ఆ తగాదాలలో దేశంయొక్క శక్తిసామర్థ్యాలు నాశనం అవుతున్నాయి."

(అదేపుస్తకం, పుట 151)

గడచిన రెండు ఎన్నికల్నీ పరిశీలిస్తే భారతదేశ ప్రజల్లో సావధానత పెరుగుతూందని గ్రహించగలుగుతాం. కాంగ్రెసు ఒక వర్గంయొక్క అధికారాన్ని కొనసాగిస్తూంది. స్వార్థపరత్వంతో కూడిన, అవినీతికర ప్రభుత్వాన్ని కొనసాగిస్తూంది. ప్రజలకు దానిమీద విశ్వాసం సడలిపోతూంది.

క్రమంగా వారు వామపక్షాలవేపు మళ్లుతున్నారు. కేరళలో ప్రజలు కమ్యూనిస్టులకు ప్రభుత్వాధికారాన్ని నప్పజెప్పారు. కాని ఇవన్నీ ఘర్షణలుగానే, గ్రామ అనైక్యతగానే వినోబా జీకి కనబడుతున్నాయి.

రాజకీయపార్టీలనూ, వాని రాజకీయ కార్యక్రమాల్నీ అనుమానిస్తూ వినోబాజీ పార్లమెంటరీ ప్రభుత్వానికీ, మెజారిటీ పాలనకూ వ్యతిరేకత తెలుపుతున్నారు. అధిక సంఖ్యాకుల పాలన అనేది కృత్రిమమైన రాజకీయ విజ్ఞానపు సృష్టియని ఆయన ఉద్దేశం. బ్రిటన్‌లో వోటింగ్ హక్కు కోసం జరిగిన పోరాటాన్ని భార్యాభర్తల మధ్య వర్గ పోరాటంగా చిత్రించి ఆయన ఇల్లా అంటున్నారు :

" భార్యలు పార్లమెంటులో భర్తలమీద కోడిగుడ్లు విసిరి ఏడిపించవలసివచ్చింది. చివరకి భర్తలు భార్యల కోరికలకు తలవంచవలసి వచ్చింది. వారికి వోటుహక్కు నియ్యవలసివచ్చింది. మన దేశంలో తండ్రులకూ తల్లులకూ మధ్య అటువంటి తగవులెన్నడూ లేవు అల్లాంటి పేచీలు ఇంగ్లండులో వచ్చేయి. స్త్రీలు పోరాడవలసి వచ్చింది. ఆ ఊహా కల్పిత పోరాటంలో కృత్రిమమైన సామాజిక విజ్ఞానం ఉద్భవించింది.

" ఈ ఘర్షణను పరిష్కరించేటందుకే రాజకీయ శాస్త్రం పుట్టింది. అధికసంఖ్యాకుల యిష్టానుసారం అన్నీ జరగాలని అది చెప్తుంది. వోట్లు లెక్కించడం ప్రారంభించింది. అనుకూలంగా 51 వోట్లు, వ్యతిరేకంగా 49 వోట్లువస్తే మెజారిటీ సభ్యులది యిష్టారాజ్యం. ఒక హత్యకేసులో నిందితుడు

నిర్దోషియని యిద్దరు జడ్జీలూ, దోషియని ముగ్గురూ చెప్పి నప్పుడు అధికసంఖ్యాకుల అభిప్రాయం ప్రకారం వానిని ఉరి తీసినఘట్టం నే నెరుగుదును. మెజారిటీ తీర్పు అమలు జరిగి పోయింది. ఈ విధంగా మెజారిటీవోటు ప్రకారం పరిపాలన సాగడమూ, మైనారిటి దానికి కట్టుబడి వుండడమూ అనేది వచ్చింది... మన దేశాన్ని పాలించిన బ్రిటిష్‌వాళ్ళు ఈ మెజారిటీపాలన అనే అభిప్రాయాన్ని తెచ్చిపెట్టారు. పాశ్చాత్యులనుంచి నేర్చుకొన్న ఈ మెజారిటీ పరిపాలన మనకేమీ లాభకరంకాదు."

(సర్వోదయానికి ఆధారం, 'సంగతి' పుట 14)

ఎన్నికలనేవి పాశ్చాత్యం. మెజారిటీపాలన పాశ్చాత్యం. అది భారతదేశానికి సరిపడదు. ఇదీ సర్వోదయ నాయకుని దృక్పథం. బూర్జువా ప్రజాతంత్రాన్ని మార్క్సిస్టులు విమర్శించే పద్ధతికీ, దీనికీ పోలికలేదు. ఇది కేవలం నామ మాత్రమైన, పరిమితులతో కూడిన విమర్శ. వినోబాజీ వర్గాల వునికిని గమనించి వున్నట్లయితే అల్పసంఖ్యాకవర్గం కష్టజీవులయిన అధిక ప్రజానీకంమీద పెత్తనం చేస్తున్నదని గ్రహించ గలిగేవారు. కొద్దిమందిచేతుల్లో ఉత్పత్తి సాధనాలు కేంద్రీకరింపబడి వుండే పెట్టుబడిదారీ సమాజంలో అధిక సంఖ్యాకులపాలన పేరుకుమాత్రమేననీ, దోపిడీసాగించే కొద్ది మంది పాలనే నిజంగా సాగుతూందనీ చెప్పగలిగేవారు. ఈ ప్రధాన విషయాలను చూడకుండా ఆయన అసలు మెజారిటీ పాలనే కూడదంటున్నారు. దానివలన అధిక సంఖ్యాకులకీ, అల్పసంఖ్యాకులకూ మధ్య ఘర్షణ పుడుతుందట. అల్ప

సంఖ్యాకులకూ, అనేకసంఖ్యాకులకూ మధ్య సమరసభావం పేరుతో ఆయన పార్లమెంటరీ విధానాన్నీ, ఎన్నికలనూ పూర్తిగా నిరసించేరు.

మెజారిటీ పాలనకు ప్రత్యామ్నాయంగా వినోబాజీ చూపేదేమిటి ?

"దీనికి మనవద్ద ఒక విరుగుడు వుండేది. పంచాయితీ దార్లు అయిదుగురూ భగవద్వాక్యం పలుకుతారని మన పూర్వులనేవారు. పంచాయితీదారులు ఏకవాక్యంగా వుండాలని మనవాళ్ళంటారు; పరిపాలనా వ్యవహారాలన్నింటా ఏక వాక్యత ప్రధానంగా స్వీకరించబడేది. కాని యిప్పుడీ సామాజిక విజ్ఞానం మెజారిటీ నిర్ణయాలను ఆమోదించమంటుంది ... ఇదే ప్రపంచానికి చిచ్చుపెట్టింది"

(అదే పుస్తకం, పుట 16-17)

వినోబాజీ ఆదర్శ సమాజంలోకూడ నిర్ణయాలు ఏక వాక్యతను బట్టేగాని చేతుల లెక్కమీద ఆధారపడి వుండవు. సమాజక్షేమం, సౌఖ్యం గురించిన సమస్యలమీద ఒక్కొక్కప్పుడు తీవ్ర భేదాభిప్రాయాలు ఏర్పడవచ్చు. అటువంటి సందర్భాలలో ఆ సమస్య ఎంత ముఖ్యమైనదయినా దాని మీద నిర్ణయం తీసుకోకుండా వాయిదా వేస్తారు.

బకునిన్‌సు గురించి ఏంగెల్సు వ్రాసిన క్రిందివాక్యాలను చూడండి :

"బకునిన్ అభిప్రాయం ప్రకారం రాజకీయ పోరాటం కోసం "ఇంటర్నేషనల్" ఏర్పడివుండలేదు. సామాజికవ్యవస్థ నిర్మూలనంకాగానే అది పాత రాజ్యాంగ వ్యవస్థ స్థానాన్ని

స్వీకరిస్తుంది. భవిష్యత్తులో ఎటువంటి సమాజం వుండాలని బకునిన్ ఆశిస్తున్నాడో అటువంటి సమాజాన్ని ఇంచుమించుగానైనా నెలకొల్పాలని ఆయన వుద్దేశం. ఆ సమాజంలో అన్నింటికన్న ముఖ్యంగా పరిపాలన అనేది వుండదు. ఏమంటే పరిపాలన-రాజ్యాంగయంత్రం అనేవి అన్ని పాపాలకూ మూలమని ఆయనవుద్దేశం (అయితే ఎవరో ఒకరు నిర్వహించేవారూ నిర్ణయించేవారూ లేకుండా ఒకఫ్యాక్టరీని వీరెల్లా నడుపుతారో, రైళ్ళని ఎలా నిర్వహిస్తారో, ఓడల్ని ఎలా నడుపుతారో చెప్పరు). అధిక సంఖ్యాకులమీద అల్పసంఖ్యాకుల పాలన అంతరిస్తుందట. ప్రతివ్యక్తి, ప్రతిగ్రామం (కమ్యూనిటీ) కూడ స్వతంత్రం. ఇద్దరేవున్న సమాజంలో కూడ వ్యక్తులు తమ స్వాతంత్ర్యాన్ని త్యజించకపోతే ఆ సమాజం ఎల్లా నడుస్తుందో బకునిన్ మాట్లాడడు."

(మార్క్స్ - ఏంగెల్స్ సెలక్టెడ్ వర్క్స్, సంపుటం 2, మాస్కో; పుట 424)

ఏకవాక్యత పేరుతో సామాజిక నిర్ణయాలు జరగకుండా అల్పసంఖ్యాకులు వీటో చేస్తారు. అధికసంఖ్యాక పాలన అంటే సర్వోదయవాదులు చూపే భయాని కదీ ఫలితం. అధిక సంఖ్యాక పాలన అంటే ఈ భయం ఎందుకు? అది వ్యక్తి స్వాతంత్ర్యం పేరుతో సామాజిక పరిమితులన్నీ తొలగించబడాలనే పచ్చి స్వాతిశయ ధోరణికి ఫలితం అనాలి.

దీనినిబట్టి ఒకటి తెలుస్తూంది. రాజ్యాంగం, పార్లమెంటరీ విధానం, ఎన్నికలు, మెజారిటీ పాలన మొదలగు

వానిమీద వినోబాజీకిగల అభిప్రాయాలు నూతన సమాజ వ్యవస్థను నిర్మించడానికి తోడ్పడవు. ఆయనది విప్లవకర వర్గం యొక్క దృక్పథంకాదు. సామాజికంగా కలిసివుండే టప్పుడు తప్పనిసరి అయ్యే సామాజిక పరిమితులకు అసంతృప్తుడయ్యే వాని స్వాతిశయ స్వభావం అందులో కనబడుతుంది. ప్రస్తుత పార్లమెంటరీ విధానాన్ని చిందరవందర చేసేటట్లు విప్లవకరమైన విమర్శ చేసిన మార్క్సిస్టు దృక్పథానికీ దీనికీ పోలికలేదు. ప్రచార సాధనాలన్నీ పాలకవర్గం చేతిలో వుండగా జరిగే ఎన్నికల పరిమితుల్నీ, వర్గపాలన సాగుతుండేకాలంలో మెజారిటీ పాలనలోవుండే పరిమితులనూ మార్క్సిస్టులు చాల నిశితంగా చూపించేరు దోపిడీ సాగిస్తున్న పెట్టుబడిదారీ వర్గంయొక్క ఆర్థికాధికారాన్ని తొలగించి, దాని స్థానే ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేసినప్పుడే ప్రజానీకం యొక్క హక్కులకు హామీనివ్వగల ప్రభుత్వం ఏర్పడగలదని ఆ విమర్శల నుంచి గ్రహించగలం.

వి కేం ద్రీ క ర ణ

అతి ప్రధానములైన ఇతర సమస్యలమీద కూడా సర్వోదయ వాదులకు ఇల్లాంటి తప్పు అభిప్రాయాలే వున్నాయి. ఈనాడు ఆర్థిక, రాజకీయ సత్తాలు బాగా కేంద్రీకృతం అయివున్నాయి. అందుకు వారు అసమ్మతి తెలపడం న్యాయమే. ఆర్థిక, రాజకీయ సత్తాల వికేంద్రీకరణ మీద వారి ఆదర్శ సమాజం ఆధారపడుతుంది. కాని, వికేంద్రీకరణను వారు తప్పుగా అర్థం చేసుకున్నారు. సాధ్యమైనంతవరకు పెద్దతరహా పరిశ్రమలు కూడదన్నట్లు వారు

అర్థంలేనిది. శాస్త్ర విజ్ఞానం ఇక అభివృద్ధి చెందరాదనీ, మానవుని ఉత్పాదకశక్తి పెరగరాదనీ వారి వుద్దేశం.

"సాధ్యమైనంతవరకు ప్రతి ప్రాథమిక యూనిటూ తన అవసరాలను తానే తయారు చేసుకోవాలి. అదే దాని స్వాతంత్ర్యాన్ని రక్షిస్తుంది. పెద్దయంత్రాలనుపయోగించి వుత్పత్తిని కేంద్రీకృతం చేయడంవల్లను సంపదలు అధికారం కేంద్రీకృతం అవుతాయనేది అందరకూ తెలిసిన అంశం. ఇతరులను అదుపులో పెట్టుకోవాలనే ధోరణి దోచుకోవాలనే ధోరణి ప్రబలుతుంది అందుకే నూతన సమాజం వికేంద్రీకరణ కావాలనడం...ఉత్పత్తిని వికేంద్రీకృతం చేసి నప్పుడు యంత్రపరికరాలు క్రమంగా అభివృద్ధిపొందే అవకాశం వుంది."

వినోబాజీ ఆదర్శ సమాజంలో మార్పిడి అల్పంగా వుంటుంది. గ్రామాలలో ప్రధానంగా చిన్న రైతుల వుత్పత్తి వుంటుంది. పెద్దతరహా పరిశ్రమల్ని, పెద్ద యంత్రాల్ని అట్టే వుపయోగించరు. స్వయం సమృద్ధికి ఎక్కువ ప్రాముఖ్యత నిస్తారు. ఈ మాదిరి వికేంద్రీకరణ మానవుని ఉత్పాదక శక్తి పెరగకుండా ఆటంకపరుస్తుంది. ప్రథమంలోనే గరిష్ట పరిమితిని నిర్ణయించి అంతకుమించి ఎక్కువ కాకూడదు అంటుంది. పెద్దయంత్రాలను వుపయోగించరాదనడమూ, విజ్ఞాన శాస్త్రాన్ని సామాజికోత్పత్తికి తోడ్పడకుండా నిరోధించడమూ జరిగితే సమాజంలో జీవనస్థాయి చాల హీన స్థితిలో ఉండిపోతుంది. 'శక్తి' కొద్దీ పని – 'అవసరాల్ని పట్టి అనుభవము' – అనే సూత్రాన్ని సమాజం ఎన్నటికీ అమలు

జరపలేదు. అది అమలు జరపాలంటే పనివాని ఉత్పాదక శక్తి విపరీతంగా పెరగాలి. ప్రజలందరు ఏ వస్తువును ఎంత కావాలన్నా సప్లయి చేయగలస్థితి సమాజంలో వుండాలి. పెద్ద యంత్రాల్నీ, పెద్దతరహా పరిశ్రమల్నీ పనికట్టుకుని కూడదంటే ఆ స్థితిని సాధించలేము. "అవసరాల్నిబట్టి అనుభవం" వుండాలంటూ చెప్పిన ఆశయానికి చిన్నరైతులు సాగించే వ్యక్తిగతోత్పత్తి పరమశత్రువు. ఈ రహస్యాలను మార్క్సిస్టులు నూరేళ్లుగా ఎరుగుదురు. వానిని విస్మరిస్తున్న వారిని దారిలో పెట్టేటందుకు పొడూగునా వారు ప్రయత్నిస్తూనే వున్నారు.

శారీరక, మానసిక శ్రమలు

సర్వోదయవాదులు శారీరక, మానసికశ్రమల మధ్య భేదాన్ని అంతరింపచేయాలని కూడ కోరుతారు. కాని, దానిని వారు సాధించలేరు. సాధించలేకపోవడానికి కారణం పైన చెప్పినదే. అసంఖ్యాక ప్రజాకోటిని యాంత్రిక, శారీరక శ్రమలో వినియోగించడమూ, మానసికశ్రమ చాల కొద్ది మంది గుత్తసొమ్ము కావడమూ అనేది పెట్టుబడిదారీ సమాజం తెచ్చిన దుస్థితులలో ఒకటి. ఒక్క పెట్టుబడిదారీ సమాజంలోనే కాదు. దోపిడీవర్గాల పాలనమీద ఆధారపడి ఏర్పడిన సమాజా లన్నింటిలోనూ అదే పరిస్థితి. నూతన సమాజ వ్యవస్థలో ఆ దుస్థితి వుండకూడదు. ప్రతిఒక్కరూ ఏదో ఒక శారీరకశ్రమలో పాల్గొంటే శారీరక, మానసిక శ్రమల మధ్య భేదం అంతరిస్తుందని సర్వోదయవాదుల నమ్మకం. కాని, ఉత్పత్తి కార్యక్రమాలలో అందరూ

పాల్గోవడం, సామాజికోత్పత్తి విపరీతంగా పెరిగి పనిగంటలు బాగా తగ్గడం, ఆ విధంగా ఉత్పత్తిదారులైన ప్రజానీకానికి మానసిక వ్యాపారాలలో పాల్గొనేటందుకు తగినంత విశ్రాంతి నివ్వడం – జరిగినప్పుడు ఆ భేదం అంతరిస్తుంది.

సమాజంలో అత్యధికభాగం జీవితావసరములయిన పదార్థాల తయారీలోనే అత్యధిక కాలాన్ని వినియోగించవలసి వున్నప్పుడు వారు మానసిక వ్యాపారాల్లో పాల్గోలేరు. మానసిక, శారీరకశ్రమల మధ్య భేదం అంతరించదు. సర్వోదయ సమాజంలో పెద్దతరహా పరిశ్రమల్ని వుపయోగించరాదని, పెద్దయంత్రాల్ని వుపయోగించరాదనీ నిషేధం పెట్టినప్పుడు పనిగంటల సంఖ్యను విశేషంగా తగ్గించడం సాధ్యంకాదు. అందుచేత ఆ సమాజంలో ఆ భేదం తొలగదు.

శారీరక, మానసిక శ్రమలమధ్య అంతరం తొలగాలంటే ప్రజల జీవనస్థాయి బాగా పెరగాలి. ఉన్నత సాంస్కృతిక జీవితం కలగాలి. పని గంటలసంఖ్య బాగా తగ్గాలి. మానసిక వ్యాపారాల్లో పాల్గొనేటందుకు ఖాళీ వుండాలి. విజ్ఞానశాస్త్రాన్ని ఉత్పత్తి విధానంలో వుపయోగించేటందుకు ఏ విధమైన విధినిషేధాలూ లేనప్పుడే యిది సాధ్యం.

ఈ సందర్భంలో ఎంగెల్స్ యిలా తెలియజేసేడు :

"వెనుకటి ఉత్పత్తి విధానాన్ని పైనుంచి క్రిందికంటా మార్చాలి. ముఖ్యంగా వెనుకటి పనివిభజన రద్దుకావాలి. మానవుడు జీవించగలగాలంటే ఉత్పత్తి కవసరమైన శ్రమ చెయ్యాలి. తాను చేయవలసిన శ్రమభాగాన్ని ఇతరులచే చేయించే అవకాశం ఏ వ్యక్తికీ లేకుండా వుండేలాగ ఉత్ప

విధానాన్ని సంఘటిత పరచాలి. అంతేకాదు. ఉత్పత్తి కవసరమైన శ్రమ మనుష్యుని బానిసత్వానికి మూలం కాకూడదు. అతని విమోచనానికి మూలంకావాలి. ప్రతి మనిషికీ తనకున్న శారీరక, మానసిక శక్తి సామర్థ్యాల్ని సర్వతోముఖంగా వృద్ధిపరచుకొనేటందుకూ, వినియోగించుకొనేటందుకూ అది అవకాశం ఇవ్వాలి. అల్లా జరిగినప్పుడే ఉత్పత్తికవసరమైన శ్రమ బరువుకావడానికి బదులు ఆనందకరం అవుతుంది.

"ఈనాడిది ఆకాశసౌధమూ కాదు, ఊహాచిత్రమూ కాదు. ఈనాడు ఉత్పాదకశక్తులు బాగా అభివృద్ధి పొందేయి వానిని సమాజపరం చేయాలి. ఆటంకాలను, అవకతవకలను రద్దుపరచాలి. పెట్టుబడిదారీ వుత్పత్తి విధానంవల్ల జరుగుతున్న ఉత్పత్తియొక్క, ఉత్పత్తి సాధనాలయొక్క దుర్వ్యయం జరగకుండా చెయ్యాలి. అప్పుడు ప్రతి ఒక్కరూ తమవంతు పనిని చేసినట్లయితే, పని చేయవలసిన కాలాన్ని ఇప్పటికన్న చాల తక్కువగా వుండేటట్లు చేయవచ్చు."

(ఆంటీ - డూరింగ్ పుట 438)

శారీరక మానసిక శ్రమలమధ్య అంతరాన్ని పోగొట్టాలంటే రెండు పనులు జరగాలి. ఒకటి: అందరూ ఉత్పత్తికరమైన కార్యక్రమంలో పాల్గొనడం. రెండు ఉత్పాదక శక్తి విపరీతంగా పెరిగి పనిగంటలు తగ్గడం. ఉత్పత్తి కరమైన శ్రమ బరువు అనడం పోవాలి. ప్రతి ఒక్కరూ మానసిక వ్యాపారాలలో పాల్గొనగలిగేటట్లు తగినంత విశ్రాంతి వుండాలి. సర్వోదయవాదులు వీనిలో మొదటి అంశాన్ని

గుర్తించేరు. రెండో దానిని వదలిపెట్టేరు. పెద్దతరహా పరిశ్రమలను నిషేధించే విధంగా వికేంద్రీకరణ జరగాలన్న విధానమే, రెండో అంశం కార్యరూపం ధరించడానికి ఆటంకం.

పెద్దతరహా పరిశ్రమలు

ఆర్థికశక్తి ఈనాడులాగ కేంద్రీకృతం అయివుండరాదని సర్వోదయవాదులు చెప్పేది సరియైనదీ, న్యాయమైనదీ కూడ. కాని దురదృష్టవశాత్తూ ఆర్థికబలం కేంద్రీకృతం కావడానికి పెద్దతరహా పరిశ్రమలే కారణమని వారు భావిస్తున్నారు. పరిశ్రమలయొక్క చిన్న పెద్దతనాలు ఆర్థికబలం కేంద్రీకృతం కావడానికి కారణాలు కాజాలవు. ఆ పెద్ద పరిశ్రమలు వ్యక్తుల స్వత్వం కావడమే దానికి కారణం. ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేయడంతో ఈ కేంద్రీకరణ పూర్తిగా తొలగుతుంది. ఇది ఒకటి. ఇంకొకటుంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యక్తుల అధీనంలోవుండే పెద్ద తరహా పరిశ్రమలు నగరాలలోనూ, పట్టణాలలోనూ కేంద్రీకృతం అవుతాయి. ఆ విధంగా సాంకేతిక, శాస్త్ర విజ్ఞానాభివృద్ధి పట్టణాల గుత్తసొమ్ము అవుతూంది. పల్లెటి ప్రాంతాలు వెనుకబడి వుంటాయి. ఆ విధంగా పల్లెలకూ, పట్టణాలకూ మధ్య వైరుధ్యాలు తల ఎత్తేయి.

పట్టణాలలోనే ఆర్థిక కార్యకలాపాలన్నీ కేంద్రీకృతం కావడం అనవసరమూ, విపత్కరమూను. దానిని రద్దుచేయనిదే అందరికీ సమానావకాశాలుగల సామాజిక వ్యవస్థ ఏర్పడదు. వికేంద్రీకరణ వుద్దేశం పట్టణాలకూ, పల్లెలకు మధ్య వున్న వైరుధ్యాలను తొలగించడమే అయితే సర్వోదయవాదులతో

ఎవరికీ పేచీవుండదు. ఆధునిక పరిశ్రమలను దేశమంతటా సరిసమానంగా స్థాపించినప్పుడే ఆ వైరుధ్యాలు తొలగుతాయి. అంతేకాని పెద్దతరహా పరిశ్రమలను సాధ్యమైనంత ఎక్కువగా నిషేధిస్తే అవి తొలగవు. కాని, వారు పెద్దతరహా పరిశ్రమలే కేంద్రీకరణకు కారణమని తప్పుగా తలుస్తున్నారు. పరిశ్రమల్ని పట్టణాలలో కేంద్రీకరించకుండా నాలుగు మూలలా పంచాలని కోరడానికిబదులు, సాధ్యమైనంతవరకు పెద్దతరహా పరిశ్రమలను నిషేధించమంటున్నారు. వారి పథకం వలన పల్లెటూళ్ళు ఎప్పుడూ వెనకబడే వుండవలసివస్తుంది. పట్టణాలలోనూ, పల్లెలలోనూ కూడ ఉత్పత్తిశక్తి పెరగకుండా నిరోధించబడుతుంది. వికేంద్రీకరణ సరిగ్గా జరగాలంటే ఉత్పత్తి సాధనాలను జాతీయం చేయాలి. పట్టణాలలోనే ఆర్థిక కార్యక్రమాలు కేంద్రీకృతం కాకుండేటట్లు సాంకేతిక విజ్ఞానాన్ని, పరిశ్రమలనూ దేశమంతటా పరచుకొనేటట్లుచేయాలి.

భాషారాష్ట్రాల సమస్య

ఆదర్శ వ్యవస్థను గురించిన యీ పొరపాటు అభిప్రాయాలేగాక, ప్రధానమైన రాజకీయ సమస్యలమీద కూడ వినోబాజీ ధోరణికీ కాంగ్రెసు ప్రభుత్వాల ధోరణికీ తేడా కనబడదు. ఈ మధ్యకాలంలో భాషారాష్ట్ర సమస్య చాల ప్రాముఖ్యం వహించినది. మహారాష్ట్రంలోనూ, గుజరాత్ లోనూ ఈ సమస్యపై వచ్చిన ప్రజోద్యమాన్ని అణచివేసేటందుకు ప్రభుత్వం ప్రయత్నించింది. ఈ సందర్భంగురించి వినోబాజీ అభిప్రాయాలను వినండి :

"ఈనాడు దేశంలోని ప్రజలు మేము ఆంధ్రులమనీ, బెంగాలీలమనీ, ఇల్లాగే ప్రత్యేక ప్రత్యేక రాష్ట్రాలకు సంబంధించిన వారమంటూ గుడి కట్టేసుకొంటున్నారు...మానవ జాతి ఉన్నత శిఖరాలను కూడా అధిగమించినవాళ్ళు భారతీయులకన్న భిన్నులమని భావిస్తున్నారు. ఇప్పుడు నిజానికి మనం ఒక తమాషానే చూస్తున్నాము. రాష్ట్రాల పునర్నిర్మాణ సంఘం రిపోర్టు వెలువడ్డాక కొందరు ఆనందంతో గంతులు వేస్తూంటే, కొందరు దిగులుపడి పోయారు"

(వినోబా, [illegible] పుట 148)

మహారాష్ట్ర, గుజరాత్ ప్రజలకు వారివారి భాషా రాష్ట్రాల్ని ఇవ్వక మహాన్యాయం చేస్తూంటే వినోబాజీ విశాలహృదయం స్పందించనుకూడా లేదు.

భాషా రాష్ట్రంకోసం బొంబాయిలో ఆందోళన జరిగినప్పుడు కాంగ్రెసు ప్రభుత్వం క్రూరంగా కాల్పులు జరిపి నూర్గురు అమాయకులను పైగా చంపింది. వినోబాజీకి అహింస, సత్యంమీద అపరిమిత విశ్వాసం వుంది. దరిద్ర నారాయణుని యెడ ఎంతో సానుభూతి వుంది. పనిగట్టుకొని సాగిస్తున్న ఈ హత్యలకు ఆయన అసమ్మతి తెలుపుతారనీ, న్యాయ విచారణ జరగాలని కోరుతారనీ ఎవరైనా ఆశిస్తారు. కాని ఆయన అన్నమాటలు కాంగ్రెసు ప్రభుత్వానికి పూర్తి అభినందన పత్రాన్నిచ్చేయి.

"రాష్ట్ర పునర్నిర్మాణానికి సంబంధించిన ప్రతిపాదనల ఫలితం దేశంలో ఈమధ్య వచ్చిన కల్లోలాలకు నేను చాల విచారించేను...గడచిన అయిదారేళ్ళలో పోలీసులు అనేక

పర్యాయాలు కాల్పులు చేసేరు. కొన్ని సందర్భాలలో అవెందుకు జరిగేయో విచారణే లేదు. కాల్పులు చేయడం మంచిదా కాదాయనేది నేను చెప్పదలచుకోలేదు. అదేదో సహజమైనదీ, సాధారణమైనదీగా తీసుకోమని నేను చెప్పడం లేదు. ప్రజలు దౌర్జన్యాలకు పూనుకొంటే ప్రభుత్వమూ ప్రారంభిస్తుంది. ఉభయపక్షాలూ "చిన్నపాటి దౌర్జన్యచర్యల" మీద నమ్మకం గలవే.

(అదే పుస్తకం, పుట 164)

కాంగ్రెసు ప్రభుత్వ విధానాలమీదనూ, పద్ధతుల మీదనూ బహిరంగంగా వ్యాఖ్యానంచేసి వారిని ఇబ్బంది పెట్టరాదనేది వినోబాజీ పెట్టుకొన్న ఆశయంలా కనిపిస్తుంది. ఆయనకు వారి పద్ధతులూ, విధానాలూ నచ్చవనేది స్పష్టంగా కనిపిస్తూనే వుంది.

## ప్రైవేట్ రంగం, ప్రభుత్వ రంగం

ప్రైవేట్ రంగం, ప్రభుత్వ రంగం గురించి ఆయన ఇల్లా అన్నారు:

"సోషలిస్టు తరహా సమాజాన్ని నిర్మించాలని ప్రభుత్వం మనకు చెప్తూంది. దానికోసం ప్రైవేట్ రంగాన్ని తగ్గించి, ప్రభుత్వ రంగాన్ని పెంచాలంటూంది. ఈ రెండు రంగాల మధ్యా వైరుధ్యం ఏమిటో నా కర్థం కావడంలేదు. చేయి కంటే వేళ్లుచేసేపని ఎక్కువగదా అని అడుగుతే ఏంచెప్తాను? చేయి ప్రభుత్వరంగమూ, వేళ్లు ప్రైవేట్ రంగమూ అనుకోండి! అవి చేసేపని ఒక్కటే. అయితే తేడా ఎక్క

డొచ్చింది? ఎందుకొచ్చింది? వ్యాపారి బృందం తమ కాలాన్ని, ప్రతిభనీ సమాజంయొక్క లాభంకోసం వుపయోగిస్తే ప్రైవేట్ వ్యాపారం ప్రజలదే అవుతుంది.

(అదే పుస్తకం, పుట 380)

మరొకచోట –

"మన పూర్వీకులకి వ్యాపారస్థులమీద ఎంతో విశ్వాసం వుండేది. వారికెంతో శక్తివుంది. దానిని ప్రపంచాన్ని వుద్ధరించేటందుకు ఉపయోగిస్తారు. వారు సమాజానికి సేవకులు కావాలి. పాలల్లో పంచదార కలిసిపోయినట్లు కలిసిపోవాలి... గాంధీజీకోసం వ్యాపారస్థులంతా ముందుకొచ్చి ప్రపంచాన్ని ఉద్ధరించాలి. వైశ్యధర్మం ఏమిటో వారికి తెలుసు. వారి ప్రేమ, నిరాడంబరత్వం, నిర్మాణ కుశలతలను సమాజం క్షేమంకోసం వినియోగిస్తే ప్రభుత్వం భయాలన్నీ తొలగిపోతాయి."

(అదే పుస్తకం, పుట 280)

కాని ఒక్కొక్కప్పుడు వారినే వినోబాజీ నిర్మొగమాటంగా ఖండిస్తారు.

"దొంగతనాన్ని తప్పు అంటాము. కాని ధనరాసులు పోగుచేసుకొని ఈ దుర్మార్గాన్ని ప్రోత్సహిస్తున్న వారినేమీ అనం దొంగతనం చేసినవాళ్ళని జైళ్ళలో మగ్గపెడతాం. కాని, వారిని ఆ పనికి ప్రోత్సహించిన వారిని యథేచ్ఛగా తిరగనిస్తాం; వారిని పెద్దమర్యాదస్థుల్ని గావిస్తున్నాం. ఇది న్యాయమేనా?"

(అదే పుస్తకం, పుట 274)

మరల ఇంకోచోట ;

"ఎంతో ధనవ్యయ కారణమైన పరిపాలనాశాఖను ఇతర ప్రభుత్వశాఖలను 'సర్వీసెస్' * అంటారు. ఈ 'సర్వీసెస్' ఎన్నో వున్నాయి : సివిల్ సర్వీసు, మెడికల్ సర్వీసు, ఎడ్యుకేషన్ సర్వీస్. వీటి అధికార్ల జీతాలు నాలుగు అంకెల మీద వుంటాయి. వారి సేవలందుకొనే దేశంలోని బీదప్రజ రోజుకు అర్ధరూపాయితో కాలం గడుపుతున్నారు. లక్షలు సంపాదించే వారందర్నీ ప్రజాసేవకులంటారు. దేశానికి కావలసిన తిండిని ఉత్పత్తి చేసేవారిని స్వార్థపరులనీ తమ లాభమే తప్ప వారికి మరొకటి పట్టదనీ అంటారు. ఈ 'సర్వీసెస్'ని గురించి ఏమంటాం? ఏ మాటకన్నా అర్థం వుందంటే యీ మాటకు మాత్రం అర్థంలేదు. పట్టి మోసం."

(అదే పుస్తకం, పుట 275)

మధ్యమధ్య వినోబాజీ సాధారణ ప్రజ పక్షాన అంత తీవ్రమైన ఆవేశమూ ప్రకటిస్తారు.

ఆయనకు కమ్యూనిస్టులతో అభిప్రాయ భేదాలు వున్నా వారియెడ స్నేహభావాన్నే ప్రకటిస్తారు. విశాలహృదయంతో, సహాన భావంతో ఆయన వారి దృక్పథాన్ని అర్థం చేసుకొన ప్రయత్నిస్తారు : "వారియెడ నాకు వ్యతిరేకభావం లేదని కమ్యూనిస్టు మిత్రులకు చెప్పదలచేను. వారియెడ నాకు సద్భావమే వుంది. హృదయంలో ఏం వుందో చూడడానికి భగవంతుడు కిటికీ పెట్టివుంటే బాగుండేది. అల్లాంటిదే

---

* సేవకోసం వుద్దేశించబడినవని అర్థం. తెలుగులో వీటన్నింటినీ ప్రభుత్వశాఖలనే వాడుతాం.

వుంటే నా హృదయంలో కమ్యూనిస్టులయెడ గల ప్రేమ కనిపించి వుండేది."

(అదే పుస్తకం, పుట 239)

"కమ్యూనిస్టులు విధ్వంసకారులని కొందరంటారు. కాని నేనల్లా అనుకోను. మార్క్స్ మహర్షి రచన అనేక వేలమందిని మార్చేసింది. అయినా కమ్యూనిస్టులు హృదయ పరివర్తనయెడ నమ్మకం లేదంటారు. అక్కడే వారికీ నాకూ అభిప్రాయభేదం. హృదయ పరివర్తన సిద్ధాంతానికి మీరే ఒక నిదర్శనమని కమ్యూనిస్టులతో నే నంటాను."

(అదే పుస్తకం, పుట 189)

"కమ్యూనిస్టులలో చాలమంది నాకు మిత్రులున్నారు. వారియెడ నాకు చాల గౌరవభావం వుంది. మొదట్లో వారికి నామీద అనుమానం వుండేది. కాని నేను హృదయ పరివర్తన కలిగించేటందుకై ప్రయత్నిస్తున్నాననీ, నేను తమ మిత్రుడననీ వారిప్పుడు గ్రహించేరు."

(సర్వోదయ[illegible] భాగం : పుట 44)

## ముగింపు

'న్యూఏజ్' పత్రికలో సర్వోదయంమీద జరిగిన చర్చలలో చాల సమస్యలు స్పష్టం అయినాయి. రచయితలు సర్వోదయం యొక్క వివిధ అంశాలను తీసుకొని మార్క్సిజంతో పోల్చి వ్రాసేరు. కొందరు సర్వోదయం యొక్క తాత్విక మూలంమీద వ్రాస్తే మరికొందరు దాని పద్ధతులనూ, ఆశయాలనూ వివరించేరు

మార్క్సిజానికీ సర్వోదయానికి చాల దగ్గర పోలిక లున్నాయన్నారు కొందరు; అయితే కొందరు ఆ సిద్ధాంతాని కున్న సామాజిక ప్రాముఖ్యతను అంతగా పట్టించుకోలేదు. ఏమైనా మొత్తంమీద వ్యాసరచయితలు చర్చలో చాలా ఉన్నతస్థాయిని ప్రదర్శించేరు. సర్వోదయ సిద్ధాంతం గురించీ, ఉద్యమం గురించీ పాఠకులు బాగా అర్థం చేసుకోనేటందుకు తోడ్పడ్డారు.

భారతీయ సామాజిక జీవనంలోని అనేక భావనల సమ్మిశ్రణమే వినోబాజీ సిద్ధాంతమూ, సర్వోదయతత్త్వమూ. అంతవరకు మనం గట్టిగా చెప్పవచ్చు. భారతీయ సమాజాన్ని ఎదుర్కొంటున్న భూసమస్య సర్వోదయ కార్యకర్తల తక్షణ కార్యక్రమంలో ప్రధానపాత్ర వహిస్తూంది. కమ్యూనిస్టు భావాల ప్రభావం ఫలితంగా వారు వర్గరహితమైన ఆదర్శ సమాజాన్ని గురించి ఆలోచిస్తున్నారు. ఆ సమాజంలో "శక్తికొలదీ పని, అవసరాన్ని పట్టి అనుభవం" అనే సూత్రం అమలు జరగాలంటున్నారు. వారు ఏంగెల్సు పుస్తకం నుంచి ఉదహరిస్తూ, సమాజంలో మనుష్యులను పరిపాలించే పద్ధతి పోయి వస్తువులను సర్దుబాటుచేసే పద్ధతి రావాలంటున్నారు.

రెండో వేపున వారు రాజకీయ పోరాటాన్ని సిద్ధాంత రీత్యా పరిష్కరించాలంటారు. నూతన నిర్మాణాత్మక సత్యాగ్రహం పేరుతో వారు అసలు పోరాటమే కూడదంటారు. పార్లమెంటును గురించి, అధికసంఖ్యాకుల పరిపాలన గురించి, రాజకీయ పార్టీలను గురించి వినోబాజీ ప్రకటించే అభి

ప్రాయాలు వాస్తవానికి అనుగుణంగా లేవు. నూతన సామాజిక వ్యవస్థ పెంపొందేటందుకవి తోడ్పడతాయనలేము.

సర్వోదయ వాదులు సమాజంలోని వాస్తవ పరిస్థితులను విస్మరించి హృదయ పరివర్తన తీసుకురావడానికి ప్రచారాన్నే ప్రధానంగా తీసుకొంటున్నారు. వారు ప్రజలకు మంచి చేయాలన్న సదుద్దేశంతోనే ప్రస్తుత సమాజస్థితిని విమర్శిస్తున్నారు. భూమిమీద వ్యక్తిగత హక్కు వుండరాదంటున్నారు. ప్రస్తుత వ్యవస్థలోని అన్యాయాన్ని ఖండిస్తున్నారు. కాని ఈ దుస్థితులకు విరుగుడుకోసం భవిష్యత్తువేపు చూడడానికి బదులు గతం వేపు చూస్తున్నారు. చిన్న తరహా ఉత్పత్తి, గ్రామ స్వయం సంపూర్ణత్వం కావాలంటున్నారు. విజ్ఞాన శాస్త్రములన్నా, పెద్ద తరహా పరిశ్రమలన్నా భయం తెలుపుతున్నారు.

రాజ్యాంగ యంత్రాన్ని గురించీ, అది డుల్లిపోవడం గురించి సర్వోదయవాదుల అభిప్రాయం తప్పు ధోరణిలో వుంది. రాజ్యాంగ యంత్రానికి వ్యతిరేకంగా పోరాటం వద్దంటారు వారు. దానిని నిల్చున్నపాటున రద్దు చేసెయ్యాలంటారు. సమాజంలో మార్పు రావాలంటే ప్రజాపోరాటం జరగాలి. కాని వారు అది పనికిరాదంటారు. ఫలితంగా వారి ఆదర్శాలూ, తక్షణ ఆశయాలూ అనాచరణీయాలుగా తయారయేయి.

ప్రభుత్వం భూదాన, గ్రామదానాలకు ప్రోత్సాహం ఇస్తూన్నా – ఆ ఇవ్వడమే వ్యతిరేక ఫలితాలకు కారణం

ఏమో – వాటివలన కలిగే లాభం ఎంత అల్పమో కనిపించనే కనిపించింది.

వారు తాము గాంధీజీ అనుచరుల మనుకొంటారు. కాని గాంధీజీ రాజకీయ పోరాటాలను నడిపి ప్రజా నాయకు డయ్యాడు. ఆ ఆదర్శాన్ని వారు నిరాకరిస్తున్నారు. వినోబా జీతో కలిసి పనిచేస్తున్న స్వార్థ చింతలేని యీ కార్యకర్తల యెడ అందరూ గౌరవభావమే కలిగివుంటారు. వినోబాజీ కార్యక్రమాల వెనుకనున్న దీక్షను అందరూ అభినందిస్తారు. వారి ప్రయత్నాల ఫలితంగా మన దేశంలోని గ్రామీణ ప్రజలకు కొంతయినా మేలు కలగాలని అందరూ వాంఛిస్తారు. కాని వారు తమ దృక్పథాన్ని మార్చుకోవాలి. సమాజంలో వున్న హెచ్చు తగ్గులకూ, అన్యాయాలకూ వ్యతిరేకంగా ప్రజానీకాన్ని నడిపించేటందుకు పూనుకోవాలి. అంతవరకూ వారి మహదాశయాలు నెరవేరవు.

టాల్‌స్టాయిని అభినందిస్తూ లెనిన్ వ్రాసిన మాటల నిక్కడ వుదహరించడం అసంగతం కాజాలదు :

"భూమిపై వ్యక్తిగత ఆస్తిహక్కును ఆయన నిర్మొగ మాటంగా ఖండించేరు. అది ఆ చారిత్రకదశలో రైతాంగం యొక్క మనస్తత్వాన్ని చూపిస్తుంది. ఆనాడు మధ్యయుగాల భూమిహక్కు పద్ధతి – అంటే అటు భూస్వాముల జమీలు, ప్రభుత్వపు 'కేటాయింపు' భూములూ కూడ దేశపురోభి వృద్ధికి ఎంతో ఆటంకకరం అయినాయి. దానిని పూర్తిగా దయాదాక్షిణ్యాలు లేకుండా నిర్మూలించాక హృదయాన్ని గాయపరచిన బాధతో, ఎంతో కోపంతో ఆయన పెట్టుబడి

దారీ విధానాన్ని నిరంతరం ఖండిస్తూ వచ్చేరు. పట్టణం నుంచో, పై దేశంనుంచో ఎవరో కొత్త ప్రదేశం మీదపడి గ్రామీణ జీవితానికిగల పునాదుల్ని నాశనంచేస్తూ, ఎంతో వినాశం, దారిద్ర్యం, ఆకలిచావులు, పతనం, వ్యభిచారం, సవాయిరోగాలు మొదలయినవానిని వ్యాపింప చేస్తూంటే మిస్టర్ కాపన్ కనిపెట్టిన కొత్తకొత్త నవీన దోపిడీ పద్ధతులు రష్యాను భూభాగంమీద ప్రవేశపెట్టినప్పుడు 'ప్రాథమిక పెట్టుబడి సమీకరణ' దుష్ఫలితాలన్నీ నూరింతలుగా కనబడు తూంటే కుటుంబ పెద్దరికం అనుభవించిన రైతు ప్రకటించే ఆవేశాన్నీ బాధనూ ఆయన కనబరిచేరు.

"కాని, ఆ ప్రొఫెట్లెంటు, ఆవేశపూరితుడైన ఆ విమర్శకుడు అస లాదుస్థితికి మూలం ఏమిటో తన రచనల్లో చూపలేకపోయేరు. రష్యాలో వ్యాపిస్తున్న ఆ దుస్థితికి పరిష్కారం ఏమిటో చూపలేకపోయేరు. యూరపులో విద్యనేర్చిన రచయిత లక్షణం కాదది. కుటుంబ యజమాని యైన అమాయక రైతు ధోరణి అది. ఫ్యూడల్, పోలీసు రాజ్యాంగానికీ, రాచరికానికీ వ్యతిరేకంగా పోరాడడం అంటే ఆయన దృష్టిలో రాజకీయాలను విసర్జించడమే. అది చివరకు 'దుర్మార్గాన్ని ప్రతిఘటించకు' అనే సిద్ధాంతానికి దారితీసింది. 1905–07 లో సాగిన విప్లవ పోరాటానికి పూర్తిగా దూరంగా వుండేలా చేసింది. చర్చి అధికారాన్ని వ్యతిరేకించి పోరాడ డంతోపాటు విశుద్ధమైన కొత్త మతాన్ని – అంటే సరికొత్త విషాన్ని, కనబడకుండా నాశనంచేసే విషాన్ని – పీడిత ప్రజ లకు బోధించేరు. భూమిమీద వ్యక్తిగత ఆస్తిహక్కు వుండ

రాదని ఆయన చెప్పడంవలన పోరాటం అసలు శత్రువైన భూస్వామ్య విధానం మీాద కేంద్రీకృతం కాలేదు. ఆ భూస్వామ్యవర్గంయొక్క రాజకీయాధికార సాధనం అయిన రాచరికంమీాద కేంద్రీకృతంకాలేదు' అస్పష్టమైన, అసమర్థుని ఆవేదనతో కలలుగనడం ఒక్కటే మిగిలింది. పెట్టుబడిదారీ విధానాన్నీ అది ప్రజానీకానికి కలిగిస్తున్న కష్టాలనూ ఖండిస్తూనే, ఆయన వానినుంచి విముక్తి పొందేటందుకు అంతర్జాతీయ సోషలిస్టు శ్రామికవర్గం సాగిస్తున్న ప్రపంచ పోరాటం యెడ నిర్లిప్తత చూపించేరు."

—'న్యూ ఏజ్', ఆగస్టు, సెప్టెంబరు 1958

